1571 ROP

# శ్రీ భగవద్దత్తం సాధనముగ



శ్రీ

# మహాభాగవత నవనీతము

ACC No 14342

## ద్వితీయ భాగము

COPIES AVAILABLE.
C/o. M. Krishna Mohan.
State Bank. A. D. B,
ANANTAPUR.

గ్రంథకర్త:

మామిళ్ళపల్లి నరసింహం,
B.Sc (Hons) B.Ed.

రసాయనశాస్త్ర ప్రధాన అధ్యాపకులు (రిటైర్డ్)

[illegible] (ఆం.ప్ర.)

COPIES AVAILABLE.
C/o. M. Krishna Mohan.
State Bank. A. D. B.
ANANTAPUR.

జనవరి 1989

వెల: రూ. 30-00

# SRI BHAGAVADGITA MATHANAMU

# SRI MAHA BHAGAVATA NAVANITAMU

by

Sri Mamillapalli Narasimham

ACC No-14342

NAR

ప్రథమ ముద్రణ : జనవరి 1989

ప్రతులు : 1000

సర్వస్వామ్యములు గంథకర్తవే

Copies Available:

M. KRISHNA MOHAN,
State Bank, A. D. B., Anantapur.

ముఖపత్ర చిత్రీకరణ:

శ్రీ ఎం. వెంకటేశ్వరరావు, కొడిగెనహళ్ళి-హిందూపురం.

ముద్రణ :

లేపాక్షి ఆర్ట్ ప్రింటర్స్, 3 & 4, శ్రీనివాస బిల్డింగ్స్,
పెనుకొండ రోడ్, హిందూపురం - 515 201 (ఎ. పి.)



This book is pubished with the
financial assistance by
Tirumala-Tirupati Devasthanams
under the scheme

"AID TO PUBLISH RELIGIOUS BOOKS"
Rs. 10,000-00

---

and also by Telugu University, Hyderabad.

Rs. 1000-00

# సహృదయ సహకారము

ఈ గ్రంథ ప్రచురణకు తోడ్పడిన ఇతరదాతలు :

| | |
|---|---|
| శ్రీ కె. రాధాకృష్ణయ్యగారు | రూ. 1000-00 |
| శ్రీ పి. ఎల్. ఎన్. రెడ్డిగారు | 1000-00 |
| శ్రీ సుంకప్పగారు, మండల్ ఆఫీసర్ | 716-00 |
| శ్రీ కొత్తూరు ఆర్యవైశ్య సంఘం, అనంతపురం | 500-00 |
| శ్రీ పాతూరు ఆర్యవైశ్య సంఘం, ,, | 500-00 |
| శ్రీ మేడా సుబ్బయ్యగారు | 500-00 |
| శ్రీ మేడా సుబ్రమణ్యంగారు | 500-00 |
| శ్రీ బసయ్యగారు | 250-00 |

సర్వశ్రీ రూ. 116/-లు ఇచ్చిన దాతలు

| | |
|---|---|
| పరుచూరి కృష్ణమూర్తిగారు | తాళంకి కృష్ణమూర్తిగారు |
| బి. రామచంద్రన్‌గారు | కామర్తి బసణ్ణగారు |
| స్వామి కె. సి. వెంకటసుబ్బయ్యగారు | సింగనమల శంకరయ్యగారు |
| నల్లయ్యగారి గోపాలయ్యగారు | గార్లదిన్నె ఓబన్నగౌడుగారు |
| పటాభిగారు | ఎల్లనూరు ప్రకాశంగారు |

మరియు శ్రీ కె. రామయ్యగారు—రూ. 58-00

# వినుతి

శ్లో॥ సత్యజ్ఞాన సుఖస్వరూప మమలం క్షీరాబ్ధి మధ్యే స్థితం
యోగారూఢ మతిప్రసన్న వదనం భూషా సహస్రోజ్వలం
త్ర్యక్షం చక్ర పినాకసాఽభయవరాన్ బిభ్రాణ మర్కచ్ఛవిం
ఛత్రీభూత ఫణీంద్ర మిందు ధవళం లక్ష్మీనృసింహం భజే.

శ్లో॥ సుధావల్లీ పరిష్వంగ సురభీకృత వక్షసే
ఘటికాద్రి నివాసాయ శ్రీ నృసింహాయ మంగళం॥

A man would do nothing, if he waited until he could do it so well that no one could find fault with what he has done.

—Cardinal Newman

"అపశబ్దంబుల గూడియున్ హరి చరిత్రాలాపముల్
సర్వపాప పరిత్యాగము సేయు" —పోతన

భాగవతము 1-97

అంకితం

**శ్రీ ఘటికాచల లక్ష్మీనరసింహస్వామి వారికి**

# అట్టమీది బొమ్మ

## హరిహరనాథుడు—రాజశేఖరుడు

బమ్మెర పోతన గృహదైవము శివుడు. ఆతని తలిదండ్రులు శివభక్తులు. అన్నయు శివభక్తుడే. ఒకనాడు పోతన ఈశ్వరధ్యానము సేయుచున్నప్పుడు "రాజశేఖరు"డగుపించెనట. "రాజు" అనగా చంద్రుడు, "శేఖరు" డనగా శిరమునందు కలవాడు. అందువలన చంద్రశేఖరుడైన శివుడు ఈశ్వరధ్యానము సేయుచున్న పోతన కగుపించెనని భావించవచ్చును.

కాని రాజశేఖర పదమునకు రాజులలో శ్రేష్ఠుడను అర్థముకూడ చెప్పుటకు వీలగుచున్నది. పోతనకు దర్శనమిచ్చిన రాజశేఖరుడు (రాజశ్రేష్ఠుడు) శ్రీరాముడు. "ఏను రామభద్రుండ. మన్నామాంకిత మగు కావ్యంబు రచింపు" మని రాముడు ఆదేశించెను. ఆ విధముగనే పోతన భాగవతమును రచించి శ్రీరామున కంకితము చేసినను శ్రీకృష్ణపరముగా భాగవతమున షష్ఠ్యంతములు వ్రాసెను. శ్రీకృష్ణుడర్జునకు గీత నుపదేశించెను.

గమనింపదగిన దేమనగా శివకేశవ భేదము పాటింపక తిక్కన హరిహరనాథుని భావించినట్లే పోతన శివరామకృష్ణమూర్తియగు రాజశేఖరుని భావించి అభేదభక్తిని వ్యక్తపరచెను.

అట్టమీది బొమ్మ అభేదభక్తికి తార్కాణమగు రాజశేఖరుని సూచించుచున్నది.

"ఏకం సత్ విప్రా బహుధా వదంతి"

# విన్నపము

## (ద్వితీయ భాగము)

రామాయణము మహాకావ్యము; భారతము మహేతిహాసము; భాగవతము మహాపురాణము. కావ్యేతిహాసములైన రామాయణ భాగవతములు మానవునకు బాధ్యతాయుతమైన ప్రవృత్తి ధర్మము నెక్కువగా బోధించు చున్నవి. భాగవత పురాణము మోక్షధర్మమైన నివృత్తి ధర్మమును విధిగా ఆచరించవలెనని ఆదేశించు చున్నది. మానవునకు ప్రవృత్తిధర్మము బాధ్యత, నివృత్తి ధర్మము విధి. ఈ గ్రంథము రెండవ భాగములో భాగవత కథలను వివరించి భాగవత భక్తులు కర్మ భక్తి ధ్యాన జ్ఞాన మార్గము లవలంబించి నివృత్తి ధర్మమును ఆచరించు విధానములను తెలుప బూనితిని.

భాగవతమున వ్యాసుడు మోక్షధర్మమును కర్తవ్యాకర్తవ్యము లైన విధి నిషేధరూపమున వివరించెను. వానిని సప్రమాణముగా భాగవతుల కథలచే నిరూపించెను. దానిచే శ్రోతలకు భాగవతధర్మము ననుసరించి తరించుటకు తగిన ప్రేరణ కలిగించెను. "బాదరాయణుడు తా కల్పించె నేర్పొప్పగన్" అను భాగవత వాక్యాధారముగ ఈ కథలను కల్పనా కథలని, అర్థవాదములని, కొందరు వాదించినప్పటికిని శుకుడు వానిని క్రింది ప్రయోజనముల నుద్దేశించి చెప్పినట్లు భాగవతమున చివర తెలిపెను.

"విజ్ఞాన వైరాగ్య వివక్షయా"

అనగా పాఠకులకు, శ్రోతలకు, విజ్ఞానము వైరాగ్యము కలిగించి, తద్వారా జీవన్ముక్తులను చేయుటకని అర్థము.

భాగవతము కేవలము భాగవతుల కథల సంపుటి మాత్రమే కాదు. "ఉత్తమ శ్లోక చరితము" "ఉత్తమః పురుషస్త్వన్యః పరమాత్మేత్యుదాహృతమ్" అను భగవద్గీతా వాక్యము సూచించినట్లు భాగవతము పురుషోత్తముడు, పరమ పురుషుడు నైన భగవంతుని చరిత్రముకూడ.

ఐశ్వర్యస్య సమగ్రస్య వీర్యస్య యశసశ్శ్రియః
జ్ఞాన వైరాగ్యయో శ్చైవ షణ్ణాం భగవతీరితః"

"భగ" శబ్దము ఐశ్వర్యము, వీర్యము, యశస్సు, శ్రియము, జ్ఞానము, వైరాగ్యము అను వానిని సూచించును. పై లక్షణములు కలవాడే భగవంతుడు. అట్టి శ్రీకృష్ణ భగవానుడు అవతారమును చాలించగనే కలియుగము ప్రవేశించినది.

ధర్మ వృషభము యొక్క నాలుగు పాదములలో మూడు పాదములు నశించి ఒక పాదము మిగిలినది. ఈ సందర్భమున వ్యాసుడు నివృత్తి ధర్మ ప్రబోధకమైన భాగవత పురాణమును వ్రాసెను. దీనికి ముందు ప్రవృత్తి ధర్మము ప్రబోధించుటకై భారతమును వ్రాసెను. భారతములో వేదోపనిషత్తుల సారమైన భగవద్గీతలోని సిద్ధాంతములకు భాగవత కథల రూపమున దృష్టాంతముల సమకూర్చెను. పాఠకులు కథలను కేవల కల్పనా కథలని భావింపరాదని ఈ కథల సంకేతార్థములను ఈ భాగమున వివరింప బూనితిని.

ఇంకను ఈ భాగమునందు

1. భగవ దవతార తత్త్వము
2. షట్ దర్శనములకు భాగవత భగవద్గీతలకు గల సంబంధము
3. భాగవత కల్పవృక్ష సంకేతము
4. పోతన మహాకవి ప్రశంస – ప్రతిజ్ఞ

అను అంశములను అనుబంధముగా వివరించితిని.

భాగవతామ్నాయము భువన క్షేమంకరము. ఈ ఆమ్నాయమును విన్నచో "భవములం దప్పింపగా జాలుభక్తి విశేషంబు జనించు"ను. నిగమములు వేయి చదివినను ముక్తిమార్గము సులభముగా గోచరింపదు. త్రిజగన్మంగళమైన భాగవతము పఠించు వారికి ముక్తి కరతలామలక మగును.

క॥ నిగమములు వేయి చదివిన
సుగమంబులు కావు భక్తి సుభగత్వమునన్

మోక్షంబు భాగవత మను
నిగమంబు పఠింప ముక్తి నివసనము బుధా

భాగవతము 1-140

భాగవతశ్రవణము వలన "విష్ణుసేవా బుద్ధి విస్తరిల్లు, మోక్ష కాముకునకు మోక్షంబు సిద్ధించు. భవభయంబు లెల్ల బాసిపోవు" (భాగవతము 2-7) అని శుకుడు పరీక్షిత్తునకు తెలిపెను.

బోయనపల్లి వెంకటాచార్య ప్రణీతమైన "శ్రీ మద్భాగవత మాహాత్మ్య" మను పద్యకావ్యములో యోగజ్ఞానములు భక్తిచేతనే వికసించుననియు భాగవత శ్రవణము ప్రేతత్వ విముక్తి కలుగజేయు ననియు కథల మూలకముగా చెప్పబడినది.

బ్రహ్మ భాగవతము నిట్లు వర్ణించెను. "నిగమార్థ ప్రతిపాదక ప్రకటమై నిర్వాణ సంధాయిగా భగవంతుండు రచింప భాగవత కల్పక్షోణిజమై శాస్త్రహాది గరిష్ఠంబగు నీ పురాణకథ

భాగవతము 2-212

భువన క్షేమంకరంబైన భాగవతామ్నాయమును బాదరాయణుడు నేర్పొప్ప కల్పించెను.

భాగవత ప్రతిపాదిత భగవ దవతార తత్త్వమును గ్రహించి కథలలోని కలి సంతారకమైన భాగవత ధర్మము ననుష్ఠించిన మానవుడు మోక్ష సామ్రాజ్యమునకు రాజశేఖరుడై సాయుజ్యముక్తిని గాంచ గలడు.

ఇట్లు
భాగవత విధేయుడు
పరిమిశెట్టిపల్లి నరసింహం
గ్రంథకర్త.

# సహృదయ సహకారము

—ఈ గ్రంథ ముద్రణమునకు తోడ్పడిన దాతలు—

| | రూ. |
|---|---|
| శ్రీ పి. కోనప్పశాస్త్రిగారు | 300-00 |
| శ్రీ ఆర్. యస్. మణిగారు | 250-00 |
| శ్రీ జూటూరి రమణయ్యగారు | 250-00 |
| శ్రీ అచ్యుతరావుగారు | 116-00 |
| శ్రీ విశ్వమూర్తిగారు | 116-00 |
| శివశంకర మెడికల్‌స్టోర్స్, అనంతపురం | 116-00 |
| శ్రీ కామిశెట్టి సుబ్బారావుగారు | 116-00 |
| శ్రీ ఆదినారాయణరెడ్డిగారు | 116-00 |
| శ్రీ కె. వి. రత్నం శెట్టిగారు. (హిందూపురం) | 116-00 |
| శ్రీ జూటూరి వేమయ్యగారు | 100-00 |
| శ్రీ ఇ. రంగయ్యశెట్టిగారు | 68-00 |

# విషయసూచిక

# శ్రీ భగవద్గీతా మథనము

# శ్రీ

# మహాభాగవత నవనీతము

## ద్వితీయ భాగము

## 9. భాగవతము - భాగవతులు

### భాగవతు లెవరు?

"భగవంత మధికృత్య కృతం పురాణం భాగవతం" భాగవతము భగవత్తత్త్వార్థ ప్రతిపాదకము. భాగవతమున భగవత్ సంబంధము లైన భక్తి వేదాంత విచారములేకాక, భాగవతుల కథలు, ఆ భాగవతులు పాటించు పథము వివరింపబడినవి. భగవంతుని చరితము భాగవతుల కథలతో ముడిపడియుండుట సహజమే కదా!

భాగవతమునందు కుచేలుడు, గజేంద్రుడు, ప్రహ్లాదుడు, రుక్మిణీ దేవి, బలి మొదలగు భాగవతుల కథలు కలవు. ఇవిగాక ధృవ, భరత, అజామీళ, చిత్రకేతు, పురంజన, అంబరీష, రంతిదేవాది ఉపాఖ్యానములు కలవు. వీరు పాటించిన భాగవత మార్గమును గ్రహించిన గాని భాగవత హృదయ మవగతము కాదు.

## భాగవతం లెవ్వరు?

సీ॥ కృత్యంత విశ్రాంత మత్యను క్రమణీయ
భగవత్ప్రసంగతుల్ భాగవతులు
సనకాది ముని యోగి జన సదానందైక
పరమ భాగ్యోదయుల్ భాగవతులు
కృష్ణ పదధ్యాన కేవలామృత పాన
పరిణామ యుతులు శ్రీ భాగవతులు
బహుపాతకానీక పరిభవ ప్రక్రియా
పురుషోగ్ర మూర్తులు భాగవతులు

తే॥ భావతత్త్వార్థ వేదులు భాగవతులు
బ్రహ్మవాదాను వాదులు భాగవతులు
సిరులు దనరంగ నెన్నడు జేటులేని
పదవి నొప్పారు వారు వో భాగవతులు.

భాగవతము 6-186

నవవిధ భక్తి మార్గములతో మనో వాక్కాయకర్మలను భగవంతునివైపు మరల్చి శరణు జొచ్చినవారే భాగవతులు.

శ్లో॥ శ్రీ విష్ణోః శ్రవణే పరీక్షిద భవత్; వైయాసికః కీర్తనే
ప్రహ్లాదః స్మరణే; తదంఘ్రిభజనే లక్ష్మీః, పృథుః పూజనే
అక్రూర స్త్వభివందనే; కపిపతిః దాస్యేచ, సఖ్యేర్జునః,
సర్వ స్వాత్మనివేదనే బలిరభూత్ కృష్ణాప్తి రేషా ఫలమ్

శ్రవణముచే పరీక్షిత్తు కీర్తనచే శుక నారదాదులు స్మరణచే ప్రహ్లాదుడు, పాదభజన వలన లక్ష్మీదేవి పూజించుటచే పృథు చక్రవర్తి, నమస్కరించుటచే అక్రూరుడు, ధ్యానముచే ఆంజనేయులు, సఖ్యముచే అర్జునుడు, ఆత్మ నివేదనముచే బలి, ఇట్లు నవవిధ భక్తి మార్గములచే తరించిరి.

## ప్రాకృత మధ్యమ ఉత్తమ భాగవతులు :

భాగవతులు ప్రాకృతులు మధ్యములు ఉత్తములని భాగవతము విభజించినది.

శ్లో॥ అర్చాయామేవ హరయే పూజాం యః శ్రద్ధయేహతే
న తద్భక్తేషు చాన్యేషు స భక్తః ప్రాకృత స్మృతః
భాగవతము 11-2-47

ఎవడు విష్ణు ప్రతిమలను మాత్రమే శ్రద్ధతో బూజింప గోరు చున్నాడో, విష్ణు భక్తులను పూజింప గోరడో, ఇతరులను పూజింప గోరడో అతడు ప్రారంభకుడు.

శ్లో॥ ఈశ్వరే తదధీనేషు బాలిశేషు ద్విషత్సుచ
ప్రేమ మైత్రీ కృపోపేక్షా యః కరోతి స మధ్యమః
11-2-46

ఈశ్వరుని యందును, ఈశ్వరభక్తుల యందును, నీచులందును శత్రువులందును, వరుసగా ఈశ్వరునందు ప్రేమ, తద్భక్తులందు మైత్రి, మూఢులు లేక నీచులందు కృప, శత్రువు లందు పేక్ష జూపువాడు భాగవత మధ్యముడు.

శ్లో॥ సర్వభూతేషు యః పశ్యే ద్భగవద్భావ మాత్మనః
భూతాని భగవత్యాత్మ న్యేష భాగవతోత్తమః
భాగవతము 11-2-45

తే॥ సర్వభూత మయుండైన సరిసిజాక్షు
డతడె తనయాత్మయందుండు ననెడువాడు
శంఖచక్రి దరుండంచు జనెడువాడు
భక్తి భావాభిరతుడువో భాగవతుడు —భాగవతము

శ్లో॥ యోమాం పశ్యతి సర్వత్ర సర్వంచ మయి పశ్యతి
గీత-6-30

ఎవడు సర్వభూతములందు బ్రహ్మభావమును, ఆత్మభావమును

చూచునో భగవంతుని యందును ఆత్మ యందును సర్వ భూతములను చూచునో వాడు భాగవత శ్రేష్ఠుడు.

## భక్తులస్థాయి:-

భగవంతునకు శరణాగతులైన భాగవతులు వారి స్థాయిని బట్టి మూడు విధములు.

## మొదటిస్థాయి:-

ఈ స్థాయిలో శరణాగతులైన భక్తులు మందాధికారులు. వీరు భగవంతునకు పత్రమో పుష్పమో ఫలమో తోయమో సమర్పించి ప్రతిఫలము నాశింతురు. అట్టివారి కోర్కెలు భగవంతుడు తీర్చుచుండును.

శ్లో॥ పత్రం పుష్పం ఫలం తోయం యోమే భక్త్యా ప్రయచ్ఛతి
తదహం భక్త్యుపహృతం అశ్నామి ప్రయతాత్మనః

గీత - రాజవిద్యా 9-26

క॥ దళమైన పుష్పమైనను
ఫలమైనను సలిలమైన బాయని భక్తిన్
గొలిచిన జను లర్పించిన
నెలమిని రుచిరాన్నముగనే నేను భుజింతున్

భాగవతము-ఉత్తర-10-1010

## రెండవస్థాయి:-

రెండవ స్థాయికి చెందిన శరణాగతులు మధ్యమాధికారులు. వీరు ఇంద్రియములను ఈశ్వర పరముజేసి కామమును జయించినవారు. వీరు నిష్కామముగా కర్మల నాచరింతురు. దృఢవ్రతులై ఇంద్రియ నిగ్రహముగలిగి ఉపాసింతురు.

శ్లో॥ సతతం కీర్తయంతో మాం యతంతశ్చ దృఢవ్రతాః
నమస్యంతశ్చ మాం భక్త్యా నిత్యయుక్తా ఉపాసతే. గీత 9-14

## మహాదవస్థాయి:-

ఈ స్థాయికి చెందిన శరణాగతులు ఉత్తమాధికారులు. వీరు ఇంద్రియముల నీశ్వరపరము జేయుటయేగాక మనస్సునుకూడ భగవంతునియందు లగ్నము సేయుదురు. వీరికి సర్వము భగవంతుడే. అన్యము లేదు. "వాసుదేవ స్సర్వమితి" "మోక్షము మది గోర నొల్లరనిశంబు మదర్పిత సర్వకర్ములై" అను భాగవత వాక్యము వీరియెడ వర్తించును. వీరు ఆత్యంతిక భక్తులు. "నిజమనోరథ ఫలదాయకములయ్యును మదీయసేవా విరహితంబులైన కార్యంబుల సేయనొల్లరు"

శ్లో॥ మన్మనాభవ మద్భక్తో మద్యాజీ మాం నమస్కురు
మామేవైష్యసి యుక్త్వైవ మాత్మానం మత్పరాయణః

గీత-9-34

## భాగవతులు పాటించవలసిన అద్వైతములు:-

భాగవతులు భావాద్వైత ద్రవ్యాద్వైత క్రియాద్వైతముల పాటింపవలెనని భాగవతము తెలుపుచున్నది.

శ్లో॥ భావాద్వైతం క్రియాద్వైతం ద్రవ్యాద్వైతం తదాత్మనః
వర్తయన్ స్వానుభూత్యేహ త్రీన్ స్వప్నాన్ ధునుతే మునిః

శ్లో॥ కార్యకారణ వస్త్వైక్య దర్శితం పట తంతువత్
అవస్తుత్వా ద్వికల్పస్య భావాద్వైతం తదుచ్యతే

పటతంతు న్యాయంబున కార్య కారణంబులందు వస్తు వొక్కటియై యుండునని యెఱింగి ఏకత్వాలోచనంబు సేసి వికల్పంబు లేదని భావించుట భావాద్వైతంబు

భాగవతము-7-469

శ్లో॥ యద్బ్రహ్మణి పరే సాక్షాత్ సర్వకర్మ సమర్పణం
మనోవాక్ తనుభిః పార్థ! క్రియాద్వైతం తదుచ్యతే

మనోవాక్కాయ కర్మంబులైన సర్వకర్మంబులను ఫలభేదంబు

నేయక పరబ్రహ్మార్పణంబు నేయుట క్రియాద్వైతము.

శ్లో॥ ఆత్మజాయా సుతాదీనాం అన్యేషామపి దేహినాం
యత్ స్వార్థ కామయోరైక్యం ద్రవ్యాద్వైతం తదుచ్యతే

పుత్రి మిత్ర కళత్రాది సర్వప్రాణులకుం దనకును దేహంబునకుం బంచ భూతాత్మకత్వంబున భోక్త యొక్కండను పరమార్థత్వంబున అర్థ కామంబుల ఎడ నైకదృష్టిం జేయుట ద్రవ్యాద్వైతంబు.

నేర్పున, నాత్మ తత్వానుభవంబున, నద్వైత త్రియంబును విలోకించి వస్తుభేద బుద్ధియు, గర్మభేద బుద్ధియు, స్వకీయ పరకీయ బుద్ధియు స్వప్నంబులుగా దలంచి మానవలయును.

భాగవత భక్తిమార్గమునందు ప్రమాదముకాని పతనముగాని లేదు. నిమియను రాజునకు కవియను ముని ఆత్మలబ్ధికి భాగవత ధర్మములు చెప్పి కన్నులు మూసుకొని వీనిని భావించినను ప్రమాదమును పతనమును చెందదని తెలిపెను.

శ్లో॥ ఏవై భాగవతా ప్రోక్తా ఉపాయా ఆత్మలబ్ధయే
అంజ్యః పుంసాం అవిదుషాం విద్ధి భాగవతాన్ హితాన్
యా నాస్థాయ నరో రాజన్ నప్రమాద్యేత కర్హిచిత్
ధావన్ నిమీల్యవా నేత్రే నస్ఖలేత్ తపతే దిహ

## భాగవతులు మోక్షము కూడ ఆశింపరు:-

భాగవతమున షష్ఠ స్కంధమున హరిసేవయే కైవల్యమని సింగన వ్రాసెను.

సీ॥ హరికి నర్థము బ్రాణ మర్పితంబుగ నేయు
వాని కైవల్య మెవ్వనికి లేదు
వనజలోచను భక్తవరుల సేవించిన
వాని కైవల్య మెవ్వనికి లేదు
వైకుంఠ నిర్మల వ్రతపరుండై నట్టి
వాని కైవల్య మెవ్వనికి లేదు

సరసిజోదరు కథాశ్రవణ లోలుండైన
వాని కైవల్య మెవ్వనికి లేదు

తే॥ లేదు తపముల బ్రహ్మచర్యాది నియతి
శమ దమాదుల సత్య శౌచముల దాన
ధర్మ మఖముల సుస్థిర స్థానమైన
వైష్ణవ జ్ఞాన జనిత నిర్వాణ పదము

భాగవతము-6-55

భాగవత భక్తులను స్మరించినను సేవించినను పాపక్షయమగును కదా. భక్తుల హృదయములందే భగవంతు డుండును.

శ్లో॥ ప్రహ్లాద నారద పరాశర పుండరీక
వ్యాసాంబరీష శుక శౌనక హృన్నివాస ।

—కరావలంబస్తోత్రము

## విష్ణుమాయను తరించిన భాగవత భక్తులు:-

భాగవత ద్వితీయాశ్వాసమున భక్తిచే కృతార్థులై విష్ణుమాయను తరించిన భక్తుల నామములు తెలుపబడినవి. సనకాదులు, రుద్రుడు, ప్రహ్లాదుడు, స్వాయంభువ మనువు, శతరూప, ప్రియవ్రతోత్తాన పాదులు, ప్రాచీనబర్హి, ఋభువు, వేనజనకుడగు నంగుడు, ధ్రువుడు మొదలగు వారు.

సీ॥ గాధి గయాను రేక్ష్వాకు దిలీప మాం
ధాతృ భీష్మ శుక యయాతి సగర
రఘు ముచుకుం దైళ రంతిదే వోద్ధవ
సారస్వతో దంక భూరిషేణ
శ్రుతదేవ మారుతి శతధన్వ పిప్పలి
బలి విభీషణ శిబి పార్థ విదుర
లంబరీష పరాశ రాలర్క మిథిలేశ్వ
రాను సౌభరి దేవ లాదిమునుల

తే॥ లార్ష్ణిషేణాదులైన మహాత్ములెలమి
దవిలి యద్దేవు భక్తి జిత్తమున నిలిపి
తత్పరాయణు లౌట దుర్దాంతమైన
విష్ణుమాయ దరింతురు విమలచరిత

భాగవతము-2-204

తిర్యగ్జంతువులు పక్షులు స్త్రీలు శూద్రులు కూడ నారాయణ భక్తి యోగమున తరించిరి.

మ॥ అనఘా! వీరల నెన్న నేమిటికి? దిర్యగ్జంతు సంతాన ప
క్షి నిశాటాటవి కాఘ జీవనివహ స్త్రీ శూద్ర హూణాదులై
నను, నారాయణ భక్తియోగ మహితానందాత్ములై రేని వా
రనయంబున్ దరియింతు రవ్విభుని మాయావైభవాంభోనిధిన్

భాగవతము 2-205

వృక్షములకుగూడ మోక్షము లభించునని, చిదంబర శివాచార్యులు వృక్షమునకు మోక్షము నొసగిరని శివభక్తుల కథలో చెప్పబడినది.

## భాగవతులు ఒకజన్మలోనే ముక్తిని గాంతురు:-

భాగవతమున రుద్రుడు భాగవతులు సర్వోత్తములని తెలిపెను. "స్వధర్మ నిరతుండైన పురుషుం డనేక జన్మాంతరంబుల సుకృత విశేషంబులన్ చతుర్ముఖత్వంబు నొంది, తదనంతరంబ పుణ్యాతిరేకంబున నన్నుబొంది యధికారాంతరంబున నేనును దేవతా గణంబులును అప్రాకృతంబైన ఏ హరి పదంబును బొందుదు మట్టి పదంబు భాగవతుండు దనంతనె బొందు"

భాగవతము-4-699

"బహూనాం జన్మనా మంతే జ్ఞానవాన్ మాం ప్రపద్యతే" అను గీతా వాక్యము భాగవతుల ఎడ వర్తించదేమో? ఏమి వారి యదృష్టము? ఒక జన్మలోనే ముక్తిని బొందగలరు.

## ఫలితము :-

ఇట్టి భాగవత భక్తు లవలంబించిన భక్తి మార్గము ననుసరించిన ఫలితమేమి? భక్తిచే ఆత్మనిష్ఠ కలిగినప్పుడు సకల బంధములు తొలగును. ఫలములకెల్ల అవధి యనదగు ఆయాసముల బాయుట తటస్థించును. ఇట్టి "శ్రీకైవల్య పదంబు జేరుటకునై" భాగవతులు పాటించిన భక్తిమార్గమును వారి కథల మూలమున పరిశీలింతము.

క॥ హరిదాసుల మిత్రత్వము
మురరిపు కథ లెన్నికొనుచు మోదముతోడన్
భరితాశ్రు పులకితుండై
పురుషుడు హరిమాయ గెలుచు భూపవరేణ్యా.

భాగవతము 11-45

శ్లో॥ ప్రహ్లాద నారద పరాశర పుండరీక
వ్యాసాంబరీష శుక శౌనక భీష్మ దాల్భ్యాన్
రుక్మాంగ దార్జున వశిష్ఠ విభీషణాదీన్
పుణ్యానిమాన్ పరమ భాగవతాన్ స్మరామి.

అట్టివారిని క్రమముగ స్మరింతుము.

# 10. పరీక్షిత్తు శాపము

## భాగవత అవతరణము :-

## 7 దినములలో ముక్తి

అభిమన్యుని కుమారుడైన పరీక్షిత్తు దశమాస వయస్కుడై తల్లిగర్భమున నున్నప్పుడు అశ్వత్థామ " అపాండవ మగుగాక " అని బ్రహ్మాస్త్రము ప్రయోగించెను. ఆ బాణానలము గర్భస్థ శిశువగు పరీక్షిత్తుని దహింప మొదలిడెను. అంత శిశు విట్లు దిగులు చెందెను.

ఉ॥ కుయ్యిడ శక్తి లే దుదర గోళము లోపల నున్నవాడ, ది
క్కెయ్యది? దా ననాథనని యెప్పుడు దల్లి గణింప విందు, నే
ది య్యిషు వహ్ని వాయుటకు నెయ్యది మార్గము? నన్నుగావ నే
యయ్య గలండు? గర్భజని తాపద నెవ్వడెఱుంగు? దైవమా!

భాగవతము 1-280

క॥ చిచ్చర కోల వశంబున
జచ్చి బహిర్గతుడ గాని సమయమునను దా
నుచ్చలిత గర్భ వేదన
జచ్చును మాతల్లి గర్భ సంతాపమునన్.

భాగవతము 1-281

అని పరీక్షిత్తు విలపించెను.

అంత కృష్ణుండు కనికరించి "డింభకుని పరితాప విజృంభణంబు నివారించి, గర్భంబు గందకుండ అర్భకునకు ఆనందంబు గల్పించెను." గద జేబట్టి బాణానలము నుపశమింప జేసి అదృశ్యుడయ్యెను.

మ॥ గదజేబట్టి పరిభ్రమించుచు గదాఘాతంబులన్ గ్రూర శు
క్రప్రదమై వచ్చు శరాగ్ని దుత్తుమురుగా ఖండించి రక్షించె, సీ

నదయుం డెవ్వఁడొకో? యటంచు మదిలోఁ జర్చించుచున్ శాబకుం
డెదురై చూడ నదృశ్యుఁడయ్యె హరి సర్వేశుండు విప్రోత్తమా!

భాగవతము 1-287

పై విధముగా తన్ను రక్షించి అదృశ్యుఁడు కాగా పరీక్షిత్తునకు విష్ణురాతుఁడను నామము సిద్ధించెను.

చ॥ ప్రకటితదైవ యోగమున బౌరవ సంతతి యంతరింపఁగా
వికలత నొందనీక ప్రభవిష్ణుఁడు విష్ణు డనుగ్రహించి శా
బకు బ్రతికించె గావున నృపాలక శాబకుఁడింక శాత్రవాం
తకుఁడగు విష్ణురాతు డన ధాత్రి బ్రసిద్ధికి నెక్కు బూజ్యుడై.

భాగవతము 1-289

తల్లి గర్భము నుండి వెలువడిన తరువాత గర్భమున తాను దర్శించిన భగవంతుని విశ్వమున నెల్లెడ బరీక్షింప బూనుట చేత పరీక్షితుఁడను నామమును బొందెను.

క॥ తనతల్లి కడుపు లోపల
మును సూచిన విభుఁడు విశ్వమున నెల్ల గలం
డనుచు బరీక్షింపగ జను
లనఘు బరీక్షిన్నరేంద్రు డండ్రు మునీంద్రా!

భాగవతము 1-296

అతడు యుక్త వయస్కుఁడైన తరువాత పట్టాభిషిక్తుడై కలిని నిగ్రహించి ధర్మపరిపాలనము సేయదొడగెను. ఒకనాడు ఆ రాజు వేటకై వెడలి మృగంబుల వెంబడించుటచే బుభుక్షా పిపాసలవలన పరిశ్రాంతుడయ్యెను. నీటికై వెదకుచు అతడొక తపోవనము జొచ్చెను. అచట

సీ॥ మెలగుట సాలించి, మీలితనేత్రుడై.
శాంతుడై కూర్చుండి, జడత లేక,

ప్రాణ మనో బుద్ధి పంచేంద్రియంబుల
బహిరంగ వీధుల బారనీక,
జాగరణాదిక స్థానత్రయము దాటి,
పరమమై యుండెడి పదము దెలిసి,
బ్రహ్మభూతత్వ సంప్రాప్తి విక్రియుడయి,
యతిదీర్ఘ జడలు తన్నావరింప,

తే॥ సంఘు రురుచర్మధారియై యలరుచున్న
తపసి" ని బొడగనియెను. భాగవతము 1-458

నిమీలితనేత్రుడై కామాద్యరిషడ్వర్గ లయముచేత శాంతుడై, పంచేంద్రియములు, ప్రాణము, మనస్సు, బుద్ధి వీనిని నియమించి, జాగ్రత్స్వప్న సుషుప్త్యవస్థలు దాటి బ్రహ్మసమాధిలో బాహ్యమును మరచిన శమీకుడను మునిని గాంచెను. విస్మృత బాహ్యాంత రింద్రియ కృత సంచారుడగు శమీకుని త్రాగుటకు నీ రొసంగుమని రాజు కోరెను. ముని బదులు పలుక నందున నతనిని గర్విష్ఠిగా రాజు తలపోసి రోషమున చచ్చిన పామును ముని మెడలో వ్రేలాడవేసి వెడలి పోయెను.

ఈ విషయమును శమీకుని కుమారుడైన శృంగికి సమీపవర్తనులైన మునికుమారులు తెలుపగా నతడు మిగుల కోపించి "పరీక్షిత్తు ఏడవనాడు- తక్షకవిషముచే మరణించు"నని శాపమిడెను. శమీకుడు సమాధినుండి లేచిన తరువాత కుమారుడు రాజును శపించిన విషయము తెలిసికొని వానిని మందలించి రాజుకు శాప విషయము తెలియజేసెను.

పరీక్షితుడు విప్రశాప మెరిగి అర్థకామముల సన్యసించి ముక్తసంగు డయ్యెను. తాను గర్భస్థశిశువుగా నున్నపుడు బ్రహ్మాస్త్రబాధ నుండి శ్రీహరి అతనిని రక్షించెను. బ్రాహ్మహణుడగు అశ్వత్థామ చేసిన

ప్రయోగము నిరర్థక మయ్యెనుకదా? ఇప్పుడు పరీక్షితుడు శ్రీహరిని ప్రార్థించి శృంగి శాపమునుండి విముక్తుని చేయుమని వేడుకొనలేదు. చిత్తము గోవిందపరాయత్తము గావించి ప్రాయోపవిష్టు డయ్యెను. అతని కడకు శుకమహర్షి ఏతెంచి సప్తాహముల భాగవత పారాయణము గావించి పరీక్షిత్తునకు ముక్తి చేకూర్చెను.

ఈ కధ భాగవత అవతరణమునకు మూలకారణము. ఇందు గమనింపదగిన విషయములు రెండు.

1. శమీకుడు కామాద్యరిషడ్వర్గ లయముచే శాంతుడై, పంచేంద్రియములు ప్రాణము బుద్ధి మనస్సులను నియమించి, అవస్థాత్రయమును దాటి, బ్రహ్మసమాధిలో బాహ్యమును మరచియుండెను. అట్టి తపోబల సంపన్నునిపై మృతసర్పము వైచి అవమానించుటయే శాపకారణమయ్యెను. భాగవతాపచారము ఎంతవారికైన ముప్పు కలిగింపక మానదు. మృత సర్పమును వైచిన పరీక్షితుడు కాలసర్పము వాత బడవలసి వచ్చెను కదా!

2. అర్ధ కామముల సన్యసించిన పరీక్షితుడు, "సప్తాహంబుల ముక్తికేగెడి గతిం చర్చించి భాషింపరే" యని మునులను కోరెను. సప్త భూమికలైన పంచేంద్రియములు మనస్సు బుద్ధినిదాటి ఏడు దినములలో ముక్తిని బొందు మార్గమును శుకుడు బోధించెను. ఈముక్తి మార్గమే క్రింద చూపబడినది. భాగవత సారభూతమైనది.

పరీక్షితునకు శుకుడు తొలుత ఖట్వాంగుడు ముక్తి బొందుటను వివరించెను. సప్త ద్వీపముల బాలించు ఖట్వాంగ మహారాజును రాక్షసులతో బోరుటకై తనకు సహాయము రమ్మని ఇంద్రుడు కోరెను. ఆ రాజు రాక్షసులను జయించి దేవతలకు సహాయ మొనర్చెను. దేవతలు అతని యెడ ప్రసన్నులై వరము కోరుమనిరి. దాని కతడు తన మరణకాలము తెలుపమని వేడెను. మరణమునకు ఒక ముహూర్త

కాలము మాత్రమే ఉన్నదని దేవతలు తెలిపిరి. వెంటనే ఖట్వాంగుడు భువి కేతెంచి విరాగియై గోవిందనామ కీర్తనము జేసి ముక్తిని రెండు గడియల కాలములో పొందగలిగెను. రెండు గడియలలో ముక్తి గాంచిన ఖట్వాంగుని కథ తెలిపి ఏడు దినములలో ముక్తిని సాధించుట కష్టము కాదని శుకుడు పరీక్షితునకు ఇట్లు తెలిపెను.

"వినుము నీకు నేడు దినంబులకు గాని జీవితాంతంబు గాదు. తావత్కాలంబునకున్ బారలౌకిక సాధన భూతంబగు బరమ కల్యాణంబు సాధింపవచ్చు."

## 1) వైరాగ్యము :-

"అంత్యకాలము డగ్గరినన్ బెగ్గడిలక దేహి దేహపుత్ర కళత్రాది సందోహంబు వలని మోహ సాలంబు నిష్కామ కరవాలంబున నిర్మూలనంబు నేసి"

అనగా మరణ మాసన్న మయ్యెనని భయపడవలసిన పని లేదు. వైరాగ్య మవలంబించుట కర్తవ్యము. జీవితమున నిష్కామ కర్మాచరణముచే కర్మసన్యాసియై మరణ మాసన్నమైనవుడు సర్వ కర్మలను సన్యసించవలెను. శుకుడు అర్థ కామముల సన్యసించెను. భాగవత ధర్మమును పాటించెను. బంధు మిత్ర కళత్రాదులపై మోహమును వదలెను.

## 2) తారకవిద్య :-

"గేహంబు వెడలి పుణ్యతీర్థ జలావగాహంబు సేయుచు నేకాంత శుచి ప్రదేశంబున, విధి వత్ప్రకారంబునన్ గుశాజిన చేలంబుల తోడ గల్పితాసనుండై మానసంబున నిఖిల జగత్పవిత్రీకరణ సమర్థంబై అకారాది త్రివర్ణ కలితంబై బ్రహ్మబీజంబైన ప్రణవంబు సంస్మరించుచు వాయువుల జయించి,"

అనగా వాయువును జయించుటకు తారకవిద్య, లేదా, ప్రాణ గత్యాగతి ప్రత్యవేక్షణము,, లేదా అజపావిద్య లేదా క్రియాయోగము మొదలగు నామములతో చెప్పబడు క్రియను అనుష్ఠించి వాయువును జయించవలెను.

పై క్రియా విధానమును ఇంతకు ముందు పేజీలలో ధ్యాన యోగమునందు పూర్తిగా వివరించితిని. బాహ్య సాధనములు, ఆహార నియమము. అభ్యాసవిధానము విపులముగా తెలుపబడినవి. ఇట్టి యోగాభ్యాసరతుడు గొప్పవాడు.

శ్లో॥ తపస్విభ్యోఽధికో యోగీ, జ్ఞానిభ్యోఽపి మతోధికః.
కర్మిభ్య శ్చాధికో యోగీ, తస్మాత్ యోగీ భవార్జునః

యోగియైనవాడు తపస్సుచేసిన వారికంటెను. శాస్త్రార్థ పాం డిత్యము కలవారికంటెను, కర్మనిష్ఠుల కంటెను అధికుడు. అందు వలన యోగివి కమ్ము.

ఈ యోగములో బ్రహ్మబీజమైన ప్రణవమును స్మరించమని చెప్పబడినది. సోహం" భావనలో సో లోని "ఓ కారము", "హం" లోని "మ"కారము కలిసి ఓంకారమగుచున్నది. ఈ అభ్యాసి హంసోప నిషత్తులో తెలిపిన దశవిధ నాదములు వినును. కటపటి నాదము ఓంకారమే.

వాయువు "హకారేణ బహిర్యాతి సకారేణ విశేత్పునః" అని చెప్పబడినది. ఈ తారకవిద్య "మనశ్శుద్ధి కారకము"

క॥ తారక యోగము దెలియగ
నేరక వేదాంతవాక్య నికురంబముచే

ఊరక చెడిపోదురని సీతారామాంజనేయ సంవాదము హెచ్చ రించుచున్నది.

ఇంద్రియముల నిగ్రహించి ప్రాణములతో
మానసము గూర్చి వానితోడ

హంసయనగ నొప్పు నక్షరద్వయము యో
చించి సంతతము భుజింపవలయు.

ఇట్టి యోగముతో వాయువుల జయింప వచ్చునా? ఇది సాధ్య మేనని రమణ గీత తెలుపుచున్నది.

క॥ మానసముచేత జల్పెరు
ప్రాణింపుం బ్రత్యవేక్ష బ్రాణనిరోధం
బౌ; నిటుల ప్రత్యవేక్షణ
గా నెల్లప్పుడు కుంభకము సిద్ధించున్ — రమణగీత

## 3) వృత్రాసురవధ

"విషయంబుల వెంట నంటి పారెడి యింద్రియముల బుద్ధి సారథియై మనో నామకంబులైన పగ్గంబుల బిగ్గబట్టి మొగ్గం దిగిచి"

ఇంద్రియ వృత్తుల నిరోధించుట ప్రథమ కర్తవ్యము. "తస్మాదింద్రియాణ్యాదౌ నియమ్య భరతర్షభ।" భాగవతములోని వృత్రాసురవధ సంకేతార్థము ఇంద్రియ వృత్తుల నిరోధమేనని చిత్రకేతూపాఖ్యానమున నిరూపించితిని. కామమునకు అధిష్ఠానము ఇంద్రియములు, మనస్సు, బుద్ధి. అందువలన ఇంద్రియముల నియమించుట ప్రథమ కర్తవ్యము.

## 4) అంగిరసులకథ :-

"దట్టంబులైన కర్మఘట్టంబుల విట్టట్టు మెట్టెడి మనంబును శేముషీ బలంబున నిరోధించి" వేదమునందలి అంగిరసుల కథకు సంకేతార్థము మనోవృత్తుల నిరోధమని అరవిందులు సూచించిరి.

భగవద్గీతలో — "ఆత్మసంస్థం మనః కృత్వా
నకించదపి చింతయేత్"

అని చెప్పబడియున్నది. ఆత్మయందు మనస్సుంచుట యనగా నేమి? ఆలోచనల సమూహమే మనస్సు. ఈ మనస్సు ఆత్మనుండియే

వెడలుచున్నది. అనగా ఆలోచనల నాపినచో మనస్సు ఆత్మయందు చేరినట్లే. ఇదియే నిజమైనమౌనము. మనోవృత్తుల నిరోధము ద్వితీయ కర్తవ్యము. "అందువలన నకించిదపి చింతయేత్" అని చెప్పబడినది. దీనివలన మనోలయము సిద్ధించును. తరువాత మనో వినాశమునకై ప్రయత్నించవలయును. లయ వినాశములగూర్చి ముందుగా తెలిపి యుంటిని.

## 5 అవయవయోగము:-

"భగవదాకారంబుతో బంధించి నిర్విషయంబైన మనంబున భగవత్పాదా ద్యవయవంబులన్ గ్రమంబున ధ్యానంబు సేయుచు"

కపిలుడు తల్లియైన దేవహూతికి సాంఖ్యమును తెలిపెను. ఆమె దానిని గ్రహింపజాలదయ్యెను. అంత కపిలుడు శ్రీహరి దివ్యమంగళ విగ్రహమును మనంబున నిలుపుకొనుమని ఉపదేశించెను.

శ్లో॥ ఏకైక శోంగాని ధియా విభావయేత్
పాదాది యావత్ హసితం గదాభృతః
జితం జితం స్థాన మపోహ్య ధారయే
త్పరం పరం శుద్ధతి ధీర్యథా యథా

భాగవతము 2-2-14

మ॥ విమలంబై పరిశుద్ధమై తగు మనో విజ్ఞాన తత్త్వ ప్రబో
ధమతిం జొల్పి తదీయమూర్తి విభవ ధ్యానంబు గావించి చి
త్తము. సర్వాంగ విమర్శన క్రియలకుం దార్కొల్పి ప్రత్యంగమున్
సుమహా ధ్యానము సేయగా వలయుబో బుద్ధాంత రంగంబునన్

భాగవతము-2-2-14

త్యాగరాజు కూడ "నీ నగుమోము గనలేని నాజాలి తెలిసితే" అని శ్రీరాముని దివ్యమంగళ విగ్రహము మనః ఫలకమున నిలుపుటకై జాలిపొందెను కదా. "ఎందరో మహానుభావులు" అను పాటలో

"హృదయాబ్జ మీరు నడలుగల్గు పరముని సదా కనుల జూచు

చను పులక శరీరులై ఆనందపయోధి నిమగ్నులై మనంబు నను యశంబు గలవా" రెందరో మహానుభావులని వ్రాసెను.

భగవంతుని రూపమును మనస్సున నిల్పుకొనుటకే మానసిక మైన షోడశ ఉపచారములు "మృత్యుంజయ మానసిక పూజ" మొదలగునవి శంకరాదులచే రచింప బడినవి. వీని వలన మనస్సునందు భగవద్రూపము నిలిచి ధ్యానము ధారణ సిద్ధించును. అందులకే పోతన భాగవతమున భగవద్రూపమును సీస పద్యములలో అనేక పర్యాయములు వర్ణించెను.

తరువాత భాగవతమున శ్రీహరి ప్రత్యేక అవయవములు వర్ణింపబడినవి. అనగా ఒక్కొక్క అవయవమును మనస్సున నిలుపుకొనుచు తుదకు శ్రీహరి దివ్యమంగళ విగ్రహమును మనః ఫలకమున నిలుపుకొనుట అవయవయోగ మనబడును. ఈ యోగమును దేవీగీత చక్కగా వర్ణించినది.

శ్లో॥ దిక్కాలా ద్యవచ్ఛిన్నం దేవ్యాం చేతో విధాయచ
తన్మయో భవతి క్షిప్రం జీవబ్రహ్మైక్య యోజనాత్

దిక్కులు కాలము మొదలగు వానితో (Space and time) పరిమితి నొందని సచ్చిదానంద పరమేశ్వరియగు నాయందు చిత్తము నిలిపి జీవపరమాత్మల కేకత్వము భావించుట వలన సాధకుడు తన్మయుడగు చున్నాడు. అనగా సాధకుడు బ్రహ్మాకార చిత్తవృత్తి నలవరచుకొనవలయును. ఇది సులభ సాధ్యముకాదు.

శ్లో॥ అథవా సమలంచేతో యది క్షిప్రం నసిధ్యతి

చిత్తము మలయుక్తమగుటచేత నిరుపాధికము నిర్గుణము అగు నాయందు దానికి నిలుకడ కలుగదేని-

శ్లో॥ తదావయవ యోగేన యోగీ యోగాం త్సమభ్యసేత్
మదీయ హస్త పాదాదా వంగేతు మధురే నగ

చిత్తం సంస్థాపయే న్మంత్రీ స్థాన స్థాన జయా త్పనః
విశుద్ధ చిత్త స్సర్వస్మిన్ రూపే సంస్థాపయే న్మనః

అప్పుడు అవయవములు నాకున్నట్లు భావించవలయును. మంత్రి సాధకుడు చిత్తమాలిన్యము తొలగించు అతి సుందరములగు నా పాదకమలములు మొదలగు అవయవములలో ఒక్కొక్క అంగమునందు చిత్తము నిలిపి, ఆ అవయవము చిత్తమునకు స్వాధీనమైన పిదప మరియొక అవయవమునందు చిత్తము నిలుపవలెను. ఇట్లు ఒక్కొక్క అవయవమునందు చిత్తము నిలిపి ధ్యానించుచుండగా చిత్తగతములైన దారేషణాదులు, కామాదులు, అవిద్యయు, స్వభావ చాంచల్యము మున్నగు సర్వదోషములు తొలగును. తరువాత నా దివ్య మంగళ విగ్రహమును భక్తితో కనులముందు నిలుపుకొనవలయును.

పై విధముగ భాగవతము దేవీగీత అవయవయోగమును సమర్థించినవి.

## 6) ధారణ:-

"రజస్తమో గుణంబులచే నాక్షిప్తంబగు చిత్తంబు విమూఢంబైన ధారణా వశంబునన్ దద్గుణంబుల వలన నయ్యేది మలంబులన్ బోనడచి, నిర్మల చిత్తంబునన్ పరమంబైన విష్ణు పదంబునకుం జను ధారణా నియమంబు గలుగ సుఖాత్మకంబగు విషయంబు నవలోకించు యోగికి"

ధారణయందు భగవత్ విశాల రూపమును మనమున ననుసంధానము చేయవలయునని శుకుడు తెలిపెను.

ఆ॥ పవనము నియమించి పరిహృతరంగుడై
ఇంద్రియముల వర్గ మెల్ల మాపి
హరి విశాల రూపమందు చిత్తము జేర్చి
నిలుపవలయు బుద్ధి నెఱపి బుధుడు భాగవతము-2-15

"చూపునిలిచిన సుఖము నిలుచు"ను. ధారణ వలన బ్రహ్మ

నందము సిద్ధించును. "మనసు నిలిచిన మారుతంబు నిలుచు"

## 7) సమాధి :-

భక్తి లక్షణంబైన యోగాశ్రయంబున వేగంబ మోక్షంబు సిద్ధించు."

అనగా భక్తియోగి "అపహృత మనః ప్రాణుడై" సమాధిస్థితి ఏర్పడి ఆ స్థితియే అన్ని అవస్థల యందును సహజస్థితిగా రూపొంది జీవన్ముక్తు డగును.

పై విధముగా 7 దినములలో ముక్తి కేగెడి మార్గమును శుకుడు పరీక్షితున కుపదేశించెను. ఇదియే పరమభాగవతులు పాటించు భాగవత మార్గము.

శ్లో॥ స్థిరం సుఖం చాసన మస్థితో యతిః
యదా జహాసు రిమ మంగ లోకమ్
కాలేచ దేశేచ మనో న సజ్జయేత్
ప్రాణాన్ నియచ్ఛే న్మనసా జితాసుః

భాగవతము 2-2-15

శరీరము నందలి ఇంద్రియములు మనస్సుతో కలసి దేహముతో బంధమున్నవానికి దేహము పోవునపుడు మరణము సంభవించును. అట్లుగాక ఇంద్రియములు మనస్సు ప్రాణము, వీనిని ధారణచే అధిగమించినచో మరణముతో సంబంధము లేక దేహము విడువ వచ్చును. అంగలోక మనగా దేహము. ధారణలో నున్నవానికి దేహ సంబంధ ముండదు. బాహ్య ప్రపంచజ్ఞాన ముండదు. కాబట్టి దేహమున్నంత కాలముండి రాలిపోవును. రమణ మహర్షి 45 ఏండ్లు జీవన్ముక్తుడై యుండెను కదా. కోరి దేహమును విడువవలసిన పనిలేదు. కాని పరీక్షితునకు శాపవశమున 7దినములకు దేహము వదలవలసివచ్చెను

# 11. నారదుని పూర్వజన్మ వృత్తాంతము

## భాగవతము వ్రాయుటకు కారణము

కలికాలమున మానవులు మందప్రజ్ఞులని భావించి వ్యాసుడు ఒకటిగానున్న వేదమును ఋగ్యజుస్సామాధర్వణములను నాలుగు వేదములుగా విభజించెను. స్త్రీ శూద్రుల నిమిత్తము భారతమును రచించి వేదార్థములను దెలిపి స్త్రీ శూద్ర ముఖ్య ధర్మములను వివరించెను. ఇట్టి భూతహిత మొనర్చియు వ్యాసుని ఆత్మ సంతస మందలేదు. శాంతి లభింపలేదు. తన బాధను నారదునకు విన్నవించి కారణమును తెలుపుమని కోరెను. అనుభవజ్ఞానముతో నారదు డిట్లు వివరించెను.

ఉ॥ అంచితమైన ధర్మచయ మంతయు జెప్పితి వందులోన నిం
చించుకగాని విష్ణుకథ లేర్పడ జెప్పవు, ధర్మముల్ ప్రపం
చించిన మెచ్చునే గుణవిశేషము లెన్నినగాక, నీకు ని
కొంచెము వచ్చునెల్ల హరి గోరి నుతింపమి నార్యపూజితా!

మ॥ హరినామస్తుతి సేయు కావ్యము సువర్ణాంభోజ హంసావళీ
సురుచి భ్రాజితమైన మానస సరస్స్ఫూర్తిన్ వెలుంగొందు, శ్రీ
హరి నామస్తుతి లేని కావ్యము విచిత్రార్థాన్వితం బయ్యు శ్రీ
కరమైయుండ దయోగ్య దుర్మలిన వత్కాకోల గర్తాకృతిన్

భాగవతము 1-95,96

[పై పద్యములో సువర్ణాంభోజము లనబడు షట్చక్రములందు, ప్రాణవాయువు హంస రూపమున చరించి ప్రాణాపానములు సమానమైనపుడు నిశ్చలముగానున్న సరోవరమువలె మనస్సు విక్షేపము లేక యుండునని స్ఫురించు చున్నది కదా.]

మ॥ అపశబ్దంబుల గూడియున్ హరిచరిత్రాలాపముల్ సర్వపా
ప పరిత్యాగము సేయు, గావున హరిన్ భావించుచున్ పాడుచున్
జపముల్ సేయుచు వీనులన్ వినుచు నశ్రాంతంబు గీర్తించుచున్

దపసుల్ సాధులు ధన్యులౌదురు గదా తత్త్వజ్ఞ! చింతింపుమా
భాగవతము 1-97

"నిరత కర్మంబైై నిరుపాధికంబైైన జ్ఞానము హరిభక్తి లేకున్న విశేషంబుగ శోభితంబుగాదు. —భాగవతము 1-98

భక్తిలేని కర్మలుగాని జ్ఞాన వాక్యములుగాని నిరర్థకములు. నిఖిల బంధ మోచనమునకు, శ్రీహరి లీలావిశేషముల వర్ణింపుము. కుల ధర్మముల ననుష్ఠించుట వలన మోక్షము సిద్ధింపదు. శ్రీహరి పద పద్మసేవయే మోక్షప్రదము. సుఖ దుఃఖములు ప్రాప్తించినను హరి సేవ విడువరాదు.

చ॥ తన కుల ధర్మమున్ విడచి దానవవైరి పదారవిందముల్
పనివడి సేవసేసి పరిపాకము పొందక నెవ్వడేని జ
చ్చిన మఱుమేననైైన నది సిద్ధి వహించు దదీయసేవ బా
సిన గుణధర్మ గౌరవము సిద్ధి వహించునె ఎన్ని మేనులన్

అని బోధించెను. భాగవతము 1-100

నారదునకు పూర్వజన్మ జ్ఞానముండుటచేత తన అనుభవముతో చెప్పగలిగెను. తొల్లిటి జన్మమున నారదుడు వేదవాదుల ఇంట దాసీ పుత్రుడై జన్మించెను. ఆ భాగవతులు చాతుర్మాస్యము ననుష్ఠించు నపుడు, నారదుడు వారికి పరిచర్యచేసి వారుచెప్పిన శ్రీకృష్ణ చరితము వినెను. తానుకూడ హరిసేవ యొనర్చి తన అనుభవము నిట్లు తెలిపెను.

"ఇట్లు హరిసేవా నిరతింజేసి ప్రపంచాతీతుండనై బ్రహ్మ రూపకుండనైైన నాయందు స్థూల సూక్ష్మంబైైన ఈ శరీరంబు నిజ మాయా కల్పితంబని యమ్మహాత్ములగు యోగిజనుల మూలంబున రజస్తమో పరిహారిణి యయిన భక్తి సంభవించె. భాగ-1-108

ఏనును వారి యుపదేశంబున వాసుదేవుని మాయానుభవంబు దెలిసితి, నీశ్వరుని యందు సమర్పితంబయిన కర్మంబు దాపత్రయంబు మానుప నౌషధంబగు.

కర్మంబులు సంసార హేతుకంబు లయ్యును ఈశ్వరార్పితంబులై తామ తమ్ము జెరచుకొన నోపి యుండు. ఈశ్వరుని యందు జేయం బడు కర్మంబు విజ్ఞాన హేతుకంబై ఈశ్వర సంతోషణంబును భక్తి యోగంబును బుట్టించు. భాగవతము 1-110

ఇట్లు తన జన్మకర్మంబులను నారదుడు వ్యాసునకు తెలిపెను. కొన్ని దినముల తరువాత నారదుని తల్లి సర్పదష్టయై మరణింపగా "సంగము వాసె మేలు మేలు రాజిల్లె నటంచు" నారదుడు తలచెను. అరణ్యమునకేగి ఒక రావిచెట్టు క్రింద హృదయమున హరిని చింతించెను [అశ్వత్థవృక్ష సంకేతార్థమును గమనింపుడు] ధ్యానా రూఢుడైన అతని మనమును భగవంతు డగుపించెను. నారదుడు ఆనంద సముద్రమున మునిగి ఈశ్వరుని తన్ను తెలుసుకొన జాలక పోయెను. ధ్యానము చాలించి లేచిన తరువాత శ్రీహరి అగుపించక పోయిన బాధపడెను. అప్పు డశరీరవాణి ఇట్లు పలికెను. "ఈ సృష్టిలయమై వేయి యుగము లైన తరువాత పునః సృష్టి జరుగును. అప్పుడు పూర్వజన్మ జ్ఞాన ముతో పుట్టగలవు శుద్ధ సాత్వికుడవుగా బుద్ధైవ" వని తెలిపెను. తరువాతి కల్పమున నారదుడు జన్మించి నారాయణ కథా గానము చేయుచు, మూడు లోకముల చరించు చుండెను. తన పూర్వ జన్మ ములో అనుభవము లన్నియు వ్యాసునకు తెలిపి "విష్ణు సేవయే శాంతికి మూల" మని భక్తిలేని యమ నియమాదులు వ్యర్థమని తెలిపెను.

చ॥ యమ నియమాది యోగముల నాత్మ నియంత్రిత మయ్యు కామరో
షముల ప్రచోదితంబయగు, శాంతి వహింపదు విష్ణు సేవచే
గ్రిమమున శాంతి గైకొనిన కైవడి, నాదు శరీర జన్మక
ర్మముల రహస్యమెల్ల ముని మండన॥ జెప్పితి నీవు గోరినన్

భాగవతము 1-132

ఈ కథ వలన గమనించవలసిన విషయములు

(1) నారదునకు రజస్తమోగుణ పరిహారిణియగు భక్తి జనించినది. "స్థూల సూక్ష్మంబయిన ఈ శరీరము నిజ మాయా కల్పి మని" నారదుడు గ్రహించెను. స్థూల దేహము తమో గుణమువలన కలిగెను. ఇది ఇంద్రియములతో కూడినది. సూక్ష్మ దేహమే మనస్సు ఇది రజో గుణమువలన కలిగెను. కారణ దేహము సత్వ గుణము కలిగెను. మాయ త్రిగుణాత్మకమైన సృష్టి యొనర్చెను. సంసార బంధము లన్నియు ఇందిరియ మనంబులచే కలుగుచున్నవి. "నిఖిల బంధ విమోచనంబు కొరకు వాసుదేవుని లీలా విశేషంబుల భక్తితో వర్ణింపు" మని నారదుడు వ్యాసునితో తెలిపెను.

ఇంద్రియములను మనస్సును దాటిన తరువాతనే సత్వగుణము ఆవరణము తొలగి ఆత్మ సాక్షాత్కారము కలుగును. అందులకే నిర్గత కర్మంబును నిరుపాధికంబును అయిన జ్ఞానంబు హరిభక్తి లేకున్న శోభితంబు గాదని నారదుడు తెలిపెను. అనగా భక్తిచేత రజస్తమో గుణ పరిహారమైన తరువాత శుద్ధ తత్వమేర్పడినగాని నిర్గుణ తత్వము నందుకొనుటకు వీలుకాదు. పరిమిత శక్తిగల ఇంద్రియములతోను మనస్సుతోను పరబ్రహ్మ వస్తువును గ్రహింపలేము. ఇంద్రియ మనో నిగ్రహము లేక తెలుపు వాచా వేదాంతము వలన ఆత్మానుభూతి కలుగదు.

(2) ఇంద్రియ మనో నిగ్రహములేని వారికి కామాద్యరి షడ్వర్గ లయ రూపమగు శాంతి కలుగదు.

(3) భగవంతుని సేవ వలన ఈ జన్మలో పరిపాకము చెందక మరణించిన మరు జన్మలోనైన సిద్ధి పొందును.

(4) నిష్కామ కర్మను ఈశ్వరార్పితముచేసి ఇందిరియము లను, భగవంతుని ఏకాగ్రితతో ధ్యానించి మనస్సును జయింపవచ్చును. ఇదియే రజస్తమో పరిహారిణియగు భక్తి.

# 12. అజామిళోపాఖ్యానము

## భగవన్నామ మాహాత్మ్యము

శ్రీ మహాభాగవతములో అజామిళోపాఖ్యానము భగవన్నామ సంకీర్తన యొక్క ప్రాశస్త్యమును చాటుచున్నది. నామ జపము నిరంతరమగు భగవత్ స్మృతికి సాధనము. నామానుసంధానము వలన మనోలయము సిద్ధించును. నామ జపమునకు సమస్త జనులకును జాతి భేదము లేక అధికారము కలదు. భూత హింసలేదు. దేశకాల నియమములు లేవు. "యజ్ఞానాం జప యజ్ఞోస్మి" అని భగవంతుడు యజ్ఞములలో జప యజ్ఞము తానని గీతలో తెలిపెను. కలికాలమున "నారాయణస్య నామోచ్చారణ మాత్రేణ నిర్ధూత కలి ర్భవతి." నారాయణ నామ జపముచే కలిదోషముల దరింప వచ్చునని కలిసంతారణోపనిషత్తు తెలుపు చున్నది. "నామ నామినో రభేదః"నామమునకును భగవంతునకును అభేదము. నామ జపము సర్వ పాపహరము, ముక్తి ప్రదమని భాగవతము కొనియాడు చున్నది.

క॥ ధీమహితః భవన్మంగళ
నామ స్మరణాను కీర్తనము గల హీనుల్
శ్రీమంతు లగుదు రగ్ని
ష్టోమాది క్రతుదాళి కంటె శుద్ధులు దలపన్

భాగవతము 3-1035

క॥ నీ నామస్తుతి శ్వపచుం
డైనను జిహ్వాగ్రమందు ననుసంధింపన్
వానికి సరి భూసురుడుం
గానేరడు చిత్రమిది జగంబుల నరయన్

భాగవతము 3-1037

పూర్వము కన్యాకుబ్జమను పురమున అజామిళుడను బ్రాహ్మ

ణుడుండెను. అతడు బాల్యమున వేదాధ్యయనము సేసి గురు శుశ్రూ
నొనర్చి మంత్రసిద్ధి బడసెను. మంచి గుణములు, సత్య భాషణము
కలిగి ఆచారవంతుడై నైష్ఠికుడై యుండెను.

కొంత కాలమునకు నవ యవ్వన మతని మేన పొడసూపెను.
ఒకనాడు సమిధలకై అరణ్యమునకేగి అందు ఒక వృషలి విటునితో
ఒక లతా భవనంబున కామకేళి దేలుట తిలకించెను. అట్లు తిలకించి
అజామీళుడు మన్మ ధోద్దీపితుడై కులాచారము మంటగల్పి ఆ కులటన
జేరి పిత్రార్జితము నామెపాలు జేసెను. సుగుణాభిరామ యగు వి
భామను వదలి వేసెను. ఇట్లు మోహ జలధిలో మునిగి పాపవర్తనుడై
మెలగి పతితుడయ్యెను. అతనికి వార్ధక్యము వచ్చెను. తన చిన్న కొ
డుకగు నారాయణుని యందు బద్ధానురాగుడై తనకు రాగల మృత్యు
వును గూర్చి ఆలోచించడయ్యెను.

క॥ అత్యంత పాన భోజన
కృత్యంబుల పొత్తుగలిగి, క్రీడల తత్సాం
గత్యంబు వదల కాగతి
మృత్యువు గన నేరడయ్యె మిక్కిలి జడుడై

భాగవతము 6-65

ఇట్లుండ అతనికి మరణకాల మాసన్న మయ్యెను. యమకింక
రులు అగుపడగా భీతినంది అజామీళుడు,

క॥ దూరమున నాడు బాలుడు
బోరన తన చిత్తసీమ బొడగట్టిన నో
నారాయణ నారాయణ
నారాయణ యనుచు నాత్మ నందను నొడివెన్

భాగవతము 6-72

అప్పుడు విష్ణుదూత లరుదెంచి యమ పాశముల ద్రుంచి అతనిని
విడిపించిరి. "ధర్మ పరిపాలకులమైన మమ్ముల నెందుకడ్డగించితి"
రని యమదూతలు ప్రశ్నించిరి. దానికి బదులుగా విష్ణుదూత లిట్లనిరి.

ఆ॥ బిడ్డపేరు పెట్టి పిలుచుట విశ్రామ
కేళినైన మిగుల గేలినైన
పద్య గద్య గీత భావార్థములనైన
కమలనయను దలప కలుష హరము

భాగవతము 6-122

శక్తివంతమైన ఔషధము తెలియక సేవించినను రోగమును మాన్పునట్లు శ్రీహరి నామోచ్చారణము మోక్షప్రదము. అజామీళుడు మరణ సమయమున హరి నామోచ్చారణ మొనర్చెను. ఇట్టి సజ్జన ధర్మము వ్యర్థము కాదని విష్ణుదూతలు భాగవత ధర్మమును వివరించిరి.

అజామీళుడు వారి సంవాదము నాలించి పశ్చాత్తాప తప్తుడై యత చిత్తేంద్రియ మానసు డగుచు యోగమార్గంబున దేహంబు విడిచెను. భగవన్నామ గ్రహణంబున ముక్తి మార్గావలంబియై తుదకు మోక్షమును పొందెను.

కలియుగమున ముక్తిని పొందుటకు "నామస్మరణా దన్యోపాయం నహి పశ్యామో భవ తరణే" అన్నారు.

శ్లో॥ ధ్యాయన్ కృతే యజన్ యజ్ఞైస్త్రేతాయాం ద్వాపరేర్చయన్
యదాప్నోతి తదాప్నోతి కలౌ సంకీర్త్య కేశవమ్

విష్ణు పురాణము.

కలియుగమున నామకీర్తనము చేతనే ధ్యానము యజ్ఞము అర్చన మొదలగువాని ఫలమును పొందవచ్చును.

నామస్మరణ మహిమను, భగవద్గీత, రామస్తవ రాజము, భగవన్నామకౌముది మొదలగు గ్రంథములు వివరించుచున్నవి.

శ్లో॥ యం యం వాఽపి స్మరన్ భావం
త్యజ త్యంతే కలేవరం
తం తమే వైతి కౌన్తేయ!
సదా తద్భావ భావితః

గీత 8-6

ఎవడు మరణకాలమందు ఏ భావమును స్మరించుచు శరీరమును విడుచునో వాడెల్లప్పుడును, ఆ భావమునే పొందును.

శ్లో॥ అన్తకాలేచ మామేవ
స్మరన్ ముక్త్వా కళేబరమ్
యః ప్రయాతి సమద్భావమ్
యాతి నాస్త్యత్ర సంశయః గీత 8-5

ఎవడు మరణకాలమున నన్నే చింతించుచు దేహమును వదలునో అతడు నన్నే పొందును. సంశయములేదు. అజామిళు డిట్లు మరణ కాలమున "నారాయణా" యని కొడుకును సంబోధించిన మాత్రము ననేముక్తుడయ్యెను.

శ్లో॥ ఓం ఇత్యేకాక్షరం బ్రహ్మ వ్యాహరన్ మా మనుస్మరన్
యః ప్రయాతి త్యజన్ దేహం సయాతి పరమాం గతిమ్
గీత 8-13

యోగ అవసాన సమయమున ఓంకారరూప బ్రహ్మ మంత్రము నుచ్చరించిన పరమపద ప్రాప్తి నొందును.

కాబట్టి భగవద్గీతలో సర్వకాల సర్వావస్థల యందును భగవంతుని తలచవలెనని తెలుపబడినది..

శ్లో॥ తస్మాత్ సర్వేషు కాలేషు మా మనుస్మర గీత 8-7

భాగవతమునకూడ అవసానకాలమున హరిస్మరణ మోక్షదాయకమని తెల్పుచున్నది.

సీ॥ అనఘాత్మ! మఱి భవదవతార గుణకర్మ
ఘన విడంబన హేతుకంబులైన
రమణీయమగు దాశరథి వసుదేవకు
మారాది దివ్య నామంబు లోలి
పెలయంగ మనుజులు వివశాత్ములై యవ
సాన కాలంబున సంస్మరింప

జన్మ జన్మాంతర సంచిత దురితంబు
బాసి కైవల్య సంప్రాప్తు లగుదు"రు

భాగవతము 3-304

రామకృష్ణ నామములు వివశాత్ములై అవసాన కాలంబున సంస్మరించినను కైవల్యము ప్రాప్తించునని భాగవత మతము.

గీ॥ జనులకెల్ల శుభము సాంఖ్య యోగము దాని
వలన ధర్మనిష్ఠ వలన నైన
అంత కాలమందు హరిచింత సేయుట
పుట్టువులకు ఫలము భూవరేంద్ర!

భాగవతము 2-5

అట్లే మల్లయామాత్య ప్రణీతంబైన రామస్తవ రాజమను గ్రంధమున నామ సంకీర్తన ఘట్టమున రామకృష్ణ నామ మాహాత్మ్యము వర్ణింప బడినది. ఆ ఘట్టమునందలి పద్యములను ఉదహరింతుము.

గీ॥ పాండవోత్తమ! విను పరబ్రహ్మమైన
రామకృష్ణుల నామ కీర్తనల మహిమ
లేమి జెప్పుదు? ధాత్రిలో నెవ్వరైన
వాంఛ నొకమారు బల్క బావనుల జేయు.

గీ॥ నామకీర్తన సరిసాటి భూమి గలదె
తెలియనేరని మూర్ఖులు తీర్థయాత్ర
లంచు దేవతాసేవ లట్లంచు, నుండ
బట్టక తిరుగు గ్రహచార బాధగాక.

క॥ జారుండైనను వృద్ధా
చారుండైనను, గృహస్థ సంచారుండై
శ్రీరామా యని ఒకపరి
నోరాడిన జాలు వాని నూరేడులకున్.

సీ॥ తెల్లవారక తొల్లి చల్లని నీటిలో
వాయక నొడలెల్ల వణకువారు
నీరు కావులు గట్టి నీళ్ళు దర్భలచేత
సవ్యాప సవ్యముల్ జల్లువారు
బిగుసుక ముక్కులు బిగియించి గొణుగుచు
మా గన్ను వేయుచు తూగువారు
సాముజేసిన యట్లు సాగిల బడి పడి
బ్రొద్దుకై నిల్వగ బోవువారు,
బిర బిరను చెట్ల చుట్టును తిరుగువారు
నేయి జిదుగులు నగ్నిలో వేయువారు
వైశ్వదేవాది పూజల వరలు వారు
కీర్తనల నేయువారల క్రిందివారు

క॥ ఆర్తావేశముచే హరి
కీర్తన పరుడైన వాడు కృష్ణాయనుచున్
మూర్తి భజించిన యొక్క ము
హూర్తములో స్వామివద్ద నించుక యుండున్

పై పద్యముల భావము పరికించిన అది అర్థ వాదముగా తోచక మానదు. కాని శ్రీస్వామి అఖండానంద సరస్వతి వ్రాసిన "భగవన్నామ కౌముది" యందు భగవన్నామ జపమునకు చెప్పబడిన మహిమ అర్థ వాదము కాదని చెప్పబడినది. "కేవలయా భక్త్యా" అను భాగవత వచనముచేత, ప్రకాశ మేర్పడగనే అంధకారము పూర్తి తొలగునట్లు, శ్రవణ కీర్తన స్మరణరూపమైన భక్తిచేతనే పాపక్షయ మగుచున్నది. అందులకే శ్రీ శంకరాచార్యులు భగద్గీతా వ్యాఖ్యానమునందు "భక్తి మాత్రేణ కేవలేన శాస్త్ర సంప్రదానే పాత్రం భవతి" అని భక్తుడైన వానికి గీతాశాస్త్రము పదేశించ వచ్చునని తెలిపెను.

పాపక్షయమునకు ఇతర వైదిక ప్రాయశ్చిత్త కర్మల ఆవశ్యకత కూడ లేదు, కర్మాత్మకమగు వైదిక ప్రాయశ్చిత్తము అనగా

వ్రతాదులు, పాపక్షయము మాత్రమే కలిగించును. కాని వాసనా క్షయము కలిగింప జాలవు. వాసనా క్షయము భక్తిచేతను, జ్ఞానముచేతను మాత్రిమే కలుగును. ఇది భాగవత మతము. ప్రాయశ్చిత్త కర్మ వాసనా క్షయము కలిగింపజాలదు. కాబట్టి తిరిగి పాపము చేయుటకు అవకాశమున్నది. శ్రివణ కీర్తన స్మరణ రూపమైన భక్తి సర్వపాపములను నిర్మూలించెను.

శ్లో॥ ఏతావతాఽల మఘ నిర్హరణాయ పుంసాం
సంకీర్తనం భగవతో గుణ కర్మ నామ్నాం
విక్రుశ్య పుత్ర మఘవాన్ య దజామిలో ఽ పి
నారాయణేతి మ్రియమాణ ఇయాయ ముక్తిమ్.

అజామీళుడు మహాపాపి. మరణ సమయమున కొడుకు నుద్దేశించి నారాయణా అనెను. అతడు భగవంతుని స్మరించ లేదు .అనగా బుద్ధి పూర్వకముగా భగవన్నామోచ్చారణ చేయలేదు కదా! అయినను ముక్తి లభించినది.

ఆ॥ బాంధవమునసైన, బగనైన, వగనైన,
ప్రీతినైన, ప్రాణ భీతినైన,
భక్తినైన, హరికి పరతంత్రులై యుండు
జనులు మోక్షమునకు జనుదు రధిప!

భాగవతము 10-973

ఆ॥ బిడ్డ పేరు పెట్టి పిలుచుట విశ్రామ
కేళినైన మిగుల గేలినైన
బద్య గద్య గీత బావార్థములనైన
గమలనయను దలప గలుష హరము

భాగవతము 6-122

క॥ డెందంబు పుత్రు వలనం
జెందినదని తలప వలదు శ్రీపతి పేరే

చందమున నైన బలికిన
నందకధరు డందు గలడు నాథుండగుచున్
భాగవతము 6-12

క॥ కామంబు, పుణ్యమార్గ
స్థేమంబు, మునీంద్ర పాద చేత స్సరసీ
ధామంబు, విష్ణు నిర్మల
నామంబు దలంచువాడు నాధుడు గాడే.

శ్లో॥ విద్యా తపః ప్రాణ నిరోధ మైత్రీ
తీర్థాభిషేక వ్రతదాన జప్యైః
నాత్యంత సిద్ధిం లభతే న్తరాత్మా
యథా హృదిస్థే భగవ త్యనన్తే.

పాపక్షయమునకై ఏకైక నామ జపమే చాలును. ఇతర కర్మలు దానితో చేయ నవసరములేదు. తపస్సు వ్రతము దానము జపము ఇత్యాదులచే పూర్ణ సిద్ధి లభింపదు. భగవన్నామ సంకీర్తనమే పూర్ణ సిద్ధిని కలిగించును.

శ్లో॥ పాపే గురూణి గురుణి స్వల్పా న్యల్పేచ తద్విదః
ప్రాయశ్చిత్తాని మైత్రేయ జగుః స్వాయంభు వాదయః

శ్లో॥ ప్రాయశ్చిత్తా న్యశేషాణి తపః కర్మాత్మకానివై
యానితేషా మశేషాణాం కృష్ణాను స్మరణం పరమ్

తపస్సు కర్మ మొదలగు ప్రాయశ్చిత్తములను పెద్దవి చిన్నవి అను పాపములకు తగినట్లు వేరువేరుగా మన్వాదులు విధించిరి. కాని అన్ని పాపములకు ప్రాయశ్చిత్తము కృష్ణానుస్మరణ మొక్కటే.

కృష్ణనామ స్మరణ మనగా కృషితి=సంసారమును భంగము చేయునది అని అర్థము; లేదా కర్షతి=అజ్ఞానమును భంగము చేయు :ది అని అర్థము. కాబట్టి అజ్ఞాన నిరసనమైన బ్రహ్మ విద్యయే కృష్ణాను

స్మరణమని కొందరి వాదము. కాని అనుస్మరణమనగా కీర్తనమేనని క్రింది శ్లోకమునుండి గ్రహింపవచ్చును.

శ్లో॥ క్వ నాకపృష్ఠ గమనం పునరావృత్తి లక్షణం
క్వ జపో వాసుదేవేతి ముక్తిబీజ మనుత్తమమ్

పునర్జన్మ కలిగించు స్వర్గలోక గమన మెక్కడ? ముక్తి బీజ మగు వాసుదేవ నామమెక్కడ? ఇంకను

శ్లో అవరే నాపియన్నామ్ని కీర్తితే సర్వపాతకైః
పుమా స్వముచ్యతే సద్యః సింహస్త్రై న్మృగైరివ

వివశముగా నామ కీర్తనము చేసినప్పటికిని తక్షణమే సర్వ పాపములనుండి విముక్తుడు కాగలడు.

శ్లో॥ ఏతేనైవ హ్యఘోనోఽస్య కృతం సాదఘ నిష్కృతమ్
యదా నారాయణా యేతి జగాద చతురక్షరమ్

అజామీళుడు పుత్రుని కొరకు ఉచ్చరించిన నారాయణ నామము భగవన్నామ జపదృష్ట్యా ఉచ్చరింపబడినది కాదు. (నామాభాసము) ఈ ఉచ్చారణలో శ్రద్ధగాని అవృత్తిగాని ఫలకాంక్షగాని లేదు. అయినను మోక్షఫలము సిద్ధించినది కదా!

ఇట్టి అభిప్రాయమే రామనామ జపమును గూర్చి సీతారామాంజనేయ సంవాదమున కలదు.

తే॥ రామరామ యటంచును గామికుండు
మోహమున ప్రేయసిని బిల్వ మోక్షమొసగు
రామనామంబు హిమశైలరాజ తనయ!
గాన వర్ణింపగా జాల దాని మహిమ.

గోపన్న దాశరథీ శతకమున "నీ నామము దాచుకో లేవు గదా?" యని రాముని ప్రశ్నించెను.

ఉ॥ నీలఘనాభ మూర్తి వగు నిన్ను గనుంగొన కోరి వేడినన్
జాలమునేసి డాగెదవు సంస్తుతి కెక్కిన రామనామమే
మూలను దాచుకో గలవు.

శ్లో॥ అజ్ఞానా దదవాజ్ఞానా దుత్తమ శ్లోక నామయత్
సం కీర్తిత మఘం పుంసాం దహత్యే ధో యథానలః

జ్ఞానముతోగాని, అజ్ఞానముతోగాని చేసిన భగవన్నామోచ్చారణము పాపక్షయము చేయుచున్నది. నామ కీర్తనమునకు జ్ఞాన మవసరము లేదు. కీర్తనతో పాపక్షయమైన తరువాత జ్ఞానోదయ మగును. వాల్మీకి కేవల రామనామ జపముననే తరించెను. భగవన్నామ స్మరణము మాటిమాటికి చేయుటచేత అంతఃకరణము శుద్ధి పొందును. దానితో పాపక్షయము వాసనాక్షయము రెండును సిద్ధించును. భగవద్విషయమైన వాసనలు వృద్ధి పొందుచూ పాప వాసనలు క్షీణించును. అప్పైన శుద్ధ సత్త్వగుణము కలిగి ఆత్మ జ్ఞానము సిద్ధించును, "సత్త్వాత్ సంజాయతే జ్ఞానమ్" నారదునకు రజో తమోగుణ పరిహారిణియగు భక్తి కలిగి సత్వగుణ మేర్పడెనని భాగవతము తెలుపుచున్నది.

శ్లో॥ మ్రియమాణో హరేర్నామ గృహ్ణన్ పుత్రోపచారితమ్
అజామీళోఽప్యగాద్ధామ కిముత శ్రద్ధయా గృణన్.

మరణాసన్న దశలో నారాయణ శబ్ద మాత్రోచ్చారణము వలన అజామీళుడు ముక్తి నందెనుగదా? ఇక శ్రద్ధతో నామస్మరణము జేయువారి విషయము జెప్పనేల?

వేదాంత శ్రవణము జేసినను ప్రతి బంధకము వలన జ్ఞానము కలుగనిచో ఆ ప్రతి బంధకమును భక్తి తొలగించును.

ఉ॥ కొంజిక తర్కవాదమను గుద్దలిచే బరతత్త్వ భూస్థలిన్
రంజిల ద్రవ్వి కన్గొనని రామ నిధానము నేడు భక్తి సి
ద్ధాంజనమందు హస్తగత మయ్యె — దాశరధీశతకము

వేదాంత శ్రవణము భక్తుడు చేయనిచో దేహాంతమున భగవంతుడే తత్త్వజ్ఞాన ముపదేశించు. మోక్షము నొసగును.

"దేహాంతే దేవః పరం బ్రహ్మతారకం వ్యాచష్టే
యేనాసా వమృతీ భూత్వా సోమృతత్త్వంచ గచ్ఛతి".
=శ్రీ నృసింహతాపిని ఉపనిషత్తు

శ్రీరామనామ జప మెంతటి ఫలమును జేకూర్చునో చూడుడు.

శ్లో॥ ఆకృష్టిః కృత చేతసా సుమహతా ముచ్చాటనం చాం హసాం
ఆచండాల మమూక లోక సులభో విశ్వశ్చ మోక్ష శ్రియః
నోదీక్షాం నచదక్షిణాం నచపురశ్చర్యాం మనాగీక్షతే
మంత్రోయం రసనా స్పృగేవ ఫలతి శ్రీరామ నామాత్మకః

రామ నామముచే మహాత్ములు ఆకర్షింపబడిరి కాన ఆకర్షణ విద్య మోక్ష లక్ష్మిని కై వశము గావించును గాన వశీకరణవిద్య పాప ములను పారద్రోలుటచేత ఉచ్చాటనవిద్య.

జాతి భేదము పాటించ పనిలేదు: దీక్ష దక్షిణ జపము అవస రము లేదు. ఈ శ్రీరామనామ మంత్రము మాత్రమే సర్వమంగళము లను చేకూర్చును.

విష్ణు సహస్ర నామమున నారాయణ జపము అభయ ప్రదానము చేయునని సూచించినది.

శ్లో॥ ఆర్తా విషణ్ణా శిధిలాశ్చ భీతా
ఘోరేషుచ వ్యాధిషు వర్తమానాః
సంకీర్త్య నారాయణ శబ్ద మాత్రం
విముక్త దుఃఖాః సుఖినో భవన్తి

..........భేకగళంబు లీల నీ
నామము సంస్మరించిన జనంబు భవం బెడబాసి తత్పరం
ధామ నివాసు లౌదురట..........

—దాశరథీ శతకము

"తెలిసి రామభజన చేయనే "అని త్యాగరాజు అన్నప్పటికిని గోపన్న కష్టలు అరచిన విధమున కేవల రామనామము మాత్రమే

జపించినను మోక్షము కల్గునని తెల్పెను. ఇందుకు నిదర్శనము వాల్మీకి మహర్షి.

ఇట్టి నామజప ప్రాశస్త్యము తెల్పుటకై అజామీళోపాఖ్యానము భాగవతమున చెప్పబడినది.

సీ॥ బ్రహ్మ హత్యానేక పాపాటవుల కగ్ని
    కీలలు హరినామ కీర్తనములు
గురు తల్ప కల్మష క్రూర సర్పములకు
    గేకులు హరినామ కీర్తనములు
తపనీయ చౌర్య సంతమసంబునకు సూర్య
    కిరణముల్ హరినామ కీర్తనములు
మధుపాన కిల్బిష మదనాగ సమితికి
    గేసరుల్ హరినామ కీర్తనములు
మహిత యోగోగ్ర నిత్య సమాధి విధుల
నలరు బ్రహ్మాది సురలకు నందరాని
భూరి నిర్వాణ సామ్రాజ్య భోగభాగ్య
ఖేలనంబులు హరినామ కీర్తనములు    భాగవతము 6-118

ఈ కథవలన తెలిసికొన దగిన విషయములు:—

1. భగవన్నామ మాహాత్మ్యము పొగడ సాధ్యముకాదు.
2. అంత్యకాలమున నారాయణనామ స్మరణము అవశ్యకర్తవ్యము.
3. హరినామ స్మరణము తెలిసి జేసినను తెలియక జేసినను పాపహరము, మోక్షప్రదము.
4. భగవద్భక్తుడు కర్మవశమున పతితుడైనను శ్రీహరియే అతనిని కాపాడును.
5. శ్రీ రమణ మహర్షి నామజపమును గూర్చి ఇట్లు తెలిపెను.

నిరంతరము నామజపము మానసికముగా చేయవలయును. ఈ జపము దైనందిన కార్యములు చేయుచున్నపుడును జరుగుచుండును.

డ్రైవరు మనతో మాటలాడు చుండియు కారును నడుపుచుండును కదా? మనము ఇతరులతో మాట్లాడునప్పుడు చదువునప్పుడు మానసిక జపము జరుగదు.

నిద్రించుటకు ముందు మానసికముగా నామజపము చేయుచున్న ఎడల నిద్రలోకూడ ఆ జపమట్లే జరిగి నిద్రలేవగనే ఆ జపమే మానసికముగా జరుగుచుండుట గమనింప వచ్చును. దీనినే ఆత్మజప మని మహర్షి తెలిపెను.

ఇట్లు నిరంతర జపము నలవరచుకొన్న వాడే అంత్యకాలమున భగవన్నామోచ్చారణ చేయును. లేని యెడల కఫవాత పిత్త ప్రకోప ముల వలన తెలివితప్పి యుండును. భాగవతమున

సీ॥ వాసుదేవ శ్లోక వార్త లాలించుచు
గాల మే పుణ్యుండు గడపుచుండు
నతని యాయువు దక్క యన్యుల యాయువు
నుదయాస్త మయముల నుగ్రకరుడు
వంచించి కొనిపోవు. —భాగవతము 2-47

అని చెప్పబడియున్నది. అందువలన దాశరథీ శతకములోని గోపన్న వాక్యములు పాటింపదగినవి.

ఉ॥ ముప్పున కాలకింకరులు ముంగిట వచ్చినవేళ, రోగముల్
గొప్పరమైనచో గఫము కుత్తుక నిండినవేళ, బాంధవుల్
గప్పినవేళ, మీ స్మరణ కల్గునొ? కల్గదొ? నాటి కిప్పుడే
తప్పక చేతు మీ భజన దాశరథీ! కరుణాపయోనిధీ!

# 13 దక్షయజ్ఞము - అభేదభక్తి

భాగవతమున దక్షయజ్ఞ కథలో అభేదభక్తి చక్కఁగా ని
పించబడినది. సర్వదేవతలు భగవన్మాయా విభూతులేనని భావి
అభేదభక్తిని పాటించవలయును. [శివకేశవ భేదము పాటించిన ద
దెట్లు శిక్షింపబడెనో చూడుడు]

శివుడు దక్షప్రజాపతి కూతురగు సతీదేవిని పెండ్లాడి దక్ష
కల్లుడయ్యెను. పూర్వము ప్రజాపతులు చేయు సత్రయాగమును జూ
టకై యోగులు మునీంద్రులు దేవతలు చతుర్ముఖ బ్రహ్మ మొదల
వారు వచ్చిరి. ఆ యాగశాల లోనికి దక్షప్రజాపతి ప్రవేశింప
బ్రహ్మయు శివుడు తప్ప తక్కిన వారందరు ఆదరమునలేచి నిల
యుండిరి. దక్షుడు బ్రహ్మకు నమస్కరించి సభ్యులు చేసిన పూజ
గ్రైకొని తన అల్లుడైన శివుడు ఇతరులవలె సభలో లేచి నిలుచుకొ
తాను ప్రవేశించునపుడు గౌరవించలేదని శివుని తూలనాడెను.

సీ॥ అనయంబు లుప్త క్రియా కలాపుడు, మాన
హీనుడు, మర్యాద లేనివాడు
మత్త ప్రచారు, డున్మత్త ప్రియుడు, దిగం
బరుడు, భూతప్రేత పరివృతుండు
దామస ప్రమథ భూతములకు నాథుండు
భూత లిప్తుం, డస్థి భూషణుండు
నష్ట శౌచుండు, నున్మదనాథుడును, దుష్ట
హృదయు, డుగ్రుడును, బరేతభూ ని

తే॥ కేతనుడు, వితతస్రస్త కేశు, డశుచి
యయిన యితనికి శివనామ దను ప్రవాద
మెటుల గలిగె, నశివుడగు నితని నెఱిగి
యెఱిగి వేదంబు శూద్రున కిచ్చి నటుల

— భాగవతము 4-43

ఇట్లు తూలనాడినను ఆ వాక్యంబులు శివుని యెడల స్తుతిగా నొప్పెను. పిమ్మట దక్షుడు రోషించి "శివుడు యాగములలో దేవతలతో హవిర్భాగము బొందక యుండు" నని శపించెను. నందీశ్వరుడదివిని దక్షుడాడిన అనర్హ వాక్యములకు, శాపమునకు కోపించి "భగవంతుని యందు దక్షుడు భేదదర్శియై అపరాధము గావించుటచేత తత్త్వవిముఖుడై కర్మల నాచరించి స్త్రీ కాముడై మేష ముఖము కలవాడగు" నని శపించెను. ఇదిగాక అక్కడజేరిన ద్విజులందరు హరద్వేషులగుటచేత "అర్థవాద బహుళములైన వేద వాక్యములచే విమోహిత మనస్కులై కర్మాసక్తు లగుదురనియు, యాచకు లగుదు" రనియు శపించెను. అంత భృగుమహాముని కోపించి శైవులందరు పాషండులగుదురని శపించెను. కాని భగవ దనుగ్రహంబున అన్యోన్య శాపంబులు వర్తింప లేదు.

శివునిపై విరోధము బూనిన దక్షుడు కొన్ని దినముల తరువాత అరుదగ్రికంబుగా వాజపేయ సవనం బొనర్చెను. ఆటుపై బృహస్పతి నామక సవనము చేయ బూనెను. దేవతలును మునులును ఆ యజ్ఞమును దర్శింప వచ్చిరి. సతీదేవియు తన తండ్రియగు దక్షుడు సేయు యజ్ఞము జూడగోరెను. ఆమె స్త్రీ స్వభావంబున కృపణురాలై జన్మభూమిని గనుగొన దలచెను. "పిలువని పేరంటమునకు పోరా" దని శివుడు తెలిపెను. "జనక గురు సుహృజ్జననాయక గేహములకు పిలువకున్నను సజ్జనులు జనుచుందురు, కావున నన్ను మన్నింపు "మని సతీదేవి వేడుకొనెను. దానికి శివుడు వ్యతిరేకించి "కుటిలులగు దుర్జనుల గృహములకు బంధువులు పోరా "దనియు "వారవమానించిన బరితాపముచే కృశింతు" రనియు దెలిపెను. ఇంకను ఇట్లనెను.

"నేను దక్షునకు బ్రత్యుత్థానాభి వందనంబులు గావింప కుండుటంజేసి యతండు తిరస్కృతుండయ్యె నంటివేని లోకంబున జను లనో

న్యంబును బ్రిత్యుత్థానాభి వందనంబులు గావింతు రదియ ప్రాజ్ఞులై; వారు సర్వ భూతాంతర్యామియైన పరమ పురుషుండు నిత్య పరిపూర్ణుండ గావున కాయిక వ్యాపారం బయుక్తంబని తదుద్దేశంబుగా మనంబునంద నమస్కారాదికములు గావింతురు, గాని దేహాభి మానంబులు గల పురుషులందు గావింపరు గాన ఏనును, వాసుదేవశబ్ద వాచ్యుండు శుద్ధ సత్త్వమయుండు, నంతః కరణంబునందు నావరణ విరహితుండునయి ప్రకాశించు వాసుదేవునకు నా హృదయంబున నెల్లప్పుడు నమస్కరించు చుండుదు. ఇట్లనపరాధినైన నన్ను బూర్వంబున బ్రహ్మలు నేయు సత్రంబునందు దురుక్తులంజేసి పరాభవించి మద్వేషియైన దక్షుండు తజ్జనకుండైన నతండును, దదను వర్తులైన వారలును చూడదగరు కావున మద్వచనాతి క్రమంబునన్ జేసి యరిగితివేని నచట నీకు పరాభవంబు సంప్రాప్తంబగు. లోకంబున బంధుజనంబుల వలన బూజ వడయక తిరస్కారంబు పొందుట చచ్చుటయే కాదే" యని పలికి మరియు సభవుండు "పొమ్మని" అనుజ్ఞ ఇచ్చెను.

భాగవతము 4-76

ఈశ్వరుడు సతీదేవికి యజ్ఞశాలలో అవమానము కలిగి అశుభము కలుగుననియు ఇచ్చట బొమ్మనక నివారించిన మనోవేదన యగుననియు మనంబునన్ దలపోయుచు నూరకుండెను.

సతీదేవి మూఢాత్మయై ఆత్మదేహము సగమిచ్చినట్టి శివుని విడిచి యజ్ఞమును చూడనేగెను. దక్షుడామెను పలుకరింప లేదు. అప్పుడామె తండ్రితో నిట్లనెను. "లోకంబున శరీరధారులైన జీవులకు క్రియాత్మకుండైన ఈశ్వరునకు బ్రియాప్రియులును, నధికులును లేరు. అట్టి సకల కారణుండును, నిర్మత్సరుండును, నైన రుద్రునందు నీవు దక్క నెవ్వండు ప్రతికూలం బాచరించు. ఈశ్వరుం ఘను నిందించిన. నీ నిమాభవ వసంగా నోర్వను."

భాగవతము 4-86

అని సతీదేవి రోషభాష లాడెను. ఇంకను "కర్మ తంత్రులగు సంసారులకు వైదిక కర్మలు, ఆత్మారాములకు కర్మలు లేకుండుటయు తగును. ఉభయకర్మ శూన్యుడు బ్రహ్మభూతుడైన శివుని నీవు క్రియా శూన్యుడని నిందింపతగదు. నా వలన కలుగు అణిమా ద్యష్టైశ్వర్యం బులు నీకు కలుగవు. చితాభస్మధారియైన రుద్రుడు దరిద్రుడు కాదని" సతీదేవి వాదించెను. భాగవతము 4-93

అవమానింపబడిన సతీదేవి శివాంఘ్రిరాజీవచింతనముచే నాథుని దక్కా నన్యంబు చూడక దేహమును యోగాగ్నిచే దహింప జేసెను. అది గాంచిన రుద్రగణములు దక్షుని శిక్షించుటకై లేచిరి. భృగు మహాముని అభిచార హోమముచేసి ఋభువులను దేవతలను ఉదయింప జేసి రుద్ర గణములను పారద్రోలెను.

జరిగిన విషయములను నారదుడు శంకరునకు తెలిపెను. శివుడు రోషకషాయితాక్షుడై జటను పెరికివైచిన అందుండి రుద్రుని బోలిన రౌద్రముగల వీరభద్రు డుదయించెను. అంత రుద్రుడు వీరభద్రుని ఇట్లాజ్ఞాపించెను. "నీవు నా భటులకు నాయకుడవై వెడలి దక్షయాగ మును ధ్వంసముచేసి దక్షుని జంపుము. అక్కడ బ్రాహ్మణ తేజము జయించుటకు సాధ్యముకాదని భావింపకుము. నా అంశతో బుట్టిన నీకు అసాధ్యము లేదు" అని ఆజ్ఞాపించెను.

వీరభద్రుడు పరివారముతో వెడలెను. యజ్ఞశాల నంతయు స్మశానముగా మార్చెను. నందీశ్వరుడు భృగువు కన్నులు పెరికెను. పూషుని దంతములను చండీశ్వరుడు పగులగొట్టెను. వీరభద్రుడు దక్షుని తలను త్రుంచి దక్షిణాగ్నిలో వ్రేల్చెను. ఇట్లు దక్షుని యాగము విధ్వంసనముజేసి వీరభద్రుడు కైలాసమున కరిగెను. ఇదంతయు ముందుగా నెఱిగిన నారాయణుడు బ్రహ్మయు యాగమునకు రాలేదు.

బాధితులైన దేవతలు బ్రహ్మ పురస్సరముగా వచ్చి దక్షిణామూర్తి రూపుడగు నీశ్వరుని స్తుతించిరి. ఈశ్వరుడు శాంతించి దక్షాదుల ననుగ్రహించెను. మేక తలతో దక్షుడు బ్రతికింపబడెను.

దక్షుడు రుద్ర విద్వేష జనిత కల్మషంబులబాసి రుద్ర క్షమాపణము గోరెను. క్రితువును పూర్తిజేసెను. అంత నారాయణుడు ప్రత్యక్షమయ్యెను. దక్షుడు నారాయణుని పూజించి ఇట్లని వేడికొనెను. "లోకంబులకు నీవ ఈశ్వరుండ వనియు నితరులైన బ్రహ్మరుద్రాదులు భవన్మాయా విభూతు లగుటంజేసి లోకంబులకు నీశ్వరులు గారనియు భేద దృష్టిగల నన్ను రక్షింపుము. ఈ విశ్వకారణులైన ఫాలలోచనుండును బ్రహ్మయు దిక్పాలురును సకల చరాచర జంతువులును నీవ. భవ ద్వ్యతిరిక్తంబు జగంబున లేదని" విన్నవించెను. పై దక్షుని వాక్యముల వలన అభేదభక్తి ప్రతిపాదింప బడినది.

భాగవతము 4-170

మత్తః పరతరం నాన్యత్ కించిదస్తి ధనంజయ!

భగవద్గీత 7-7

దేవతలు ఋత్విక్కులు మొదలగువారు శ్రీహరిని స్తుతించిరి. శ్రీహరి సంతుష్టాంతరంగుడై దక్షునితో అభేదభక్తిని పాటింపుమని ఇట్లు పలికెను. "అనఘా! ఏనును, బ్రహ్మయు, శివుండును నీ జగంబునకు కారణ భూతుల, మందు నీశ్వరుండను నుపద్రష్టను స్వయం ప్రకాశకుండనునై గుణమయంబైన యాత్మీయ మాయం బ్రవేశించి జనన వృద్ధి విలయంబులకు హేతు భూతంబులగు తత్తత్క్రియోచితంబులైన బ్రహ్మ రుద్రాది నామధేయంబుల నొందుచుండుదు. అట్టి అద్వితీయ బ్రహ్మరూపకుండనైన నాయందు నజ భవాదులను, భూతగణంబులను, మూఢుండగువాడు వేరుగా జూచు. మనుజుండు శరీరంబునకు కరచరణాదులు వేరుగా దలంపని చందంబున మద్భక్తుండగువాడు నాయందు భూత జాలంబు భిన్నంబుగా దలంపడు, గావున మా మువ్వరయందు నెవ్వండు వేఱు సేయకుండువాడు కృతార్థుం"డని యానతిచ్చెను. ఈ వాక్యముల వలన అభేదభక్తియు ఏకేశ్వరోపాసనయు ప్రతిపాదింప బడినది.

ఈ కథ వలన గ్రహింపదగిన విషయములు:—

(1) వివాహితలైన స్త్రీలు తండ్రి ఇంటికైనను పిలువని పేరంట మునకు పోరాదు.

(2) శివకేశవులయందు భేదబుద్ధి పాటింపరాదు.

(3) శివశక్తి బ్రాహ్మణ శక్తిని మించినది.

(4) వేద వాక్యములు అర్ధవాద బహుళములు. వాని సరియగు అర్థమును గ్రహింపక విమోహిత మనస్కులై మానవులు కర్మాసక్తులగుదురు. కేవల కర్మ పరతంత్రులు కారాదు. ఈ విషయమునే గీతయందు శ్రీకృష్ణుడు తెలిపెను.

శ్లో॥ యా మిమాం పుష్పితాం వాచం ప్రవదం, త్యవిపశ్చితః
వేదవాద రతాః పార్థః నాన్యదస్తీతి వాదినః

శ్లో॥ కామాత్మనః స్వర్గపరా జన్మ కర్మ ఫలప్రదాం
క్రియా విశేష బహుళాం భోగైశ్వర్య గతిం ప్రతి

శ్లో॥ భోగైశ్వర్య ప్రసక్తానాం తయాపహృత చేతసాం
వ్యవసాయాత్మికా బుద్ధిః సమాధే నవిధీయతే

గీత 2-42-, 43, 44.

(5) అట్టి అభేదభక్తిని ప్రతిపాదించిన పోతన తన తప్పును గుర్తించి వీరభద్ర విజయము వ్రాసెనని కొందరు క్రింది పద్యము ఉదాహరింతురు కాని ఇది కల్పితమనియు వీరభద్ర విజయములో చేర్చబడెననియు గ్రహింపవలయును.

ఉ॥ భాగవత ప్రబంధ మతి భాసురతన్ రచియించి దక్షకృ
ద్యాగ కథా విధానమున నల్ప మనస్కుడ నైతి దన్నిమి
త్తాగమ వక్త్రదోష పరిహారరతకై యజనైక శైవ శా
స్త్రాగమః వీరభద్ర విజయంబు రచించెద వేడ్క తోడుతన్

# 14. ధ్రువోపాఖ్యానము

## మంత్రదీక్ష అష్టాంగ యోగములవలన దైవ సాక్షాత్కారము

ఈ కథవలన విష్ణు సాక్షాత్కారము కేవల ఆత్మానాత్మ విచారము చేతనే అనగా జ్ఞానమార్గము చేతనే సాధ్యమగునను అపోహను తొలగించుచున్నది. బాలకుడైన ధ్రువునకు శాస్త్రపరిజ్ఞానము లేదు. పంచ వయస్కుడగు బాలుడగుటచే వైదిక కర్మల కధికారము లేదు. కేవల నారాయణ మంత్రానుష్ఠానము చేతను, యోగము చేతను విష్ణు సాక్షాత్కారము పొందగలిగెను. భగవంతుడే ఆ బాలునకు ఆత్మానాత్మ వివేకము కలిగించి ధ్రువపదమును గూర్చెను.

భగవద్గీతలో భక్తునకు "దదామి బుద్ధి యోగం" జ్ఞానమును కలుగ జేయుదునని శ్రీకృష్ణుడు తెలిపెను. దేవీ గీతలో మంత్రము, యోగము రెండింటిని అనుష్ఠించిన మోక్షము సిద్ధించునని తెలుపబడినది. రమణ గీతలో మహర్షికూడా ధ్యానకు సంవిమర్శకునకు గతి యేకమని చెప్పియున్నారు. పై విషయములకు ఈ కథ నిదర్శనముగా నుండుట గమనింపుడు.

ఉత్తానపాదుడను రాజునకు ఇద్దరు భార్యలు కలరు. సునీతి- సురుచి. పెద్ద భార్యయైన సునీతి కుమారుడు ధ్రువుడు. చిన్న భార్య యైన సురుచి కొమారుడు ఉత్తముడు. ఒకనాడు ఉత్తముడు తండ్రి తొడపై కూర్చుండి యుండగా ధ్రువుడుకూడ తండ్రితొడ నెక్క బోయెను. సురుచి ధ్రువుని వారించి "జనకు తొడనెక్కు భాగ్యము నా గర్భమున బుట్టినవానికి గాని అన్యునకు గలుగదు. అట్టి కోరిక గలదేని శ్రీహరిని సేవించి తన కడుపున బుట్టు వరమును బడయుము" మని అసహ్య వచనములు బలికెను. ఉత్తానపాదుడు కూడ సురుచి యందు బద్ధానురాగు డగుటచేత ధ్రువుని నుపేక్షించెను. బాలకుడైనను ధ్రువుడు

క్షత్రియకుల సంజాతు డగుటచేత దండ తాడిత భుజగంబువలె రోషించి తన తల్లివద్ద కరిగి విలపించెను.

ఈ కథలోని పాత్రల నామములే అర్థవంతముగా నున్నవి. ఉత్తాన పాదనకు చిన్న భార్యయగు సురుచి ఎక్కువగా రుచించినది. నీతి మంతురాలైన పెద్ద భార్యయగు సునీతిపై అతనికి ప్రేమ తక్కువ. అతనిచే సునీతి ""పెండ్లామని కాదు. నికృష్ట దాసి యనియును బిలువంగను జాలని దుర్భగురాలు" దీనివలన నీతికి ఆదరణ లేదనియు ఇంద్రియ లోలత్వము వలన ఉత్తానపాదుడు పక్షపాతము చూపెననియు తెలియుచున్నది.

సునీతి చేయునది లేక ధ్రువుని అనునయ వాక్యముల సంతోష పరచి శ్రీహరియే నీకు శరణ్యమని వచించెను. పరమ పురుషుడైన శ్రీహరిని కొలుచుటకు ముందు లక్ష్మీదేవిని ప్రార్థింపవలెనని కూడ తెలిపెను.

క॥ కర సరసీజ గృహీతాం
బురుహాయు, నరవింద గర్భముఖ గీర్వాణుల్
పరికింపంగల లక్ష్మీ
తరుణీమణిచేత వెదుకదగు పరమేశున్

భాగవతము 4-235

త్రిగుణాత్మకమగు ప్రకృతి రూపిణియైన శ్రీదేవి నుపాసించి ఆమె యనుగ్రహమును బడసినగాని శ్రీహరిని దర్శింప వీలుకాదు. అనగా రజోతమోగుణంబులను-ఇంద్రియ మనంబులను - జయించిన తరువాత శుద్ధ సత్త్వమేర్పడి జ్ఞానము కలుగును.

ధ్రువుడు తపము జేయుటకై అరణ్యమునకు బయలుదేరెను. దారిలో నారదు డతనిని జూచి "పాపనాశ కరంబైన తన కరంబున ధ్రువుని శిరం బంటెను." బాలుడై క్రీడల యందాసక్తిగల ధ్రువునకు దుష్కరంబైన తపము అసాధ్యమని నివారింప బూనెను. దాని నంగీకరింపక ధ్రువుడు పినతల్లియగు సురుచి కావించిన అవమానముచేత

తన మనస్సు శాంతి పొందదనియు త్రిభువనోత్కృష్టంబు, అనన్యాధిష్ఠింబునైన పదంబు బొందుటకు మార్గము నుపదేశింపుమని కోరెను. నారదు డిట్లుపదేశించెను.

"చతుర్విధ పురుషార్థములు సిద్ధించుటకు హరిపద యుగళము నాశ్రయింపవలయును. నీవు బాలుడవగుట జేసి వేదాధ్యయనాది ఉచిత కర్మానర్హుండవు. అయినను యమ నియమముల బాటించి, ఆసనము కల్పించి, ప్రాణాయామమున, ప్రాణ ఇంద్రియ మనో మలంబుల చాంచల్య దోషముల హరించి, స్థిర చిత్తమున పురుషోత్తముని నేకాగ్ర చిత్తమున ధ్యానింపుము. శ్రీవాసుదేవ ద్వాదశాక్షరీ మంత్రమును జపియింపుము. మనోవాక్కాయ కర్మంబులచేత మనోగతం బగునట్లుగా భక్తియుక్తంబులైన పూజలచేత పూజింపబడి సర్వేశ్వరుడు నభిమితార్థ మునిచ్చును. విరక్తునకు మోక్షము సిద్ధించును, "అని నారదుడు కర్తవ్యము నుపదేశించెను.

పై విధానము ఆత్మానాత్మ విచారముకాదు. యమ నియమ ప్రాణాయామముల చేతను, మంత్రజపము చేతను, ఇంద్రియ మనో బలంబుల దొలగించి పురుషోత్తముని ఏకాగ్ర చిత్తమున ధ్యానించుట సూచింపబడినది. ఈ మార్గమువలన ఇంద్రియము లీశ్వరవిషయములై మనస్సు నిశ్చలమై భక్తుడు ధ్యానసిద్ధుడగును. ఏకాగ్రతతో కూడిన ధ్యానములో త్రిపుటి నశించి ఆత్మ సాక్షాత్కారము కలుగును. పై మార్గమును ధ్రువుడనుసరించి "హరి రూపమూనకంటె నన్యంబు నెఱుగక చిత్త మవ్విభునందు "జేర్చెను. అంతట "సమధిక జ్ఞాన నయన గోచర సమగ్ర మూర్తిగా" భగవంతుడైన శ్రీహరి యగుపించెను. బాలుడైన ధ్రువునకు శ్రీహరిని స్తుతించుటకు తగిన పాండిత్యము లేదు. శ్రీహరి వేదమయమైన తన శంఖముచేత ధ్రువుని కపోలతల మంటెను. అతడు జీవేశ్వర నిర్ణయజ్ఞుండై వేదాత్మకములైన వాక్యములచే శ్రీహరిని స్తుతించెను.

ఇంద్రియములను నియమించిన ధ్రువుడు రజోగుణము తమోగుణములను జయించి ధ్యాన సిద్ధుడయ్యెను. సత్వగుణముచే గలుగు

ఆవరణము తొలగించుటకు శ్రీహరి అతనిని జీవేశ్వర నిర్ణయజ్ఞునిగా నొనర్చెను అనగా భగవంతుడే జ్ఞానమును ప్రసాదించును.

జ్ఞానవాన్ మాం ప్రపద్యతే—గీత

శ్రీహరి సుజ్ఞానియైన ధ్రువునకు ఐహిక వరంబులిచ్చి అంత్యమున ధ్రువపదము చెందగలవని దీవించెను. ధ్రువ డనేక వత్సరములు రాజ్యమును పాలించి తుదకు విష్ణు దివ్యపదము జేరెను.

ధ్రువోపాఖ్యానము వలన గ్రహింపదగినవి:—

(1) శ్లో॥ తేషాం సతతయుక్తానాం భజతాం ప్రీతి పూర్వకం
దదామి బుద్ధియోగం తం యేన మా ముపయాంతి తే
భగవద్గీత—

కోరికలు లేక భక్తిచే నెల్లప్పుడు నా సేవల జేయువారలకు నేనే తగిన పరికరముల నిచ్చి నా యొద్దకు జేర్చుకొందును. నేనే ఆత్మజ్ఞానము కలుగజేసెదను.

భక్తునకు భగవంతుడే ఆత్మజ్ఞానము ప్రసాదించు ననుటకు ధ్రువోపాఖ్యానము నిదర్శనము.

(2) శ్లో॥ న యోగేన వినా మంత్రో న మంత్రేణ వినా సః
ద్వయో రభ్యాస యోగోహి బ్రహ్మసంసిద్ధి కారణమ్
—దేవీగీత

మంత్రము యోగము రెండింటిని అభ్యసించిన బ్రహ్మసంసిద్ధిని బడయ వచ్చునని దేవీగీత వచించినట్లు ధ్రువుడు ద్వాదశాక్షరీ మంత్రమును యోగమును అభ్యసించి విష్ణు సాక్షాత్కారమును పొందును.

(3) శ్లో॥ మాంహి పార్థ! వ్యపాశ్రిత్య యేఽపిస్యుః పాపయోనయః
స్త్రియో వైశ్యాస్తథా శూద్రాస్తేఽపి యాంతి పరాంగతిమ్
భగవద్గీత—

కులమత వయోవివక్షత లేక భక్తి మార్గము నవలంబింప వచ్చును. బాలుడైన ధ్రువుడు వేదాధ్యయన సంపన్నుడు కాడు. భక్తితో ప్రాణాయామ మంత్రజపముల వలన ముక్తుడయ్యెను.

# 15. భరతోపాఖ్యానము

## వ్యామోహము

భరతుడను మహారాజు పంచజని యను కన్యను పెండ్లియాడి, అహంకారమునకు పంచ తన్మాత్రలు పుట్టిన రీతిని, ఏవురు పుత్రులను కనెను. అతడు ధర్మంబున రాజ్యము చేయుచుండి భగవదారాధనల యందు కాలము గడపి ఏబది లక్షల వేలయేండ్లు రాజ్యము పాలించిన తరువాత తన ధనంబును పుత్రులకు పంచి యిచ్చి పులహాశ్రమంబు చేరెను. అచట సాలగ్రామముల పూజించి శ్రీహరిసేవ చేయుచుండెను. దానివలన శమ దమాది సాధన చతుష్టయ సంపత్తి అతని కేర్పడెను. ఒక దినము నదియందతడు స్నానమాచరించు చుండగా నిండు చూలాలుగా నున్న ఒకజింక నీరుత్రాగుటకై వచ్చి, సింహ గర్జనమువిని భీత చిత్తయై యెగురగా గర్భస్రావమై యది మరణించెను. దానికి జనించిన లేడికూన నీటబడి తేలుచుండుట జూచి భరతుడు కరుణార్ద్ర చిత్తుడై తల్లిలేని ఆ హరిణ శాబకమును తన యాశ్రమమున పెంచెను. అతడు భగవదర్చనాదుల విస్మరించి ఆ లేడికూన లాలన పాలన పోషణముల యందు లగ్నచిత్తుడయ్యెను. ఇట్లు పుత్రాదులను కూడ వదలివచ్చిన భరతుడు పూర్వ కర్మవశమున యోగభ్రష్టు డయ్యెను. అతడు ప్రాణోత్క్రమణ సమయమున హరిణరూపమునే మనస్సున నిల్పుటచేత తరువాత జన్మమున హరిణమై పుట్టి పూర్వజన్మ స్మృతి కలిగియుండెను. మృగ దేహమును వదలగోరి భరతుడు శుష్కపర్ణ తృణాహారుడై కొన్ని దినములకు శరీరము వదలి అంగిరసు డను బ్రాహ్మణునకు సుతుడై పుట్టెను.

ఉత్కృష్టమైన బ్రాహ్మణ జన్మను పొంది తన పూర్వజన్మ పరంపరల స్మరించుచు ఉన్మత్త జడాంధ బధిరులవలె నగుపించు చుండెను. జనకు డతనికి జాత కర్మాదులు నిర్వర్తించి గాయత్రి మంత్రో

పదేశ మొనర్చెను. తల్లితండ్రులు గతించిన తరువాత అన్న లతనిని చదువనీయక గృహకర్మల చేయుమనిరి. సుఖదుఃఖముల యందభి మానము జూపక బ్రహ్మచర్యము బూని దొరికిన దానితో తృప్తి జెందు చుండును.

ఒకనాడు సంతాన కాముడైన వృషలపతి భరతుని కాళికకు బలియివ్వ గొనిపోయెను. అప్పుడు భరతుడు

"... ... ... ... ... ... ... ... ... ... చంపగా

వచ్చిన వారియందు, గరవాలము నందును, గాళియందు బా నచ్యుత భావముంచి హృదయంబున బద్మదళాక్షు నిల్పి"
అనుమానము బొందక యుండెను. భాగవతము 5-136

భద్రకాళి, బ్రహ్మభూతాత్ముడైన భరతుని బ్రహ్మతేజము చూడ దుస్సహమైన, భయమంది వృషలపతిని భృత్య వర్గమును చంపివైచెను.

ఒకనాడు రహూగణుడను సింధు భూపాలుడు కపిల మహాముని వద్ద బ్రహ్మజ్ఞానము నెఱుగ గోరి శిబిక నారోహించి యరుగుచుండెను. శిబికను మోయు బోయలు చేనిలో గాపున్న భరతుని జూచి శిబికను మోయమని అతని తలపై బెట్టిరి. అతడు దానికి జింతింపక మోయు చుండెను గాని భారమును సరిగా మోయ జాలక అందులో గూర్చున్న రాజునకు బాధ కలిగించెను. ఆ వాహకులు తమవలన తప్పులేదన భర తుని మాహాత్మ్యము తెలియక అతనిని దూషించెను. భరతు డతనికి తత్త్వోపదేశములైన మాటలు జెప్పెను. రాజతని వాక్యముల భావము గ్రహించి, అత డవధూతయని భావించి, శిబిక దిగి, యతనిని క్షమింపు మని వేడికొని, అతనివలన తత్త్వ విజ్ఞానమును తెలిసికొని దేహాత్మ భ్రమను బాసెను.

ఈ కథ విన్నవారిని పుండరీకాక్షుడు రక్షించును. ఆయు రభి వృద్ధి, ధనధాన్య సమృద్ధి, స్వర్గాది భోగములు కలుగును.

భరతోపాఖ్యానము వలన గ్రహింపదగినవి.

(1) అంత్యకాలమున మనమున నెట్టి చింత యుండునో అట్టి జన్మ కలుగును. దీనినే భగవద్గీతలో ఇట్లు కృష్ణపరమాత్మ తెలిపెను.

శ్లో॥ యం యం వాపి స్మరన్ భావం త్యజ త్యంతే కలేవరమ్
తం తమే వైతి కౌన్తేయ! సదా తద్భావ భావితః

ఎవడు మరణకాలమున ఏఏ భావమును స్మరించుచు శరీరమును విడుచునో ఆయా భావమునే పొందును.

భరతుడు మరణకాలమున తాను పెంచిన జింకను స్మరించుట వలన అతడు జింకయై పుట్టెను కదా? కావున యోగభ్రష్టుడయ్యెను.

(2) భగవద్గీతలో యోగభ్రష్టుడు మరుజన్మలో శ్రీమంతుల ఇంట గాని యోగుల ఇంటగాని జన్మించునని తెలుపబడినది.

శ్లో॥ ప్రాప్య పుణ్యకృతాం లోకా నుషిత్వా శాశ్వతీ స్సమాః
శుచీనాం శ్రీమతాం గేహే యోగభ్రష్టోఽభి జాయతే

శ్లో॥ అథవా యోగినా మేవ కులే భవతి ధీమతాం —భగవద్గీత

యోగసిద్ధిని పొందని మనుజుడు రెండవ జన్మమున పరిశుద్ధు లగు శ్రీమంతుల ఇండ్లలో బుట్టుచున్నాడు. లేదా యోగుల ఇండ్లలో బుట్టును.

అట్లే యోగభ్రష్టుడైన భరతుడు హరిణజన్మను త్యజించిన తరువాత ఉత్కృష్టమైన బ్రాహ్మణ జన్మను పొందెను.

(3) అవధూతలు ఉన్మత్త జడాంధులవలె అగుపింతురు.

(4) మాయా శక్తియైన భద్రకాళి బ్రహ్మభూతాత్ముడైన భరతుని బలిగొనలేదు.

"నాత్మానం మాయా స్పృశతి"

(5) భక్తులకు భగవంతుని యందు దక్క ఇతరుల యందు వ్యామోహ ముండరాదు.

(6) విధి బలీయ మగుటచేత పూర్వకర్మాను సారము జరుగును.

---

# 16. అశ్వత్థామ నవమానించుట

## సాత్వత సంహిత

భీముని గదా ఘాతములచేత దుర్యోధనుడు తొడవిరిగి కూలగా దుర్యోధనునకు ప్రియము సేయనెంచి అశ్వత్థామ నిదురించు ద్రౌపది పుత్రుల (ఉప పాండవుల) శిరములు ఖండించెను. ఆ వార్తవిని ద్రౌపది నేలబడి ఏడ్చెను. ఆమె నర్జును డోదార్చి, శ్రీకృష్ణుడు రథసారథిగా రాగా, అశ్వత్థామను తరిమి వెంబడించెను. అశ్వత్థామ ఓపినంత దూర ము పరుగిడి, ప్రాణరక్షణకై గత్యంతరము లేక, ప్రయోగంబు మాత్రము తెలిసి ఉపసంహారము తెలియక పోయినను పార్థుని మీదికి "అపాండవ మగుగాక," యని బ్రహ్మశిరో నామకాస్త్రమును ప్రయో గించెను. ఆ అస్త్రముయొక్క తేజము భూనభోంత రాళముల నిండి ప్రాణి భయంకరమై తోచిన అర్జునుడు దానిని తెలిసికొనలేక "ఇది ఏమని" శ్రీకృష్ణుని ప్రశ్నించెను. శ్రీకృష్ణుడు "ఉపసంహారము తెలి యకయే ప్రాణరక్షణకై బ్రహ్మశిరోనామ కాస్త్రమును అశ్వత్థామ ప్రయోగించెను. దానిని నీ బ్రహ్మాస్త్రమునగాని మరలింప వీలుకాదు. ప్రయోగింపుమని" తెలిపెను. పార్థుడు జలంబుల వార్చి హరికి ప్రద క్షిణముచేసి తాను బ్రహ్మాస్త్రమును ప్రతిగా ప్రయోగించెను. ఆ రెండు బ్రహ్మాస్త్రములు పోరు సల్పగా శ్రీకృష్ణుని ఆజ్ఞమేరకు పార్థుడా రెండింటి నుపసంహరించెను. భారతమునందు ద్రోణుడు తన ప్రియ శిష్యుడైన అర్జునునకు "బ్రహ్మ శిరంబను దివ్యబాణంబు సప్రయోగ నివర్తనంబుగా నిచ్చె" ననియు "దీనికి నీవనర్హుడ" వనియు కూడ తెలిపెనని చెప్పబడి యున్నది.

తరువాత అర్జునుడు అశ్వత్థామను బంధించి ద్రౌపది వద్దకు తీసికొని వెళ్ళెను. అశ్వత్థామ పాండవుల గురువగు ద్రోణాచార్యుని కుమారుడు. ద్రౌపది "సుస్వభావ" అగుటచేత గురుపుత్రుడగు అశ్వ త్థామ తన పుత్రుల చంపినప్పటికి నమస్కరించినదట. ఇట్టి సాత్విక గుణము ఆమెలో ఎట్లు కలిగినది? "సుస్వభావ" యని భాగవతమున

వర్ణింప బడుటచేత ఆమె శాంత రసాధిదేవతగా మారినది. భారతమున ఆమె వీరవనితగా చిత్రింపబడి, అశ్వత్థామ ధర్మ వ్యతిరిక్త కార్యమును జేయుటచేత అతని చావును కోరినది. ఒకవేళ భాగవతము సాత్విక పురాణ మగుటచేత శ్రీకృష్ణ భక్తులందరు దానిలో సత్వగుణ ప్రధానులుగా చిత్రింపబడి యుండవచ్చును. లేదా పోతన శాంతగుణము ఆమెలో అభివ్యక్తమై యుండవచ్చును. ద్రౌపది అశ్వత్థామతో చెప్పిన మాటలు క్రోధో ద్రేకములతో పలుక బడలేదు. అవి కరుణారస పరిపూర్ణములు. స్థితప్రజ్ఞునికి గీతలో దయాగుణ మవసరమని చెప్పబడినది. పరుష వాక్యము లాడకుండుట వాచిక తపస్సని చెప్పబడినది. అందువలన సత్త్వగుణముగల ద్రౌపది సాత్విక పురాణమైన భాగవతమున అశ్వత్థామతో ఇట్లు తెలిపెను.

మ॥ పరగన్ మా మగవార లందరను మున్ బాణప్రయోగోపసం
హరణా ద్యాయుధ విద్యలన్నియును ద్రోణాచార్యుచే నభ్యసిం
చిరి, పుత్రాకృతి నున్న ద్రోణుడవు, నీ చిత్తంబునన్ లేశమున్
గరుణా సంగములేక శిష్య సుతులన్ ఖండింపగా బాడియే?

భాగవతము 1-160

గురుపుత్రుడవగు నీవు దయలేక శిష్య సుతులను ఖండింప వచ్చునా?

క॥ భూసురుడవు, బుద్ధిదయా
భాసురుడవు, శుద్ధ వీరభట సందోహా
గ్రేసరుడవు, శిశుమారణ
మాసుర కృత్యంబు ధర్మమగునే తండ్రీ! భాగవతము-1-161

అగ్నివర్ణుడైన బ్రాహ్మణుడవు. బుద్ధిమంతుడవు. వీరాగ్రేసరుడవు. అసురులవలె శిశువులను జంపుట నీకు ధర్మమా?

శా॥ ఉద్రేకంబున రారు. శస్త్రధరులై యుద్ధావనిన్ లేరు, కిం
చిద్ద్రోహంబును నీకుజేయరు, బలోత్సేకంబుతో జీకటిన్
నిద్రాకారుల చిన్నిపాపల రణప్రౌఢక్రియా హీనులన్
నిద్రా సక్తుల సంహరింప నకటా! నీ చేతులెట్లాడెనో?

భాగవతము 1-162

నిద్రించు చిన్నపాపల జంప నీకు న్యాయమా?

ఉ॥ అక్కట పుత్ర శోక జనితాకులభార విషణ్ణ చిత్తనై
పొక్కుచు నున్న భంగి నినుబోర గిరీటి నిబద్ధు జేసి నే
డిక్కడ కీడ్చితెచ్చుట సహింపనిదై భవదీయ మాతనే
డెక్కడ నిట్టి శోకమున నే క్రియ నేడ్చుచు బొక్కునున్నదో?

భాగవతము 1-163.

పుత్రి శోకముతో కుమిలిపోవు నా వలెనే నీ తల్లి నీవు బద్ధ డవై నా ముందుంచ బడితివని తెలిసినంతటనే నీకై ఎంత దుఃఖించు చున్నదో కదా!

ఇతరులను "ఆత్మకుం సములుగా జింతించుట" ద్రౌపదియందు వర్తించుచున్నది. కష్ట పరంపరల ననుభవించిన ద్రౌపదికి (భారత యుదానంతరము) సాత్విక దృష్టి యలవడెనేమో? యనిపించుచున్నది.

ఉ॥ ద్రోణునితో శిఖంబడక ద్రోణ కుటుంబిని యున్నదింట, న
క్షీణ తనూజ శోక వివశీకృతనై విలపించు భంగి, నీ
ద్రౌణి దెరల్చి తెచ్చుటకు దైన్యము నందుచు నెంత పొక్కునో
ప్రాణ వియుక్తుడైన యతి పాపము బ్రాహ్మణ హింస మానరే.

భాగవతము 1-165

ద్రోణుని భార్య తన భర్త మరణించినను సహగమనము చేయక బ్రితికి యున్నది. ఇప్పుడు పుత్రిశోకమునకు గూడ గురియైన నెంత విలపించునో గదా! "బ్రాహ్మణ హింస ధర్మము కాదు. మాను"దని ద్రౌపది కృష్ణార్జునులతో చెప్పినది. ఇట్లు "ధర్మ్యంబును, సకరుణం బును, నిర్వ్యళీకంబును, సమంజసమును, శ్లాఘ్యంబునుం"గా ద్రౌపది బలికినది. దానికి ధర్మరాజు సంతసించెను. గాని భీముడు

చ॥ కొడుకుల బట్టి చంపెనని కోపము నందదు, బాల ఘాతకున్
విడువు మటంచు జెప్పెడిని, వెఱ్ఱిది ద్రౌపది, వీడు విప్రుడే?
విడువగనేల చంపు డిటు, వీనిని మరల చంపరేని నా

పిడికిటి పోటునన్ శిరము ఛిన్నము సేసెద జూడు డిందరున్

భాగవతము-1-168

అని పలికిన ద్రౌపది అశ్వత్థామకు అడ్డము వచ్చెను. ఆమె భీముని నివారింప జాలదని తెలిసి శ్రీకృష్ణుడు చతుర్భుజుడై రెండు చేతుల భీముని వారించి, రెండు చేతుల ద్రౌపదిని తొలగించెను. అంత అర్జునుడు అశ్వత్థామ శిరోజముల దరిగి బ్రాణావశిష్టుని జేసి విడిచి పెట్టెను.

ఈ కథవలన గమనింపదగినవి:—

(1) బ్రాహ్మణో నహంతవ్యమ్

(2) చంపదగిన యట్టి శత్రువు తనచేత జిక్కెనేని కీడు సేయరాదు. పొసగ మేలుజేసి పొమ్మనుటే చాలు.

## భారతమునందు అశ్వత్థామ నవమానించు కథ:-

సౌప్తిక పర్వములో భారతమున ద్రౌపది పుత్రశోకము నాపుకొనజాలక "కోపంబు దీపింప" ధర్మరాజుతో నిట్లనియెను.

"భూరమణ గాఢ నిద్రం
గూరిన సమయమున ముట్టికొని నా సుతులం
గ్రూరత దెగటార్చెను బా
పారంభుడు గురు తనూజు డకమ లీలన్

క॥ అది యాఱని పెనుచిచ్చై
మది గాల్చ దొడంగె; దీని మాన్ప నుపాయం
బు దలంప నొండు లేద
య్యుదయుని ముట్టుకొని నామ మడచుట దక్కన్

క॥ వాయుసుతు బనిచి నేడటు
వేయింపక తక్కితేని, జెప్పెద విను మే
ప్రాయోప వేశమున నీ
కాయ ముపేక్షింతు జుమ్మ కౌరవ నాథా!

భారతములో శిశుహంత యగు అశ్వత్థామ దోషియై ధర్మము తప్పుటచే శిక్షార్హుడని ద్రౌపది వాదించెను. అతనిని తగినట్లు శిక్షింపని యెడల తాను ప్రాయోపవేశ మొనర్తునని ప్రతిజ్ఞ చేసెను. కాని భాగవతమున ఆమె భాగవత సాత్త్విక తత్త్వమును జీర్ణించు కొన్నదాని వోలె "సుస్వభావయై" అశ్వత్థామతో బలికిన మాటలలో తన పుత్రశోకము, మాతృప్రేమ వ్యక్తపరచుటయే గాక అశ్వత్థామను సానుభూతితో తిలకించినది. అశ్వత్థామ "బాలవధ జనిత పరాఙ్ముఖు" డట. "పుత్రాకృతి నున్న ద్రోణు"డట. అతని తల్లి తనవలె శోకమున గుందుచున్నదట. భాగవత ప్రతిపాదిత సత్త్వగుణమును జీర్ణించుకొన్న పోతనయే ద్రౌపది పాత్రతో తాదాత్మ్యముచెంది ఇట్లు పలికించి యుండ నోపును.

---

# 17. గజేంద్ర మోక్షము

## సంసార విముక్తి

గజేంద్రమోక్షము జీవుడు ముక్తినిజెందు కథ. "గజరాజ మోక్షణ కథను వినువారికి మోక్ష మరచేతిదై యుండు" (8-135) నని ఫలశ్రుతి యందు చెప్పబడినది.

పూర్వము ద్రవిడ దేశాధీశ్వరుడగు ఇంద్రద్యుమ్న మహారాజు మౌనియై మహాశైలాగ్ర భాగమున నారాయణుని బూజసేయు కాలమున కలశజు డేతెంచెను. రాజతనిని పూజింపడయ్యెను. దాన కినిసి ఆ ఋషి ఇంద్రద్యుమ్నుని "గజముగా బుట్టు"మని శపించెను.

"విప్రులగని అవమానింప దగదు ఘన పుణ్యులకున్"

భాగవతము 8-124

శాప కారణమున ఇంద్రద్యుమ్నుడు గజరాజ మయ్యెను. అతని సేవక భటాదులు గజములైరి. అయినప్పటికిని అతడు తొలి జన్మమున విష్ణుసేవా పరతంత్రు డగుటచేత ఆ సేవ చెడని పదార్థమయ్యెను.

క॥ చెడు కరులు హరులు ధనములు
జెడుదురు నిజ సతులు సుతులు జెడు చెనటులకున్
జెడక మనునట్టి గుణులకు
జెడని పదార్థములు విష్ణుసేవా నిరతుల్
భాగవతము 8-127

ఈ కథలో ఏనుగులు జీవుని అజ్ఞాన అంధకారమును సూచించు నన వచ్చును.

ఆ॥ అంధకారమెల్ల నద్రి గుహాంతర
వీధులందు బగలు వెఱచి డాగి
యెదరు వేచి సంధ్య వినుదు వృద్ధత నున్న
వెడలె ననగ గుహలు వెడలె గరులు. భాగవతము 8-27

గజేంద్రుడు తన పరివారముతో బయలుదేరి ఒక కాసారమును ప్రవేశించి నీరు ద్రాగుచు విహరింప దొడగెను. ఇంతలో మకర మొకటి గజేంద్రుని పాదములను బట్టుకొనెను. గజేంద్రుడు ఆ మకరముతో చాల కాలము పెనుగులాడి అలసిపోయెను. మకరము పట్టుదలతో యోగీంద్రుని వలె విక్రమించెను. యోగీంద్రుడు ఏకాగ్ర చిత్తముతో అప్రమత్తుడై చలింపక హరిపాద పద్మములను విడువక బట్టునట్లు మకరము కరీంద్రుని పాదముల నొడసి పట్టెను.

శా॥ పాద ద్వంద్వము నేలమోపి, పవనున్ బంధించి పంచేంద్రియో
న్మాదంబున్ బరిమార్చి, బుద్ధి లతకున్ మాఱాకు హత్తించి, ని
ష్ఖేద బ్రహ్మ పదావలంబన రతిం గ్రీడించు యోగేంద్రు మ
ర్యాదన్ నక్రము విక్రమించె గరి పాదాక్రాంత నిర్వక్రమై
భాగవతము 8-65

ఎంతటి గట్టి పట్టోచూడుడు. "మొసలి పట్టు"ను సామెత తెలిసినదే కదా? ధ్యాతకు మనసు చెదిరిన దేవతారూపము చెదరి ఏకవస్తు చింతనమగు ధ్యానమునకు అంతరాయము కలుగును. ఏ కార్య సాధనకైన పట్టుదల అవసరము. రాహువుచే మింగ బడిన సూర్యునివలె

మొసలిచే గజేంద్రుడు పట్టువడెను. ఇక గజేంద్రుని స్థితిని పరికిం తము. గజేంద్రుడు జీవుడు. అతడు "మోహలతా నిబద్ధ పదమున్ విడి పించు కొనంగలేడు." సంసార సాగరమున జిక్కుకొని మోహపాశ బద్ధుడై దీనుడై యుండెను. అతడు మాయచే గట్టువడిన జీవుడే కదా!

ఉ॥ ఊహ గలంగి జీవనపు టోలమునన్ బడి పోరుచున్ మహా
మోహలతా నిబద్ధ పదమున్ విడిపించు కొనంగలేక సం
దేహము బొందు దేహికిఁ క్రియ దీన దశన్ గజముండె భీషణ
గ్రాహ దురంత దంత పరిఘట్టిత పాదఖురాగ్ర శల్యమై.

భాగవతము 8-67

గజేంద్రుడు వేయి సంవత్సరములు మకరముతో పోరు సల్పినను గెలువజాలక పోయెను. ఇంద్రియార్థములకు లోబడి సంసారమగ్ను డైన జీవుడు తరింప జాలడు. అందులకే శంకరుడు

శ్లో॥ సంసార సాగర విశాల కరాళ కామ
నక్ర గ్రహ గ్రసన నిగ్రహ విగ్రహస్య
మగ్నస్య రాగలస దూర్మి నిపీడితస్య
లక్ష్మీ నృసింహ! మమదేహి కరావలంబమ్

అని ప్రార్థించెను. సంసార సముద్రము నందలి కామమను మొసలిచే పట్టుబడి విషయ చింతనలను అలలచే పీడింపబడు నాకు చేయూత నిమ్మని వేడికొనెను.

పూర్వ పుణ్యవశమున దివ్యజ్ఞాన సంపత్తిగల గజేంద్రుడు మొస లిని పోరున జయింప జాలడని గ్రహించెను. ఆత్మానాత్మ విచారము చేయు వానివలె చింతనముచేయ మొదలిడెను. "ఎవరి ప్రాపు వలన మకరమును జయింప గలను. దశలక్షకోటి సంఖ్యగల ఏనుగులకు నాథుడనైన నేను సుఖముగా నుండక కర్మవశమున నీటికై కాసారమున కేల వచ్చితిని?" అని ఇట్లు పరిపరి విధముల చింతించి "అన్యథా శర ణం నాస్తి త్వమేవ శరణం మమ" అని విశ్వేశ్వరుని శరణువేడెను.

ఉ॥ ఎవ్వనిచే జనించు జగ, మెవ్వని లోపలనుండు లీనమై
ఎవ్వనియందు డిందు, పరమేశ్వరు డెవ్వడు, మూలకారణం
బెవ్వడు, అనాది మధ్యలయు డెవ్వడు. సర్వము దానయైన వా
డెవ్వడు, వాని నాత్మభవు, నీశ్వరు నే శరణంబు వేడెదన్

కావి

క॥ కలడందురు దీనుల యెడ
కలడందురు పరమయోగి గణముల పాలన్
కలడందు రన్ని దిశలను
కలడు కలండనెడి వాడు కలడో? లేడో?

భాగవతము 8-86

వినుదట జీవుల మాటలు,
చనుదట చనరాని చోట్ల, శరణార్థుల కో
యనుదట పిలచిన, సర్వము
గనుదట, సందేహమయ్యె గరుణా వార్ధీ! భాగవతము 8-91

అని సంశయాత్మకు డయ్యెను. ఇంతలో గజేంద్రుని పరిస్థితి విషమించినది.

శా॥ లావొక్కింతయు లేదు, ధైర్యము విలోలంబయ్యె, ప్రాణంబులున్
ఠావుల్ దప్పెను, మూర్ఛవచ్చె, తనువున్ డస్సెన్, శ్రమంబయ్యెడిన్
నీవేతప్ప ఇతః పరంబెరుగ, మన్నింపం గదే దీనుడన్
రావే ఈశ్వర! కావవే వరద! సంరక్షించు భద్రాత్మకా!

భాగవతము 8-90

స్వశక్తి దిగజారినది. అన్యుల సహాయము లభింపలేదు. అన్య చింతన లేక అనన్యమైన భక్తితో భగవంతుని శరణు వేడెను. తుదకు "శరణార్థిని నన్ను గావవే" యని ఆపన్న శరణ్యుడగు శ్రీహరిని వేడుకొనెను.

ఇట్లు మొఱలిడు మత్తేభమును రక్షించుటకై వచ్చు శ్రీహరిని పోతన మత్తేభ పద్యములతో వర్ణించెను. "సంసార చక్రంబును బోలె

ద్వంద్వసంకుల పంక సంకీర్ణంబై" యొప్పు నప్పంకజాకరంబును శ్రీహరి కనుగొని కామ క్రోధన గేహమైన మకరమును చక్రముచే ఖండించెను. కాసారమును సుఖదుఃఖాది ద్వంద్వములు గల సంసారముతోడను, మకరమును కామ క్రోధాదుల చేతను పోల్చుట ఎంత సమంజసముగ నున్నదో పరికింపుడు. అప్పుడు గజేంద్రుడెట్టి సౌందర్యముతో నొప్పెనో చూడుడు.

> తమముం బాసిన రోహిణీ విభుక్రియన్ దర్పించి, సంసార దుఃఖము వీడ్కొన్న విరక్తచిత్తుని గతిం గ్రాహంబు పట్టూడ్చి, పాదము లల్లార్చి, కరేణుకా విభుడు సౌందర్యంబుతో నొప్పె నంభ్రమ దాశాకరిణీ కరోజ్ఝిత సుధాంభ స్స్నాన విశ్రాంతుడై.
>
> భాగవతము 8-115

అజ్ఞానమను మేఘము తొలగి జ్ఞానచంద్రు డగుపించునట్లు సంసార దుఃఖము వీడ్కొన్న విరక్త చిత్తుని సౌందర్యము గజేంద్రుని యందు కాన వచ్చినది. కావున గజేంద్ర మోక్షము జీవునకు కామము తొలగి ముక్తి ప్రాప్తించు కథయని చెప్పవచ్చును.

ఈ కథ వలన గ్రహింపదగినవి:—

(1) "మోక్ష మొసంగిన నీవ ఈవలెన్" అని గోపన్న చెప్పినట్లు సర్వ దేవాత్మకుడైన శ్రీహరియే ముక్తినొసగ సమర్థుడు - త్రిగుణమూర్తులైన అంబుజాసనాది త్రిమూర్తులు విశ్వమయత లేక కాపాడజాలరైరి. త్రిగుణాతీతుడైన భగవంతుడే రక్షింప గలిగెను.

> ఆ॥ విశ్వమయత లేమి వినియు నూరక యుండి
> రంబుజాసనాదు లడ్డపడక
> విశ్వమయుడు విభుడు విష్ణుండు జిష్ణుండు
> భక్తియుతున కడ్డపడ దలంచె
>
> — భాగవతము 8-94

(2) సంశయ రహితుడై శ్రీహరిని శరణు వేడవలయును. ఇంద్రియ బలము తగ్గగా, గజేంద్రుడు మనస్సు నేకాగ్రముచేసి "నీవే తప్ప ఇతః

పరం బెరుగ" నని ధ్యానించెను. "ఇంద్రియంబు లీశ్వర విషయంబు లైన, మది సంచిత నిశ్చల తత్త్వమైనచో సరసిజనాభు కీర్తనమె చాలు విపద్దశలన్ దరింపగన్" అను విదుర మైత్రేయ సంవాదములోని వాక్యము ఇందు వర్తించుచున్నది.

---

# ప్రహ్లాద చరిత్రము చింతన భక్తి
## (నవవిధ భక్తి మార్గము)

శ్రీహరిచేత తన తమ్ముడగు హిరణ్యాక్షుడు నిహతుడు కాగా హరిని నిర్జించుటకై హిరణ్యకశిపుడు బ్రహ్మనుగూర్చి తప మొనరించెను.

క॥ అజరామర భావంబును
త్రిజగద్రాజ్యంబు, నప్రతి ద్వంద్వము, దో
శ్శ్విజితాఖిల శాత్రవమును
గజరిపు బలమును హిరణ్యకశిపుడు గోరెన్

భాగవతము 7–71

ఇట్లు వెయ్యి దివ్య సంవత్సరములు తపము చేసినంత బ్రహ్మదేవుడు ప్రత్యక్షమై కోరిన వరముల నొసగెను. హిరణ్యాక్ష వరము అని లోకమున చెప్పుకొనుట యున్నది కదా!

శా॥ గాలిన్ గుంభిని నగ్ని నంబువుల నాకాశస్థలిన్ దిక్కులన్
రేలన్ ఘస్రములన్ దమః ప్రబల భూరి గ్రహ రక్షో మృగ
వ్యాళాదిత్య నరాది జంతుకలహ వ్యాప్తిన్ సమస్తాస్త్ర శ
స్త్రాళిన్ మృత్యువు లేని జీవనము లోకాధీశ ఇప్పింపవే.

భాగవతము 7–90

ఇట్టి దురలభములైన వరములను పొంది సోదరుని జంపిన కారణమున హిరణ్యకశిపుడు శ్రీహరిపై పగ బూనెను. వర గర్వితుడై

గంధర్వులను, నాగులను, యక్షులను, సిద్ధులను, కిన్నరులను భూత ప్రేత పిశాచములను జయించెను. దిక్పాలుర నోడించెను. ఇంద్రుని సింహాసనము నధిష్ఠించెను.

శా॥ ఏ దిక్పాలుర జూచి నే డలుగునో, ఏ దేవు బంధించునో
యే దిగ్భాగము మీద దాడిచనునో, ఏ ప్రాణులం జంపునో
యీ దైత్యేశ్వరు డంచు నొందొరులు దా రింద్రాదు లాస్థాన భూ
వేదిన్ మెల్లన నిక్కిచూతురు భయా విర్భూత రోమాంచులై.

భాగవతము 7-100

భయభ్రాంతులై దేవతలందరు శ్రీహరిని శరణు వేడిరి. సమయము వచ్చినప్పుడు రక్కసుని చంపెదనని శ్రీహరి అభయ మొసగెను.

ఆ॥ శుద్ధ సాధులందు సురలందు శ్రుతులందు
గోవులందు విప్ర కోటియందు
ధర్మపదవియందు దగిలి నాయందు వా
డెన్న డలుగు నాడె హింస నొందు.

భాగవతము 7-111

హిరణ్యకశిపునకు నలుగురు కుమారు లుద్భవించిరి. అందులో ప్రహ్లాదు డొకడు. మందర పర్వతముపై హిరణ్యకశిపుడు ఘోరతప మాచరించునపుడు ఇంద్రుడు రాక్షసులపై దండెత్తివచ్చి వారలనోడించి హిరణ్యకశిపుని భార్యయగు లీలావతిని చెరగొని పోవుచుండెను. దారిలో నారదు డెదురై "ఈమె గర్భమునందు పరమ భాగవతోత్తము డైన కుమారుడు కలడ"ని తెలుపగా ఇంద్రు డామెను వదలి వేసెను. నారదు డామెను తన ఆశ్రమమున నుంచి ఆమెకు వేదాంతవాక్యములను శ్రీహరి కథావిశేషములను బోధించెను. గర్భస్థుడైన ప్రహ్లాద కుమారుడు వానిని గ్రహించెను. అందువలన ఆ బాలుడు హరిభక్తి పుంభావమైనవాడుగా నుండెను. అతని గుణగణములు పరమ భాగవత శిఖామణి గుణగణముల బోలియుండెను. పోతన యందును ఇట్టి

గుణములే యుండి ఈ క్రింది పద్యమునందు ప్రహ్లాదుని గుణములే కాక పోతన వ్యక్తిత్వముకూడ గోచరించుచున్నది.

సీ॥ తనయందు నఖిల భూతములందు నొకభంగి
సమహితత్వంబున జరుగువాడు,
పెద్దల గనుగొన్న భృత్యుని కైవడి
జేరి నమస్కృతుల్ జేయువాడు
కన్నుదోయికి అన్యకాంత లడ్డంబైన
మాతృ భావమునేసి మరలు వాడు
తల్లిదండ్రుల భంగి ధర్మవత్సలతను
దీనుల గావ జింతించు వాడు

తే॥ సఖులయెడ సోదరస్థితి జరుపువాడు
దైవతము లంచు గురువుల దలచువాడు
లీల లందును బొంకులు లేనివాడు
లలిత మర్యాదుడైన ప్రహ్లాదు డధిప:

భాగవతము 7-110

సీ॥ ఆకారజన్మ విద్యార్థ వరిష్ఠుడై
గర్వ సంస్తంభ సంగతుడు గాడు
వివిధ మహానేక విషయ సంపన్నుడై
పంచేంద్రియములచే పట్టు వడడు
భవ్య వయో బల ప్రాభవో పేతుడై
కామ రోషాదుల గ్రందుకొనడు
కామినీ ప్రముఖ భోగము లెన్ని గలిగిన
వ్యసన సంసక్తి నా వంక బోడు

ఆ॥ విశ్వమందు గన్న విన్న యర్థములందు
వస్తు దృష్టిజేసి వాంఛ యిడడు
ధరణినాథ! దైత్య తనయుండు హరిపర
తంత్రుడై హతాన్యతంత్రు డగుచు

భాగవతము 7-117

సీ॥ శ్రీ వల్లభుడు తన్నుఁజేరిన యప్పుడైన
జెలికాండ్ర నెవ్వరి జేరమఱచు
అసురారి తనమ్రోల ఆడిన యప్పుడైన
నసుర బాలురతోడ నాడ మఱచు
భక్తవత్సలుడు సంభాషించి నప్పుడైన
పరభాషలకు మాఱు బలుక మఱచు
సురవంద్యు తనలోన చూచినయప్పుడైన
జొక్కి సమస్తంబు జూడ మరచు.

తే॥ హరి పదాంభోజయుగ చింతనామృతమున
నంతరంగంబు నిండినప్పుడైన నతడు
నిత్య పరిపూర్ణుడగుచు నన్నియును మఱచి
జడత లేకయు నుండును జడుని భంగి

భాగవతము 7-122

పై విధముగా ప్రహ్లాదుడు భక్తిసమాధిలో నిమగ్నుడగుచుండెను. ఇంకను

శా॥ పానీయంబులు ద్రావుచున్ గుడుచుచున్ భాషించుచున్ హాస లీ
లా నిద్రాదులు సేయుచున్ దిరుగుచున్ లక్షించుచున్ సంతత
శ్రీ నారాయణ పాదపద్మయుగళీ చింతామృతా స్వాద సం
ధానుండై మఱచెన్ సురారిసుతు డేత ద్విశ్వమున్ భూవరా!

భాగవతము 7-123

"అనన్యాశ్చింతయంతో మాం" అను గీతా శ్లోకమును పై పద్యము వివరించుచున్నది.

సీ॥ వైకుంఠ చింతా వివర్జిత చేష్టుడై
యొక్కడు నేడుచు నొక్కచోట
నశ్రాంత హరిభావనా రూఢచిత్తుడై
యుద్ధతుడై పాడు నొక్కచోట

విష్ణు డింతయకాని వేరొండులేదని
యొత్తిలి నగుచుండు నొక్కచోట
నలినాక్షుడను నిధానము గంటి నేనని
యుబ్బి గంతులు వైచు నొక్కచోట.

ఆ॥ బలుకు నొక్కచోట బరమేశు కేశవు,
బ్రణయ హర్షజనిత బాష్ప సలిల
మిళిత పులకుడై నిమీలిత నేత్రుడై
యొక్కచోట నిలచి యూరకుండు.

భాగవతము 7-124

"బాలోన్మత్త పిశాచవత్" అను అవధూతస్థితిని పై పద్యము సూచించుచున్నది.

ఇట్లు సద్గుణ గరిష్ఠుడై ముకుంద సేవాపరాయణుండైన ప్రహ్లాదుని హిరణ్యకశిపుడు చండామార్కులను గురువులవద్దకు విద్యాభ్యాసమునకు పంపెను. వారును రాజనీతి శాస్త్రములను ప్రహ్లాదునిచే చదివించిరి. కాని ప్రహ్లాదు డావిద్యలన్నియు మిథ్యలని భావించెను. చలింపని విష్ణుభక్తి పరిపూర్ణుడై యుండెను.

ఒకనాడు ప్రహ్లాదుని పరీక్షింపగోరి హిరణ్యకశిపు డీతనిని సభకు పిలిపించెను. "నీకు భద్ర మెయ్యది?" అని ప్రశ్నించెను. దానికి ప్రహ్లాద కుమారుడిట్లు బదులు చెప్పెను.

ఉ॥ ఎల్ల శరీరధారులకు నిల్లను చీకటినూతి లోపలన్
ద్రెళ్ళక వీరు నే మను మతిభ్రమణంబున భిన్నులై వ
ర్తిల్లక సర్వమున్ నతని దివ్యకళామయమంచు విష్ణు నం
దుల్లము జేర్చి తా రడవి నుండుటమేలు నిశాచరాగ్రణీ!

భాగవతము 7-142

ఇల్లను చీకటి నూతిలో బడక సర్వము శ్రీహరి లీలయని భావించి విష్ణునియందు మనస్సు నిలిపి అడవియం దుండుట మేలని ప్రహ్లాదుడు వచించెను.

హిరణ్యకశిపుడు తన శత్రువగు విష్ణునిగూర్చి పలుకు ప్రహ్లాద కుమారుని మాటలు వినెను. పరులు నేర్పించినట్లు బాలురు పలుకు చుందురని తలచి "శ్రీహరి దానవుల విరోధి. అతనిని వర్ణింప నీకేల? హరి గిరి యని మోహాంధుడవై చెడకు" మని కొడుకునకు హితము చెప్పెను. కాని ప్రహ్లాదుడు తన చిత్తము హరి పదాయత్త మైనదని, మారజాలదనియు తెలిపెను.

సీ॥ మందార మకరంద మాధుర్యమున దేలు
  మధుపంబు వోవునే మదనములకు
నిర్మల మందాకినీ వీచికల దూగు
  రాయంచ సనునె తరంగిణులకు
లలిత రసాల పల్లవ ఖాదియై చొక్కు
  కోయిల సేరునే కుటజములకు
పూర్ణేందు చంద్రికా స్ఫురిత చకోరక
  మరుగునే సాంద్ర నీహారములకు

తే॥ అంబుజోదర దివ్యపాదార వింద
చింతనామృతపాన విశేష మత్త
చిత్త మేరీతి నితరంబు జేరనేర్చు
వినుత గుణశీల! మాటలు వేయునేల?

భాగవతము 7-150

చండామార్కులు తాము విరోధిపాఠములు చెప్పలేదనియు, ఈ పర్యాయము మరల చక్కగా చదివింతుమనియు చెప్పి ప్రహ్లాదునకు రాజనీతులు బోధించిరి. ఆ బాలుని హిరణ్యకశిపు వద్దకు పరీక్షకై గొని తెచ్చిరి. కాని ప్రహ్లాదునిలో మార్పు రాలేదు.

సీ॥ అడుగడుగునకు మాధవాను చింతన సుధా
  మాధుర్యమున మేను మరచు వాని
నంభోజ గర్భాదు లభ్యసింపగలేని
  హరిభక్తి పుంభావ మైనవాని

మాతృగర్భము సొచ్చి మన్నది మొదలుగా
చిత్త మచ్యుతుమీద జేర్చువాని
నంకించి తనతోన నఖిల ప్రపంచంబు
శ్రీ విష్ణుమయ మని చెలగువాని

తే॥ వినయ కారుణ్య బుద్ధి వివేక లక్ష
ణాది గుణముల కాటపట్టైన వాని
శిష్యు, బుధలోక సంభావ్యు, జీరి గురుడు
ముందటికి ద్రొబ్బి తండ్రికి మ్రొక్కు మనుచు.

భాగవతము 7-160

హిరణ్యకశిపుడు తన పుత్రుని విద్యాబలమును పరీక్షింప నెంచి "నీవు చదివిన శాస్త్రములలోని విషయముల కొన్ని చర్చింపు" మని కోరెను. ప్రహ్లాదుడు నిర్భయుడై తాను "చదువులలో మర్మమెల్ల చదివితి"నని ఇట్లు తెలిపెను.

తను హృద్భూషల సఖ్యమున్, శ్రవణమున్, దాసత్వమున్ వందనా
ర్చనముల్, సేవయు, నాత్మలో నెఱుకయున్ సంకీర్తనల్, చింతనం
బను నీ తొమ్మిది భక్తిమార్గముల సర్వాత్మున్ హరిన్ నమ్మి స
జ్జనుడై యుండుట భద్రమంచు దలతున్ సత్యంబు దైత్యోత్తమా!

భాగవతము 7-167

సీ॥ కమలాక్షు నర్చించు కరములు కరములు
శ్రీనాథు వర్ణించు జిహ్వ జిహ్వ
సురరక్షకుని జూచు చూడ్కులు చూడ్కులు
శేషశాయికి మ్రొక్కు శిరము శిరము
విష్ణు నాకర్ణించు వీనులు వీనులు
మధువైరి దవిలిన మనము మనము
భగవంతు వలగొను పదములు పదములు
పురుషోత్తముని మీది బుద్ధి బుద్ధి.

తే॥ దేవదేవుని జింతించు దినము దినము
చక్రహస్తుని బ్రకటించు చదువు చదువు
కుంభినీధవు జెప్పెడి గురుడు గురుడు
తండ్రి హరి జేరుమనియెడి తండ్రి తండ్రి.

భాగవతము 7-169

ఇంద్రియము లీశ్వర విషయములు కావలెనని భావము. అట్లు ఇంద్రియము లీశ్వర విషయములు కాని ఎడల

సీ॥ కంజాక్షునకుగాని కాయంబు కాయమే
పవన గుంఫిత చర్మ భస్త్రిగాక
వైకుంఠు బొగడని వక్త్రంబు వక్త్రమే
ఢమ ఢమ ధ్వనితోడి ఢక్కగాక
హరి పూజనములేని హస్తంబు హస్తమే
తరుశాఖ నిర్మిత దర్విగాక
కమలేశు జూడని కన్నులు కన్నులే
తనుకుడ్య జాల రంధ్రములు గాక

ఆ॥ చక్రిచింతనలేని జన్మంబు జన్మమే
తరళ సలిల బుద్బుదంబుగాక
విష్ణుభక్తిలేని విబుధుండు విబుధుడే
పాదయుగముతోడ పశువు గాక.

భాగవతము 7-170

పై పద్యమువలన చదువులలోని మర్మమగు భాగవత హృదయము లేక సందేశము వ్యక్తమగుచున్నదని గ్రహింపవలయును. భాగవత ప్రతిపాదిత భక్తిమార్గమునకు ఈ పద్యములు సారభూతములు. ఇంద్రియము లీశ్వర విషయము లొనర్చి మనస్సును నిశ్చలతత్త్వము సేయవలయునని మైత్రేయుడు విదురునకు తెల్పుట ముందు సూచించియుంటిని. ఈ రెంటిని సాధించుమార్గము పై పద్యముల యందు ప్రహ్లాదుడు తెలిపెను.

భక్తిమార్గములు తొమ్మిది.

శ్లో॥ శ్రవణం కీర్తనం విష్ణోః స్మరణం పాదసేవనమ్
అర్చనం వందనం దాస్యం సఖ్య మాత్మ నివేదనమ్

ఈ తొమ్మిదింటిని "తను హృద్భాషల" అనగా మనో వాక్కాయములచేత (త్రికరణ శుద్ధిగా) ఆచరింపవలయునని ప్రహ్లాదుడు వచించెను.

మందాధికారియగు మానవుడు దేహాత్మభావము కలిగియుండును. తమోగుణమువలన అతనికి కామ క్రోధ లోభ మోహ మద మాత్సర్యములను అరిషడ్వర్గము లేర్పడి యుండును. వానివలన ఇంద్రియార్థములను గోరి వానికి దాసుడగును. ఈ బంధము తొలగించుటకు భాగవతము ఇంద్రియముల నవవిధ భక్తిమార్గములచే ఈశ్వరపదము చేయవలయునని చెప్పుచున్నది.

దాసత్వము, వందనము, అర్చనము
సేవ, శ్రవణము } కాయముతోను
సంకీర్తనము వాక్కుతోను
సఖ్యము, స్మరణము, ఆత్మలో
నెఱుక, చింతనము } మనస్సుతోను
చేయవలయును.

పై విధముగా మనోవాక్కాయములతో పంచేంద్రియములకు పనులను గల్పించి పంచేంద్రియముల నీశ్వరపరము చేయవలయునని ప్రహ్లాదుడు సూచించెను. ఇట్లొనర్చి మనస్సును భగవంతునిపై నిలిపినచో, ఇంద్రియ మనోవిగ్రహములు కలుగును. దీనివలన రజస్తమోగుణములు నశించి శుద్ధసత్త్వ మేర్పడును. "సత్త్వాత్ సంజాయతే జ్ఞానమ్" అనుటచే జ్ఞానము కలుగును. దానిచే సత్త్వగుణము ఆవరణముకూడ నశించి ఆత్మసాక్షాత్కార మగును.

ప్రహ్లాదు డనుసరించినది చింతనభక్తి. ఇది ఆత్మానాత్మ విచారమునకు దారితీసి ముక్తిని కలిగించును. అందులకే ప్రహ్లాదు డిట్లనెను. "ముక్తినిధి గానవచ్చునే ముఖ్యమైన శార్ఙ్గకోదండ చింత నాంజనము లేక."

పోతన కూడ ప్రహ్లాదునివలెనే "శ్రీ కైవల్యపదంబు జేరుటకునై చింతించెదన్" అని గ్రంధారంభముననే చింతన పదమును వాడెను. ప్రహ్లాద చరిత్రయందు చింతనపదము అనేక పర్యాయములు వాడబడుట గమనింపదగినది.

1) అడుగడ్డునకు మాధవానుచింతనసుధా మాధుర్యమున మేను మరచువాని
2) చక్రి చింతనలేని జన్మంబు జన్మమే
3) హరి పదాంభోజయుగ చింతనామృతమున
4) సంతత శ్రీనారాయణ పాదపద్మ యుగళీ చింతామృతా స్వాద సంధానుండై
5) వైకుంఠ చింతా వివర్జిత చేష్టుడై
6) కేశవ చింతనామృతాస్వాద కఠోరకున్
7) అంబుజోదర దివ్య పాదారవింద చింతనామృతపాన విశేషమత్త చిత్తము
8) దేవదేవుని చింతించు దినము దినము
9) జిజ్ఞాసా పథమందు మూఢులు కదా చింతింప.

ప్రహ్లాదుడు విష్ణుచింతనమును "పానీయంబులు త్రావుచున్ గుడుచుచున్.........." అనగా సర్వకాల సర్వావస్థలయందు చేయుచుండెను. ఇట్టి చింతనభక్తి చేతనే జీవేశ్వర నిర్ణయజ్ఞుడై, సర్వము విష్ణుమయముగా గ్రహించి "విష్ణు డింతియకాని వేరొండులేదని తెలిసి కొని "ఇందుగల డందులేడను సందేహము"వదలి భాగవతోత్తము డయ్యెను.

త్యాగరాజు మొదట "మరుగేలరా?" అని భగవంతుని గూనక పశ్నించెను. కాని "అన్ని నీవనుచు అంతరంగమున తిన్నగాను వెదకి తెలిసికొంటినయ్యా" అని ప్రహ్లాదునివలె అన్నిటియందును భగవంతుని జూడ గలిగెను.

హిరణ్యకశిపునకు ప్రహ్లాద కుమారుని మాటలు వింతగా తోచినవి. గురువులైన చండామార్కులు ప్రహ్లాదునకు హరిభక్తిని బోధించలేదుకదా? "వీని కెవ్వరు నేర్పి"రని సందేహించి ప్రహ్లాదుని పశ్నించెను. ఈ ప్రశ్నకు బదులుగా ప్రహ్లాదుడు చెప్పిన వాక్యములలో గ్రహింపదగిన విషయములు మూడు కలవు,

1) ఉ॥ అచ్చపు చీకటింబడి గృహవ్రతులై విషయప్రవిష్టులై
చచ్చుచు బుట్టుచున్ మరల చర్వితచర్వణులైనవారికిన్
జెచ్చెర బుట్టునే పరులు సెప్పిననైన నిజేచ్ఛనైన నే
మిచ్చిననైన గానలకు నేగిననైన హరిప్రబోధముల్.

భాగవతము 7-181

అజ్ఞానాంధకారముచే సంసారమున బడి ఇంద్రియార్థముల గోరి జనన మరణ ప్రవాహమున కొట్టుకొని పోవువారికి ఒకరు చెప్పినగాని సొంతముగా కానీ, అడవుల కేగిన గాని, హరి ప్రబోధములు కలుగవు. విషయ ప్రవిష్టు లనుటచే ఇంద్రియ నిగ్రహ మవసరమని సూచింపబడినది.

2) ఉ॥ కానని వాని నూతగొని కానని వాడు విశిష్ట వస్తువుల్
గానని భంగి, గర్మములు గైకొని కొందరు కర్మబద్ధులై
కానరు విష్ణు, గొందఱటు గందు రకించన వైష్ణవాంఘ్రి సం
స్థాన రజోభిషిక్తులగు సంహృత కర్ములు దానవేశ్వరా!

భాగవతము 7-182

ఒక వస్తువును జూడనివానిని వెంబడించినవాడు ఆ వస్తువు నెట్లు చూడజాలడో అట్లే కర్మబద్ధులైన వారల నాశ్రయించినవారు శ్రీహరిని దర్శింపలేరు. కాననివాడు అనుటచే బ్రహ్మ సాక్షాత్కారము

చెందనివాడని అర్థము. నిష్కామకర్మ ఈశ్వరార్పణ బుద్ధితో చేయుచు హరిపదభక్తి గలవారే శ్రీహరిని దర్శింపగలరు.

3) శా॥ శోధింపంబడె సర్వశాస్త్రములు రక్షోనాథ! వేయేటికిన్
గాథల్, మాధవ శేముషీతరణి సాంగత్యంబునన్ గాక దు
ర్భేదన్ దాటగవచ్చునే సుతవధూ మీనోగ్ర వాంఛా మద
క్రోధోర్మ్లోల విశాల సంసృతి మహాఘోరామితాంభోనిధిన్

భాగవతము 7-182

పెక్కు మాటలేల. సర్వశాస్త్రముల సార మేమనగా రజస్తమో గుణ పరిహారిణి యగు భాగవత ప్రతిపాదిత భక్తి యను నావయే సంసార సాగరమునకు తరణోపాయము.

పై మాటలువిని పినతండిని జంపిన శ్రీహరిపై ప్రహ్లాదుడు భక్తి కలిగియుండుటకు హిరణ్యకశిపుడు కోపించి ఆ బాలుని పెక్కు గతుల హింసించెను. కాని ఆ హింసలు ప్రహ్లాదునియందు నిష్ఫలము లయ్యెను.

ఉ॥ తన్ను నిశాచరుల్ పొడువ దైత్యకుమారుడు మాటిమాటికో
పన్నగశాయి! యో దనుజభంజన! యో జగదీశ! యో మహా
పన్న శరణ్య! యో నిఖిలపావన! యంచు నుతించుగాని తా
గన్నుల నీరుదేడు. భయకంప సమేతుడుగాడు భూవరా!

భాగవతము 7-193

ఉ॥ పారడు లేచి దిక్కులకు, బాహువులొడ్డడు, బంధురాజిలో
దూఱడు, ఘోరకృత్యమని దూఱడు, తండ్రిని మిత్రవర్గమున్
జీరడు, మాతృసంఘము వసించు సువర్ణ గృహంబులోనికిన్
దాఱడు, కావరే యనడు, తాపము నొందడు, కంట గింపడున్.

భాగవతము 7-194

"ఇట్లు సర్వాత్మకంబై యిట్టి దట్టిదని నిర్దేశింపరాని పరబ్రహ్మంబు దానయై యమ్మహా విష్ణునియందు జిత్తంబు జేర్చి తన్మయుండయి పర

మానందంబునం బొందియున్న ప్రహ్లాదునియందు రాక్షసేంద్రుండు తన కింకరులచేతం జేయించుచున్న మారణ కర్మంబులు పాపకర్ముని యందు ప్రయుక్తంబులైన సత్కారంబులుం బోలె విఫలంబు లగుటం జూచి" హిరణ్యకశిపున కాశ్చర్యంబు కలిగెను.

— భాగవతము 7-195

ప్రహ్లాదుడు "పరబ్రహ్మంబు తానయై" యున్నవాడు. ఇది "అహం బ్రహ్మాస్మి" అను అద్వైతవాక్యమును సూచించుచున్నది. బ్రహ్మము "ఇట్టిట్ట నరానిది" అనుటచే "ఆశ్చర్యవత్ పశ్యతి కశ్చి దేనమ్" అను భగవద్గీతలోని శ్లోకమును సూచించుచున్నది. అమ్మహా విష్ణునియందు చిత్తంబు జేర్చి యనుటచే "ఆత్మ సంస్థం మనః కృత్వా" అను భగవద్గీత వాక్యము సూచింపబడినది. బ్రహ్మానందము ననుభవించు ప్రహ్లాదుని. రాక్షసుల హింసలు బాధింపలేదు. "నైనం ఛిందంతి శస్త్రాణి నైనం దహతి పావకః" అను గీతావాక్యముచే ఆత్మ హింసకు గురికాదని సూచింపబడినది. ప్రహ్లాదుడు సర్వకాల సర్వావస్థలయందును శ్రీహరి చింతనచేయుటచేత అతడు రక్షింపబడెను. ఈ విషయము గీతలోని "అనన్యాశ్చింతయంతో మా.... యోగక్షేమం వహామ్యహమ్" అను శ్లోకముచే సూచింపబడినది. భగవద్గీత భాగవతములు లక్ష్య లక్షణ గ్రంథములుకదా?

అంతట హిరణ్యకశిపు డిట్లు తలపోసెను.

ఉ॥ ముంచితి వార్ధులన్, గదల మొత్తిది, శైలతటంబులందు ద్రో
బ్బించితి, శస్త్రరాజి బొడిపించితి, మీద నిభేంద్ర పంక్తి త్రొ
ప్పించితి, ధిక్కరించితి, శపించితి. ఘోరదవాగ్నులందు ద్రో
యించితి, బెక్కుపాట్ల నలయించితి, జావ డిదేమి చిత్రమో.

భాగవతము 7-201

"కావున వీడు మహాప్రభావ సంపన్నుండు. వీని కెందును

భయంబు లేదు. వీనితోడి విరోధంబున దనకు మృత్యువు సిద్ధించు" నని హిరణ్యకశిపుడు నిర్ణయించుకొనెను.

తరువాత గురువులు ప్రహ్లాదునకు గృహస్థులైన రాజుల కుప దేశింపదగు ధర్మార్థ కామంబుల నుపదేశించిరి. కాని ప్రహ్లాదుడు రాగ ద్వేషములచే విషయాసక్తులైనవారికి గ్రాహ్యంబులగు ధర్మార్థ కామం బులు తన కగ్రాహ్యంబులని భావించెను. ఇట్లే ఏడు దినములలో ముక్తిని బొందనెంచిన పరీక్షిత్తుకూడ అర్థకామముల సన్యసించెను. పోతనయు నిట్టివాడే. అతడు "శ్రీ కైవల్య పదంబునుగోరి" అర్థ కామముల సన్యసించెను.

ప్రహ్లాదుడు రాజనీతిశాస్త్రముల జదువుటలో తప్పు లేదుకదా యనియు "సదసద్వివేకము గలుగుట"కు విద్య అవసరమనియు ప్రశ్నింపవచ్చును. కాని భాగవత భక్తులు శాస్త్రార్థ చర్చలకుకూడా ప్రాధాన్యత నొసగరు. బ్రహ్మ ద్వితీయస్కంధమున నారదునితో చెప్పినమాటలు గమనింపుడు. "అమ్మహాత్ముని పాదారవిందంబుల భక్తి నిపుడనై యున్నవేళం దెలియుదు, రాజస గుణుండనై యున్న వేళం దెలియజాల గావున శాస్త్రంబుల ప్రవచింపక కేవల భక్తిజ్ఞాన యోగంబున సేవింతు"నని బ్రహ్మ తెలిపెను.

ఈ విషయములో శాస్త్రవాసనను గూర్చి రమణమహర్షి అభి ప్రాయమును గమనింపుడు. "ఊడ్చి పారవేయవలసిన చెత్తను పరీ క్షించుటవలన నెటులు ప్రయోజనము లేదో అట్లే తన్నెఱుంగవలసిన వాడు తన్నుం గప్పియుండు తత్త్వముల నన్నింటిని గుంపుగా జేర్చి త్రోసివేయక, అవి ఇన్నియని లెక్కించుటచేతను వాని గుణంబులను పరీక్షించుటచేతను లాభము లేదు.

భాగవతము మోక్ష గ్రంథము, ముముక్షుత్వము సాధన చతుష్ట

యములతో నొకటి. అందులకే ముముక్షుత్వము గోరిన ప్రహ్లాదుఁ డోడి బాలుర కిట్లు పదేశించెను.

ఆ॥ దీన శుభములేదు, దివ్య కీర్తియులేదు,
జగతి పుట్టి పుట్టి చచ్చి చచ్చి
పొరలనేల మనకు? పుట్టని చావని
త్రోవ వెదకికొనుట దొడ్డ బుద్ధి. —భాగవతము 7-211

"త్రైగుణ్య విషయా వేదాః నిస్త్రైగుణ్యో భవార్జున" అని భగవద్గీతలో చెప్పినట్లు "నిస్త్రైగుణ్యంబునన్ పరమ పురుషుడైన హరికి నాత్మసమర్పణంబు సేయుట మేలని" తెలిపెను.

తే॥ కడగి త్రిగుణాత్మకములైన కర్మములకు
జనకమైవచ్చు అజ్ఞాన సముదయంబు
ఘనతర జ్ఞానవహ్నిచే గాల్చి పుచ్చి
కర్మ విరహితులై హరి గనుటమేలు.

భాగవతము 8-238

తరువాత హిరణ్యకశిపుడు ప్రహ్లాదుని పిలిచి "నే నందరికంటె బలవంతుడనై యందర జయించితిని. నీ వెవ్వని బలమున నిట్లుంటి" వని ప్రశ్నించెను. దానికి ప్రహ్లాదు డిట్లు బదులు చెప్పెను.

క॥ బలయుతులకు దుర్బలులకు
బలమెవ్వఁడు నీకు బ్రహ్మాదులకున్
బలమెవ్వఁడు, ప్రాణులకును
బలమెవ్వం డట్టి విభుఁడు బల మసురేంద్రా!

భాగవతము 7-264

క॥ దిక్కులు గాలముతో నే
దిక్కున లేకుండు, గలుగు దిక్కుల మొదలై
దిక్కుగల లేనివారికి
దిక్కయ్యెడివాఁడు నాకు దిక్కు మహాత్మా!

భాగవతము 7-265

"మార్గము దప్పిన నీ చిత్తమే నీ శత్రువు—

ఉ॥ లోకము లన్నియుం గడియలోన జయించినవాఁడ (1) వింద్రియా
నీకము 2) జిత్తముం గెలువ నేరవు, నిన్ను నిబద్ధు జేయు నీ
భీకర శత్రు లార్వుర బ్రభిన్నుల జేసిన బ్రాణి కోటిలో
నీకు విరోధి లేడొకఁడు నేర్పున జూడుము దానవేశ్వరా!

భాగవతము 7-267

అనగా ఇంద్రియ మనోనిగ్రహములు కర్తవ్యములని తెలిపెను.

"నా సోదరుని జంపిన విష్ణునకై నేను వెదకితిని. నారాయణు డీ విశ్వమున గానరాడు. వాడెక్కడ నుండు"నని హిరణ్యకశిపుడు ప్రశ్నించెను. దానికి ప్రహ్లాదుడు

క॥ ఇందుగల డందు లేడని
సందేహము వలదు చక్రి సర్వోపగతుం
డెందెందు వెదకి జూచిన
నందందే కలడు దానవాగ్రణి వింటే.

భాగవతము 7-275

అని బదులు చెప్పి శ్రీహరి విశ్వాకారుడు సర్వవ్యాపియని తెలిపెను.

భాగవతమున శుకుడు కూడ

క॥ హరిమయము విశ్వమంతయు
హరి విశ్వమయుండు సందియము పని లేదా
హరిమయము గాని ద్రవ్యము
పరిమాణువు లేదు లోకపావన! వింటే?

భాగవతము 2-17

అని పై అభిప్రాయమునే తెలిపెను. దానికి హిరణ్యకశిపుడు "హరి సర్వాకృతుల యందుగల డంటివి. స భా స్తం భ ము న జూప గలవా" యని ప్రశ్నించెను. దానికి ప్రహ్లాదుడు

శా॥ అంభోజాసను డాదిగాగ దృణ పర్యంతంబు విశ్వాత్ముడై
సంభావంబుననుండు బ్రోడ విపుల స్తంభంబునం దుండడే,
స్తంభాంతర్గతు డయ్యు నుండుటకు నే సందేహమున్ లేదు వి
ద్దంభత్వంబున నేడు గానబడు బ్రత్యక్ష స్వరూపంబునన్.

భాగవతము 7-282

హిరణ్యకశిపుడు స్తంభము నరచేతితో గొట్టెను. స్తంభమునుండి భీకరాకారుడై శ్రీ నరసింహమూర్తి ఆవిర్భవించెను. స్వామి ఆవిర్భావమును గూర్చి వ్రాయునపుడు పోతన రచించిన వచనములో 32 భాగము లున్నవి. శ్రీ నృసింహ అనుష్టుప్ మంత్రరాజమునకు 32 అక్షరము లుండుట గమనింపదగినది. హిరణ్యకశిపుడు నరసింహునిచే చూపబడెను. బ్రహ్మాదులు శ్రీ నృసింహమూర్తిని స్తుతించిరి. కాని రోష విజృంభమాణుడగు నరసింహుని జేరవెఱచి అతనిని శాంతింప జేయుటకై లక్ష్మీదేవిని బంపిరి. ఆమెయు భీకరాకారముజూచి చేరుటకు భయమందెను.

సీ॥ ప్రళయార్క బింబంబు పగిది నున్నదిగాని,
నెమ్మోము పూర్ణేందు విభముగాదు
శిఖి శిఖాసంఘంబు చెలువు సూపెడు గాని
చూడ్కి ప్రసాద భాసురము గాదు
వీర రౌద్రాద్భుతా వేశ మొప్పెడు గాని
భూరి కృపారస స్ఫూర్తిగాదు
భయద దంష్ట్రాంకుర ప్రభలు గప్పెడుగాని
దర హసితాంబు జాతంబు గాదు

తే॥ కఠినఖర నారసింహ విగ్రహము గాని
కామినీజన సులభ విగ్రహము గాదు
విన్నదియుగాదు తొల్లి నే విష్ణువలన
గన్నదియుగాదు భీషణాకార మనుచు.

భాగవతము 7-342

భావించి లక్ష్మీదేవి దూరముగా నుండెను.

తరువాత బ్రహ్మ భక్తాగ్రేసరుడైన ప్రహ్లాదుని జీరి "నీవైన స్వామి కోపమును బాపు" మనెను. ప్రహ్లాదకుమారుడు శ్రీ నృసింహ దేవునకు భక్తితో దండ ప్రణామము లాచరించెను. భక్తవత్సలుడైన నరసింహమూర్తి శాంతించి బాలకుని తలపై తన హస్తముంచి ఆశీర్వదించెను. ప్రహ్లాదు డిట్లు పలికెను.

మ॥ ఖరదంష్ట్రా భృకుటీ సటా నఖయు, నుగ్రధ్వానయున్ రక్తకే
సరయున్, దీర్ఘతరాంత్ర మాలికయు, భాస్వన్నేత్రయున్నైన నీ
నరసింహాకృతి జూచి నే వెఱవ, బూర్ణ క్రూర దుర్వార దు
ర్భర సంసార దవాగ్నికిన్ వెఱతు, నీ పాదాశ్రయుం జేయవే.

భాగవతము 7-355

భక్తిలేక భవదీయ జ్ఞానంబులేదు. భవదీయ దాస్యయోగంబు గలిగింపుమని వేడెను. "అట్ల యగుగాక" యని నరసింహమూర్తి ఆశీర్వదించి పూర్ణముగా శాంతించెను.

పై కథతోపాటు హిరణ్యాక్ష హిరణ్యకశిపులు పుట్టుటకు కారణమునుగూడ విచారించవలయును. బ్రహ్మ మానస పుత్రులైన సనక సనందనాదులు విష్ణు సందర్శనమునకై వైకుంఠమున కేగిరి. ద్వారపాలకులైన జయ విజయులు వారి నడ్డగించిరి. సనక సనందనాదులు వారిపై కోపించి రజస్తమో గుణయుతులైన అసుర రాక్షసయోనుల బుట్టుడని శపించిరి. జయవిజయులు శాపవశమున దితిగర్భమునందు హిరణ్యకశిప హిరణ్యాక్షులుగను, కైకసియందు రావణ కుంభకర్ణులుగను జనించిరి. మూడవ జన్మలో వారే శిశుపాల దంతవక్త్రులుగ పుట్టిరి. తమో రజోగుణములుగల వీరి లక్షణములు భగవద్గీతయందు చక్కగా వివరింపబడినవి.

శ్లో॥ రజోరాగాత్మకం విద్ధి తృష్ణా సంగ సముద్భవమ్
తన్నిబధ్నాతి కౌంతేయ కర్మ సంగేన దేహినమ్.

ప్రాపంచిక విషయాసక్తి, కోరికలు, అభిమానము కలవారు రజోగుణయుతులు. హిరణ్యకశిపుడు, రావణుడు, శిశుపాలుడు ఇట్టివారు.

శ్లో॥ తమ స్త్వజ్ఞానజం విద్ధి మోహనం సర్వ దేహినామ్
ప్రమాదాలస్య నిద్రాభి స్త న్ని బధ్నాతి భారత॥

ప్రమాదము సోమరితనము నిద్ర కలవారు తమోగుణము కలవారు. హిరణ్యాక్షుడు, కుంభకర్ణుడు, దంతవక్త్రుడు ఇట్టివారు.

తమోగుణమువలన రాక్షసులు రజోగుణమువలన అసురులు కలిగిరని భాగవతము తెలుపుచున్నది. రజస్తమోగుణ పరిహారిణి యగు భక్తి లభించెనని నారదుడు తెలిపెను. అనగా ఇంద్రియ మనస్సులను జయించి రజస్తమో గుణములను బాసిన శుద్ధ సత్వమేర్పడి జ్ఞానము లభించును. మందాధికారి ఇంద్రియముల నీశ్వరపరము జేసి దైవసామీప్యమును, మధ్యమాధికారి మనోవిక్షేపమును తొలగించి సారూప్యమును, ఉత్తమాధికారి ఆవరణమును తొలగించి సాయుజ్యమును పొందుదురు.

ఇది గాక,

క॥ వైరాను బంధనంబున
జేరిన చందమున విష్ణు చిరతర భక్తిన్
జేరగరాదని తోచును
నారాయణ భక్తి యుక్తి నాచిత్తమునన్

భాగవతము 7-15

క॥ కీటకము దెచ్చి భ్రమరము
పాటవమున బ్రభమింప భ్రాంతంబై త
త్కీటకము భ్రమరరూపము
బాటించి వహించుగాదె భయయోగమునన్

భాగవతము 7-16

శిశుపాల దంతవక్త్రులు పాయని మహావైరముతో "నిత్యజాత క్రోధ స్మరణంబుల"చేత హరియందు మనస్సు నిలిపి "చక్రిం జెందిరి వారు పార్శ్వచరులై సారూప్య భావంబునన్". భయయోగమున జింతించినను సారూప్యము జెందుదురని భాగవతము తెలుపుచున్నది.

ప్రహ్లాదచరిత్ర భాగవతమునకంతకు సారభూతమైనది. ఇందులో తెలిసికొనదగిన విషయములు.

1) నవవిధ భక్తిమార్గముల నవలంబించి త్రికరణ శుద్ధిగా భగవంతుని ఆరాధించి ఇంద్రియముల నీశ్వరపరముజేసి మనస్సును లయింప జేయవలయును.

2) వైరముచే భయయోగమునను భగవంతుని పొందవచ్చును.

3) శ్రీనరసింహస్వామిని శాంతింపజేయుటకు లక్ష్మీదేవి వెనుకాడెను. కాని, ప్రహ్లాదుడు స్వామిని జేరి శాంతింపజేసెను. కాబట్టి భగవంతుని జేరుటకు భక్తియే సాధనము.

మ॥ జ్వలదాకారము జూచి చేర సిరియున్ శంకింప బ్రహ్మాది ది
వ్యులు ప్రహ్లాదుని జేరబంపిన శరత్పూర్ణేందు సంకాశ శీ
తలతన్ బొందితి భక్తవత్సలుడవై: త్వత్పాద సద్భక్తియే
సులభోపాయము నిన్నుబొంద ననవచ్చున్ శ్రీ నృసింహేశ్వరా!

— సువర్ణమాల

4) కేవల కర్మనిష్ఠులు మోక్షము పొందజాలరు.

5) సంసార సాగరమును తరించుటకు శ్రీహరి పదభక్తియే నావయగును.

6) ఇక్కడ ఒక రహస్యమున్నది. పరీక్షిత్తు శాపగ్రస్తుడై 7వ దిన మునాడు తక్షకుని విషమునకు గురియై మరణించెను కదా? కాని భాగవతమేమి చెప్పుచున్నదో చూడుడు.

శ్లో॥ దశతం తక్షకం పాదే - లేలిహానం విషాననైః
నద్రక్ష్యసి శరీరంచ - విశ్వంచ పృథగాత్మనః

తక్షకుడను సర్పము బ్రాహ్మణ శాపబలమున వచ్చి పరీక్షిత్తును కరచినప్పటికిని అతడు చావడు." ఇట్టిట్టనరాని బ్రహ్మంబు" తానైన ప్రహ్లాదునికి రాక్షసులు పెట్టిన హింసలు బాధింపజాలనట్లే సప్త భూమి కలదాటి బ్రాహ్మభూతుడైన పరీక్షిత్తును పాముకాటు ఏమి చేయగలదు ఆత్మకు మరణము మెక్కడిది ? ఆత్మకు మరణము లేదు. పరీక్షిత్తు ముక్తిని గాంచెనని భావము.

శ్రీ రమణమహర్షి కి కూడ చిన్ననసమునసే తాను మరణించి నట్లు తోచినది. అవయవములు కదలలేదు. రక్తము నీలివర్ణము చెందినది. తాను మరణించెననియు, తన దేహము కట్టెలలో ఉంచి దహింతురనియు, తోచినది. ఇంతలోనే ఆయనకు ఒక భావము స్ఫురించినది. ఏమనగా తన దేహము మరణించినదిగాని తాను ఉన్నాను కదా? అని తోచినది తాను వేరు దేహము వేరనియు తనకు మృత్యువు లేదనియు నిర్ణయించుకొన గలిగెను.

# 19 అంబరీషోపాఖ్యానము

## బ్రాహ్మణ శాపము రిత్త పోవుట :-

భాగవత నవమ స్కంధమున అంబరీషోపాఖ్యానము కలదు. మహాభక్తుడైన అంబరీషునియెడ "జగదప్రతిహతంబైన బ్రాహ్మణ శాపము" నిరర్థక మయ్యెను. అట్లే బ్రాహ్మణుడైన అశ్వత్థామచే ప్రయోగింపబడిన "ప్రతిక్రియా రహిత బ్రహ్మశిరో నామకాస్త్రము"ను శ్రీకృష్ణుడు సుదర్శనముచే ప్రతిఘటించెను. ఇదిగాక దక్షాధ్వర ధ్వంస మొనరింపుమని శివుడు వీరభద్రుని బంపెను. యజ్ఞమున నున్న బ్రాహ్మణశక్తిని జయించుట వీలుకాదేమోనని వీరభద్రుడు శంకించెను. అప్పుడు శివు డిట్లు తెలిపెను.

"బ్రాహ్మణ తేజ మజేయమంటివే. నరిది మదంశ సంభవుడ వైతగు నీకు నసాధ్యమెయ్యెడన్" దైవశక్తి ముందు బ్రాహ్మణతేజము నిరర్థక మని పై మూడు నిదర్శనములు సూచించుచున్నవి. రజస్తమో గుణముల తొలగించుకొని శుద్ధసత్త్వము గలవాడు బ్రాహ్మణుడు, కానీ పరబ్రహ్మము త్రిగుణాతీతుడు. కావున బ్రాహ్మణతేజము పరబ్రహ్మ శక్తిని మించజాలదని భావము.

సప్త ద్వీప విశాల భూభారము వహించిన అంబరీషమహారాజు వైష్ణవార్చనలతో కాలము బుచ్చెడివాడు. అతడు సద్గుణ గరిష్ఠుడు.

సీ॥ చిత్తంబు మధురిపు శ్రీ పాదముల యంద
పలుకులు హరిగుణ పఠనమంద
కరములు విష్ణు మందిర మార్జనము లంద
శ్రవములు హరికథా శ్రవణ మంద
చూపులు గోవిందరూప వీక్షణ మంద
కామంబు చక్రి కైంకర్య మంద

తే॥ సంగ మచ్యుతజనత సంగ మంద
ఘ్రాణ మసురారి భక్తాంఘ్రి కమల మంద
రసన తులసీ దళములంద, రతులు పుణ్య
సంగతుల యంద యా రాజచంద్రమునకు

భాగవతము 9-82

క॥ హరి యని సంభావించును
హరి యని దర్శించు నంటు నా ఘ్రాణించున్
హరి యని రుచి గొనదలచును
హరి హరి యను నంబరీషు నలవియె పొగడన్.

భాగవతము 9-86

పై విధముగ అంబరీషుని పంచేంద్రియము లీశ్వరపరము లయ్యెను. అంబరీషుడు సమలోష్టకాంచనుడై సర్వకర్మలు హరిపరంబు చేసి ధరణినేలిన పుణ్యచిత్తుడు. ఈశ్వరాయత్తుడగు మహాభాగవతుడు. నిష్కాముడు.

అంబరీషుడు నిష్ఠతో ఏకాదశీవ్రత మాచరించెను. గోదానము అన్నదానము చేసెను. ద్వాదశినాడు అతనికడకు దుర్వాసు డతిథియై ఏతెంచెను. ఆ ముని కాళిందీ జలముల ధ్యానమగ్నుడై ద్వాదశి ఘడియలు మించిపోవుచున్నను రాడాయెను. అంబరీషుడు ద్వాదశి ఘడియలు మించకయే పారణ చేయవలయునని చింతించి విద్వజ్జనుల నిట్లు ప్రశ్నించెను. "అతిథియగు దుర్వాసుడు ద్వాదశి ఘడియలు మించి పోవుచున్నను రాలేదు. కాని పారణసేయుట ఎట్లు"ని ధర్మపథమును తెలుపగోరెను. వారు ఆలోచించి ఇట్లు నిర్ణయించిరి.

ఆ॥ అతిథివోయి రామి నధిప! ఈ ద్వాదశి
పారణంబు మాన పాడిగాదు
గుడువకుంట గాదు, గుడుచుటయును గాదు
సలిల భక్షణంబు సమ్మతంబు.

భాగవతము 9-99

విద్వజ్జను లిట్లు ధర్మ సందేహంబు బాపినంత, అంబరీషుడు హరిని దలచి నీరు పారణంబు చేసెను. ఇంతలో దుర్వాసు డరుదెంచి రాజౌనర్చినది, విని దానిని అకృత్యముగా భావించి, తాను కోపించిన మన్నింపగల వారెవ్వరని గర్వించి, తన జడను బెఱికి, కృత్యను సృష్టించి అంబరీషునిపై బంపెను. అంతట విశ్వరూపుడగు శ్రీహరి "వెఱ్ఱి తపసి సేయు వేడబంబు జక్కబెట్టు మనుచు" సుదర్శన చక్ర మును బంపెను. విష్ణుచక్రము, ముని సృష్టించిన కృత్యను దహించి ముని వెంటబడెను. చక్రానల జ్వాలల కోర్వలేక ముని మూడు లోక ముల పరుగిడెను. బ్రహ్మగాని శివుడుగాని అతనిని కాపాడజాలరైరి. తుదకతడు శ్రీ విష్ణువునే శరణు వేడెను. "సాధువులైన భక్తుల నెది రించువారికి ఇతర రక్షణలేదు ఆ మహాభాగుడగు అంబరీషు డిచ్చు గక్షయే నీ కభయమగు"నని శ్రీహరి తెలిపెను. దుర్వాసు డంబరీషుని కడకేగి అతని పాదముల బట్టికొని అభయము కోరెను. అంబరీషుడు సుదర్శనచక్రమును ప్రార్థింప

ఆ॥ విహిత ధర్మమందు విహరింతు నేనిని
విష్టమైన ద్రవ్య మిత్తునేని
ధరణిసురుడు మాకు దైవతం బగునేని
విప్రునకు శుభంబు వెలయు గాక.

భాగవతము 9-137

అని వేడగా చక్రము శాంతించి తిరిగి వెడలెను. అంబరీషు డంత ముని పాదములకు నమస్కరించి అతనిని మృష్టాన్నముల తృప్తునిజేసి పంపెను.

1) తిరుగులేని బ్రాహ్మణశాపముకూడ భక్తులఎడ నిరర్థక మగును. దురంతంబైన బ్రహ్మదండంబు దుర్వాసునిచే ప్రయోగింపబడినను భక్తుడైన అంబరీషుడు రక్షింపబడెను.

2) ఆత్యంతిక భక్తుడైన అంబరీషుడు తనపై ప్రయోగింపబడిన కృత్యను గాంచి నిస్సహాయుడైనను చలింపకుండెను.

3) "తనువు మనవు విడచి తనయుల జుట్టాల, నాలి విడచి సంప దాశి విడచి, పంచేంద్రియముల తెరవులు వంచించి" మనమున శ్రీహరిని బ్రతిష్ఠించిన భక్తుడు రక్షింపబడును. అనగా ఇంద్రియ మనంబు లీశ్వరపరము జేయవలయును.

4) "చంపదగిన యట్టి శత్రువు తన చేత
జిక్కెనేని కీడు నేయరాదు

అన్నట్లు తనపై కృత్యను ప్రయోగించి చంపజూచిన దుర్వాసునిగూడ క్షమింపజాలు సాత్త్వికలక్షణము హరిభక్తులయెడ గమనింపదగినది.

# 20 బ్రహ్మ శ్రీకృష్ణుని పరీక్షించి పరమాత్మగా తెలిసికొనుట

బ్రహ్మదేవుడు శ్రీకృష్ణుని విచిత్రమైన లీలలు విని, అతనిని పరీక్షింపదలచెను. గోవులను, గోపకులను మాయచేసి ఒక గుహలో దాచియుంచెను. శ్రీకృష్ణుడిది బ్రహ్మచేసిన పనిగా గ్రహించి గోవుల గోపకుల రూపములను తానే పొంది ఒక సంవత్సరము విహరించెను. ఋషుల అంశమున గోవులు పుట్టెననియు, దేవతల అంశమున గోపకులు జన్మించిరనియు బలదేవునకు ముందుగనే తెలియును. కాని ఇప్పుడు గోవులందును గోపకులందును అతనికి శ్రీకృష్ణుడే అగుపించుచుండెను. ఈ సందేహము శ్రీకృష్ణునకు దెలుపగా అతడు బ్రహ్మ చేసిన పరీక్ష బలదేవునకు దెలిపెను.

ఒక సంవత్సరము గడచిన తరువాత బ్రహ్మ తిరిగివచ్చి తాను గుహయందు దాచిన గోవులు గోపకులు సుప్తులై యుండుట తిలకించెను. కాని, మందలో ఆ రూపములేగల గోవులు గోపకు లుండుటజూచి ఆశ్చర్య చకితుడయ్యెను. సృష్టికర్తయైన తానుగాక వేరొక సృష్టి యొనర్చు బ్రహ్మ ఎక్కడనుండి వచ్చెనని ఆలోచింప దొడగెను.

శ్రీకృష్ణుడిదిగాంచి తన మాయను ఉపసంహరించెను. బ్రహ్మ శ్రీకృష్ణుని మాహాత్మ్యమును గుర్తించి తాను రజోగుణసంభవుడనియు, మూఢుడనియు విన్నవించి క్షమింపుమని వేడెను.

పై కథవలన శ్రీకృష్ణుడు మానవ మాత్రుడు కాదు, లీలా మానుష విగ్రహుడైన పరబ్రహ్మమూర్తి యని తెలియుచున్నది.

# 21 గోపికా వస్త్రాపహరణము

## (దేహాత్మ భావనము)

శ్రీకృష్ణుని సేవించుటకై దేవతలు ఋషులు గోపులు గోపికలై పుట్టిరి. ఒకప్పుడు కాత్యాయనీ వ్రతనిష్ఠలై గోపికలు వివస్త్రలై స్నానము చేయుచుండిరి. ఇది వ్రతభంగ కారణ మగుటచేత కృష్ణుడు వారిని మందలింపదలచి వారి వస్త్రములను దొంగలించి నీపవృక్షముపై గూర్చుండెను. గోపికలు శ్రీకృష్ణుని చీర లిమ్మని వేడుకొనిరి. వారు శ్రీకృష్ణుడు మానవమాత్రుడు కాదనియు పరబ్రహ్మమనియు, లీలా మానుష విగ్రహుండనియు ఎఱుగుదురు. శ్రీకృష్ణుని బాల్యక్రీడలు వర్ణించుచు అత డొనర్చిన త్రిగుణాత్మకమైన సృష్టిని గోప్యముగా వర్ణించిరి. శ్రీకృష్ణుడు వారిముందు కనులుదెరచిన పసికందు కదా.

సీ॥ "రాజసంబున" నీవు రంజిల్లు టెఱుగమే
చెలరేగి వింతలు సేయుచుండ
"సత్వ సంపద" గల్గి జరగుట దలపమే
సిరిగల్గి యన్నల జెనకుచుండ
గురుతర శక్తియుక్తుడ వౌట ఎఱుగమే
"తామసంబున" నెగ్గు దలచుచుండ
ఒక భంగితో నుండకుంట జింతింపమే
"మాయా"వివై మాఱు మలయుచుండ

ఆ॥ ఏమి జాడవాడ? వేపాటి గలవాడ?
వే గుణంబు నెఱుగ వెల్ల యెడల
నొదిగి యుండనేర వోరంత ప్రొద్దును
బటము లీగదయ్య! పద్మనయన! భాగవతము 10-822

భగవంతుడు సత్త్వరజస్తమో గుణములను త్రిగుణములచే గూడిన మాయచేత సృష్టియొనర్చెననియు, శ్రీకృష్ణుని బాల్యచేష్టలు గోపికలకు

కొత్తవి కావనియు రెండర్థములు స్ఫురించునట్లు పద్యము వ్రాయబడినది.

సీ॥ బహు జీవనముతోడ భాసిల్లి యుండుటో
గోత్రంబు నిల్పుటో గూర్మితోడ
మహి నుద్ధరించుటో, మనుజ సింహంబవై
ప్రజల గాచుటో, గాక బలిదెరల్చి
పిన్నవై యుండియు బెంపు వహించుటో
రాజుల గెల్చుటో రణములందు
గురునాజ్ఞ సేయుటో, గుణనిధివై బల
ప్రఖ్యాతి జూపుటో భద్రలీల.

ఆ॥ బుధులు మెచ్చ భువి ప్రబుద్ధత మెఱయుటో
కల్కితనము సేయ ఘనత గలదె?
వావి లేదు వారి వారు నావారను
నెఱుక వలదె? వలువ లిమ్ము కృష్ణ!

భాగవతము 10-820

పై పద్యములో శ్రీకృష్ణుని దశావతారములు ధ్వనించుచున్నవి. చీర లెత్తికొనిపోవుట తగదని గోపికలు సూచించిరి.

శ్రీకృష్ణుడు దేహాత్మభావముగల గోపికలకు అట్టి భావమును తొలగింప దలచెను. దిగంబరులైన గోపికలను నీటినుండి వెలువడి తనకు చేతులెత్తి నమస్కరించినగాని చీరల నివ్వనని తెలిపెను.

సీ॥ శృంగారవతులార! సిగ్గేల మిముగూడి
పిన్ననాటనుగోలె బెరిగినాడ.
నెఱుగనే మీలోన నెప్పుడు నున్నాడ
నేను జూడని మర్మ మెద్దిగలదు.
వ్రతనిష్ఠలై యుండి వలువలు గట్టక
నీరు సొత్తురె మీరు నియతి దప్పి

కాత్యాయనీదేవి కల్ల సేయుటగాక
యీరీతి నోచువా రెందు గలరు?

ఆ॥ వ్రతఫలంబు మీరు వలచిన ఠక్కాగ
నింతులెల్ల చేతులెత్తి మ్రొక్కి
చేరి పుచ్చుకొనుడు చీరల సిగ్గువో
నాడనేల? ఎగ్గు లాడనేల? భాగవతము 10-840

ఆత్మరూపుడై శ్రీకృష్ణుడు గోపికలయం దుండెను. పిన్న నాటనుండి వారిలో కలిసియుండెను. అతనికి తెలియని మర్మము లేమి కలవు? సిగ్గుపడ నేల? అందువలన గోపికలను నీటినుండి బయటికి రమ్మనెను. పరమాత్మయగు శ్రీకృష్ణుడు గోపికల ఆత్మ కంటె భిన్నము కాదుకదా?

"ఏ దేవత నారాధించినను తుదకు ఫలము నిచ్చువాడు తానే" నని శ్రీకృష్ణుడు భగవద్గీతలో తెలిపెను.

శ్లో॥ యో యో యాం యాం తనుం భక్తః శ్రద్ధయార్చితు మిచ్ఛతి
తస్య తస్యాచలాం శ్రద్ధాం తామేవ విదధా మ్యహమ్॥

ఏ మూర్తియం దెవరికి శ్రద్ధ కలిగియుండునో ఆ మూర్తియందే ఆతనికి చలింపని శ్రద్ధ నేనే కలుగజేయుచున్నాను.

శ్లో॥ సతయా శ్రద్ధయా యుక్తస్త స్యారాధన మీహతే
లభతేచ తతః కామాన్ మయైవ విహితాన్ హితాన్॥

అట్టి దేవతాభక్తుడు నాచే నొసంగబడిన శ్రద్ధతో ఆ దేవతనే పూజింపగోరును. నేనా దేవతలమూలముగా వానికిష్టములైన కోర్కెల నిచ్చుచున్నాను. ఇతర దేవతల నారాధించినను ఫలమిచ్చువాడను నేనే కదా?

కాత్యాయనీ వ్రతఫలము దక్కవలె నన్న గోపికలు సిగ్గువిడిచి చేతులెత్తి శ్రీకృష్ణునకు నమస్కరించవలెను. "వ్రతముల్ సేయుచు

నొక్కమాటయిన నెవ్వానిన్ విచారించినన్ వ్రతభంగంబులు మానుప" (భాగవతము 10-842) జాలునట్టి వరదుడైన శ్రీకృష్ణుడు చేలముల వీడి స్నానమాడుటచే వ్రతభంగ మగుటచేత దానిని మాన్పుటకై పర మాత్మయై గోపికలయం దాత్మరూపుడుగా నున్న తనకు మ్రొక్కుమని కోరెను.

తరువాత గోపికలు శ్రీకృష్ణుని పరమాత్మగా గుర్తించి గోపికా గీతలలో నిట్లు స్తుతించిరి.

ఉ॥ నీవు యశోద బిడ్డడవె? నీరజనేత్ర సమస్త జంతుచే
తోవిదితాత్మ వీశుడవు తొల్లి విరించి దలంచి లోక ర
క్షావిధ మాచరింపుమని సన్నుతి సేయగ సత్కులంబునన్
భూవలయంబు గావ విటు బుట్టితిగాదె మనోహరా కృతిన్.

— భాగవతము 10-1039

# 22. రుక్మిణీ కల్యాణము

## పాతివ్రత్యము :-

భగవద్భక్తురాలికిని పతివ్రతకును చక్కని సామ్య మున్నది. గోపికలు కామోత్కంఠత, ఉద్దామ ధ్యాన గరిష్ఠులై శ్రీహరిని పొంద గలిగినట్లే, పతినే ప్రత్యక్ష దైవముగా భావించి పతివ్రత తత్సేవా నిమగ్నురాలై తరింపవచ్చునని రుక్మిణీ కల్యాణకథ సూచించుచున్నది

విదర్భదేశమునకు రాజైన భీష్మక మహారాజునకు ఐదుగురు పుత్రులు. వారి కడగొట్టు చెల్లెలు రుక్మిణీదేవి ఆమె శ్రీకృష్ణుని రూపబల గుణాదులను తన తండ్రికడ కేతెంచు అతిథులవలన విని, శ్రీకృష్ణునియందు బద్ధానురాగయై యుండెను. కాని రుక్మి అను అన్న ఆమెను శిశుపాలున కిచ్చుట కుద్యుక్తుడయ్యెను. క్రూరుడైన రుక్మి నెదురించుటకు తల్లిదండ్రులుకూడ వెనుకాడిరి. అందువలన రుక్మిణీ దేవి అగ్నిద్యోతనుడను బ్రాహ్మణుని ద్వారా తన ప్రేమను శ్రీకృష్ణు నకు సందేశరూపమున విన్నవించుకొనెను. "ఈశ్వరాదులు కూడ ఆత్మీయ తమోనివృత్తి కొఱకు నీ పాదతోయముల మునుగ వాంఛింతురు. అట్టి నీ కరుణకు నేను పాత్రురాలు కావలెనని" సందేశ మంపెను.

తమోనివృత్తి అనగా అజ్ఞానాంధకారము తొలగించుట అనిగాక తమోగుణనివృత్తి అని అర్థము చెప్పినచో అనుకూలముగా నుండును. తమోగుణమువలన ఇంద్రియము లేర్పడినను ఇంద్రియములను ఈశ్వర విషయములచేసి వానిని జయింపవలయును. రుక్మిణీదేవి ఆ విధముగ చేయ ప్రయత్నించినదని ముందు తెలియవచ్చును.

మ॥ ఘను లాత్మీయ తమోనివృత్తికొఱకై, గౌరీశు మర్యాద, నె
వ్వని పాదాంబుజ తోయమందు మునుగన్ వాంఛింతు, రేనట్టి నీ

యనుకంపన్ విలసింపనేని, వ్రతచర్యన్ నూరు జన్మంబులన్
నిను జింతించుచు ప్రాణముల్ విడిచెదన్, నిక్కంబు ప్రాణేశ్వరా!
భాగవతము 10-1708

విష్ణుపాదోద్భవమైన గంగయందు మునుగగా ఆత్మయ తమో నివృత్తి కలుగును. అనగా తమోగుణము నశించును. ఇట్టి తమో నివృత్తికొఱకు రుక్మిణీదేవి ప్రార్థించినది. "అగ్ని ముఖా వై దేవాః" అనుటచేత హవిస్సును వ్రేల్చి యజ్ఞయాగాదుల నొనర్చి అగ్నిదేవుని ద్వారా దేవతలను తృప్తి పరచునట్లు, రుక్మిణీదేవి మనోయజ్ఞమొనర్చి అగ్నిద్యోతను డను బ్రాహ్మణుని ద్వారా శ్రీకృష్ణునకు సందేశమంపి ఆత్మార్పణము చేసికొన్నదని చెప్పవచ్చును. భగవంతుడను అగ్ని యందు అహంకారమను సమిధను వేల్చుటయే మనోయజ్ఞమని అవ్యక్తోపనిషత్తున చెప్పబడినదని ముందుగ తెలిపియుంటిని.

విష్ణుపురాణములో పతియే ప్రత్యక్షదైవమనియు, స్త్రీలకు పతి సేవ దక్క ఉపవాసములు పూజలు వ్రతములు అవసరము లేదనియు చెప్పబడినది. పతిభక్తియే ఐహికాముష్మిక సుఖములను ముక్తిని కలిగించుచున్నది. హిందూధర్మమున పాతివ్రత్యమునకు అగ్రస్థాన మివ్వబడినది.

మ॥ మృతుడౌ భర్తకు జీవమియ్య జమునిన్ మెప్పించె నొక్కర్తె, తా
పతిసేవా నిరతిన్ త్రిమూర్తులను పాపల్గాగ నాడించె నొ
క్కతె, సూర్యోదయ మాపె వేరొకతె

— శ్రీసతీ శతకము

సావిత్రి యమధర్మరాజును మెప్పించి మగనిని బ్రతికించు కొనెను. అనసూయ త్రిమూర్తులను పాపలజేసి యాడించెను. నర్మద తన భర్తపై మార్కండేయుని శాపము వర్తింప కుండుటకై సూర్యోదయమునే ఆప గల్గెను. ఇట్లు అనేక మాహాత్మ్యములను పతివ్రతలు

చూపగల్గిరి.

ఇచట ఒక సందేహము కలుగవచ్చును. పరమ పురుషుడైన శ్రీకృష్ణుని భర్తగా కోటి గోపికలు, రుక్మిణి, రాధా మొదలగువారు తరించి యుండవచ్చును. కాని సామాన్యపురుషుడైన భర్తను పరమ పురుషుడైన భగవంతునిగా భావించుట తగునా? యని ప్రశ్నింప వచ్చును.

మానవునకు ఇంద్రియములు స్థూలదేహము తమోగుణము నేర్ప డెను. అత డింద్రియార్థములకు దాసు డగును. కామ క్రోధాదులు ప్రకోపించును. కాన తమోగుణమును ఇంద్రియములను జయించుటకై నవవిధ భక్తిమార్గములచే భగవంతుని సేవించి ఇంద్రియముల నీశర్వ పరము జేయుమని భాగవతము సూచించుచున్నది. నిజ మనోరథ ఫల దాయకము లయ్యును భగవత్ సేవా విరహితములైన కార్యముల జేయనివాడు ఆత్మంతిక భక్తుడు. ఇట్టి భక్తుడు స్థితప్రజ్ఞుడై తమోగుణ మును ఇంద్రియములను జయించును. అందులకే గీతలో "ఇంద్రియా ణ్యాదౌని యమ్య భరతర్షభ:" అని శ్రీకృష్ణుడు తెలిపెను.

అట్లే ఆత్యంతిక భక్తునివలె పతివ్రత తన ఇంద్రియ తృప్తికై పతిని సేవింపక, పతిని తృప్తిపరచుటకై పతిసేవ సేయవలయును. ఆమె ఇంద్రియములను ప్రత్యక్ష భగవంతునిగా భావించిన భర్త పర ముగా జేయవలయును. అప్పుడు కామ క్రోధాదులు తమోగుణము జయింపగలదు. ఇట్టి నిష్కామసేవయే ఆత్యంతికభక్తి యనవచ్చును. రుక్మిణీదేవికూడ తన పంచేంద్రియములు శ్రీకృష్ణ పరముగావి జన్మ వ్యర్థమని ఇట్లు సందేశ మంపెను.

సీ॥ ప్రాణేశ! నీ మంజు భాషలు వినలేని
కర్ణ రంధ్రంబుల కలిమి ఏల?
పురుషరత్నమ! నిన్ను భోగింపగా లేని
తనులత వలని సౌందర్య మేల

భువనమోహన! నిన్ను బొడగానగాలేని
చక్షురింద్రియముల సత్త్వమేల
దయిత! నీ యధరామృతం బానగాలేని
జిహ్వకు ఫలరస సిద్ధి ఏల.

గీ॥ నీరజాత నయన! నీ వనమాలికా
గంధ మబ్బలేని ఘ్రాణమేల
ధన్యచరిత! నీకు దాస్యంబు సేయని
జన్మమేల వేయి జన్మలకును.

భాగవతము 10-1709

పై పద్యములో పంచేంద్రియములు భర్త పర మొనర్చుటకు సూచింపబడినది కదా?

ఇంద్రియములను జయించి తమోగుణమును తొలగించుకొన్న తరువాత మనోవిక్షేప కారణమైన రజోగుణమును తొలగింపవలెను. దీనికి భాగవతములో కపిలుడు సూచించిన అవయవయోగమును అల వరచుకొనవలెను. అనగా భగవంతుని రూపమును లేదా భర్త రూపమును ఫలకమున నిలుపుకొనవలయును. చిత్రపటమున అగుపించు పరోక్ష దైవముయొక్క ఆకారముకంటె ప్రత్యక్షదైవమైన భర్త రూపము ఎక్కువ ప్రయత్నము లేకయే మనః ఫలకమున నిలుపవచ్చును, ఇది ఏకవస్తు చింతనమై మానసిక ఏకాగ్రతకు దారి తీయును. ఆపై త్రిపుటి నశించి ఆత్మ సాక్షాత్కార మగును. భగవంతునకుకూడ రూప నామములు లేవు. ఉపాసనా సౌలభ్యముకొరకై దేవునికి నామ రూపములు కల్పించిరి.

శ్లో॥ చిన్మయస్య అద్వితీయస్య నిర్గుణస్య అశరీరిణః
ఉపాసకానాం కార్యార్థం బ్రహ్మణో రూపకల్పన.

— రామ తాపిని

ఐహికముగా విచారించినను భర్తకు భార్య అనుకూలవతిగా

నుండవలెను కదా. అందులకే మనుచరిత్రలో ప్రవరుడు "అనుకూల వతి నాదు మనసులో వర్తించు కులకాంత" అని భార్యను గూర్చి చెప్పెను.

శ్లో॥ కార్యేషు దాసీ కరణేషు మంత్రీ
రూపేచ రంభా, క్షమయా ధరిత్రీ
భోజ్యేషు మాతా, శయనేతు వేశ్యా
షట్కర్మ యుక్తా ఖలు ధర్మపత్నీ.

పై విధముగా అనుకూలవతియగు భార్య నిష్కామముతో పతిని దైవముగా భావించి సేవించినను భగవంతుని పొందవచ్చునని రుక్మిణీ కల్యాణ కథ వ్యక్తము చేయుచున్నది.

శ్రీకృష్ణుడు రుక్మిణీదేవి సందేశమును అగ్నిద్యోతముని ద్వారా విని ఆమె భక్తి ప్రపత్తులకు సంతసించి స్వయముగా వచ్చి చేకొని పోయెను.



## 23 వృత్రాసుర వధ - దాని సంకేతము

### చిత్రకేతూపాఖ్యానము :-

వృత్రాసురవధ కథ ఋగ్వేదము, యజుర్వేదము, భారతము, భాగవతము, దేవీ భాగవతము, పరాశర సంహిత-వీనియందు కలదు. రామాయణముకూడ వృత్రాసురవధ నాధారముగ జేసికొని వ్రాసినదే నని పెద్దల అభిప్రాయము. ఇన్నిటియందు ఈ కథ అగుపించుటచేత దీని ప్రాశస్త్యమును గూర్చి తెలుప నవసరములేదు. దీని ఆవశ్యకత, సంకేతార్థము మనము గ్రహించవలెను. వ్యాసుడు సంప్రదాయ రహస్యములను కథలరూపమున తెలిపెననుటకిది ఉదాహరణ మనవచ్చును.

మత్స్యపురాణములోని భాగవత నిర్వచనమునందు వృత్రాసుర వధతో కూడిన పురాణము భాగవతమని తెలుపబడినది.

శ్లో॥ యత్రాధికృత్య గాయ త్రీం వర్ణ్యతే ధర్మ విస్తరః
వృత్రాసుర వధోపేతమ్ త ద్భాగవత మిష్యతే.

అనగా ఏ పురాణమునందు గాయత్రి నధికరించి ధర్మ విస్తరము చేయబడి వృత్రాసురవధ చెప్పబడినదో ఆ పురాణము భాగవత మనబడును.

పంచమ వేదము లనబడు భాగవతము, భారతము మొదలగు పురాణములు వేదార్థమును, భగవత్తత్త్వమును నిరూపించును. వీని యందు వృత్రాసురవధ యుండుటచేత భగవత్తత్త్వ ప్రతిపాదనకు వృత్రాసురవధకు గల సంబంధ మేమియో తెలిసికొనవలయును. తొలుత వేదమునగల వృత్రాసుర వధ సంకేతార్థమును భాష్యముల యందు ఎట్లు వివరించిరో పరిశీలింతము.

### ఋగ్వేదము - వృత్రాసురవధ :-

ఋగ్వేదమునకు సాయణుడు భాష్యము వ్రాసెను. అందులో వృత్రాసుర వధ సంకేతార్థము క్రింది విధముగా చెప్పబడినది.

"దట్టముగా ఆవరించిన నల్లని మేఘమే వృత్రాసురుడు. ఇంద్రుడు మెఱపుతీగ అను వజ్రాయుధముతో మేఘమనెడి వృత్రాసురుని ఛేదింపగా వర్షము కురిసెను."

శ్రీ అరవిందులు 'On Veda' అను గ్రంథములో సాయణుని భాష్యము కేవలము వైదిక కర్మకాండకు సంబంధించిన వివరణమే కాని దాని ఆధ్యాత్మ సంకేతమునకు వివరణము కాదని భావించెను. ఈ అభిప్రాయమునే శ్రీ కావ్యకంఠ గణపతిముని శ్రీ కపాలిశాస్త్రి సమర్థించిరి. పై వివరణలో నల్లని మేఘము రాక్షసుడుగను, మెఱపు తీగ వజ్రాయుధముగను ప్రకృతిలోని విషయములకు రూపకల్పన చేయవలెను. ప్రకృతిలో జరుగు పై సంఘటన దేవతలు రాక్షసుల మధ్య జరుగు సంఘర్షణగా భావింపబడినది. అయినచో వేదము ప్రకృతిలోని సంఘటనలను కథారూపముగా వర్ణించినదని భావింపవలసి యుండును.

"If Vritra and the waters symbalise the Cloud and the rain ——————— the Veda in a symbolism of natural phenomena personified is figures of Gods and Demons."

చారిత్రకులు పై కథను వేరొక విధముగా వ్యాఖ్యానించిరి. వృత్రాదులు హిందూదేశమున తొలుత నివసించుచున్న ద్రావిడుల దేవతా మూర్తులుగ భావించినచో ప్రకృతిని ఆరాధించెడి ఆర్యులు ద్రావిడులపై జరిపిన దండయాత్రకు సంకేతముగా వృత్రాసుర వధ రచింపబడినదనవచ్చును. ఇట్టి చారిత్రాత్మక కథ సాంకేతికముగా వ్రాయబడి యుండవచ్చును.

"If Vritras ——— are Dravidian Gods, ——— the Veda is a poetical and legendary account of the invasion of Dravidian India by Nature worshipping Aryans."

పై రెండు అభిప్రాయములు సత్యదూరములే. నిజమైన సంకేతార్ధము లివికావు. ఆత్మజ్ఞాన ప్రకాశము అజ్ఞానాంధకారములకును, సత్యాసత్యములకును, విద్యా అవిద్యలకును, మృత్యువు అమృతత్వములకును మధ్య జరిగిన సంఘర్షణమునే వేదము సంకేతరూపమున కథగా వర్ణించినది.

"If on the other hand this is the symbolism of struggle between spiritual powers of Light and Darkness, Truth and Falsehood, knowledge & Ignorance. Death and Immortality, then that is the real sense of Veda"

పంచేంద్రియములచే బాహ్యవిషయములు గ్రహింపబడుచున్నవి. మనస్సుచే అనుభూత విషయములు తర్కింప బడుచున్నవి. ఇట్లు ఇంద్రియ మనస్సులయొక్క బాహ్యాభ్యంతర ప్రవృత్తుల సహాయమున భౌతిక రసాయనాది శాస్త్రములు వ్రాయబడినవి. వేదఋక్కులు అట్లు వ్రాయబడలేదు. అవి ఇంద్రియములకు మనస్సునకు తర్కమునకు అతీతములు. "యతో వాచో నివర్తంతే అప్రాప్య మనసా సహ" అనగా వాక్కులకు మనస్సునకు అందరాని సమాధిస్థితిలో ఋషులు తాము దర్శించిన సత్యములను, వైఖరీవాక్కుతో ఋక్కులరూపమున ప్రకటించిరి. కావున వేదములను సామాన్యమానవుడు మానసిక తర్కముతో వ్రాయలేదు. అందులకే వేదములను అపౌరుషేయము లనిరి.

"The Rishi was not the individual composer of the hymns, but the seer (ద్రష్ట) of an eternal truth, an impersonal knowledge (అపౌరుషేయము). The language of Veda is Sruthi, a rythm not composed by intellect, but heard."

వేదకాలమున ఆర్యులు సత్యమును దర్శించుటకు తమ అంత

రంగిక ప్రబోధము (Intution) పై ఆధారపడిరి. ప్రస్తుతము భౌతిక రసాయనాది శాస్త్రములలోని సత్యములు, ప్రకృతి పరిశీలనముచేతను తర్కముచేతను (Inductive and Deductive logic introduced by Bacon) నిర్ణయింపబడుచున్నది. తర్కమునకు లొంగని విషయములు శాస్త్రవిరుద్ధముగా పరిగణింపబడుచున్నవి. విశేషమేమనగా తర్కము భౌతిక రసాయనికశాస్త్రములకే పరిమితిచెంది యున్నదని గ్రహింపవలయును. మానసికమైన తర్క ప్రాబల్యమున వైదిక సత్యములను సాధింప వీలుపడదు. అవి ఇంద్రియములను మనస్సును అధిగమించిన (Transcendental meditation) సమాధి స్థితి లో దర్శింపబడినది.

అందులకే పోతన భాగవత పాఠకుల నిట్లు హెచ్చరించెను. విష్ణు లీలలను "నామరూపముల్ దవిలి చరించు మానవులు తార్కిక చాతురి ఎంత గల్గియున్, మిగిలి కుతర్కవాదముల మేరలు మీరి ఎఱుంగ నేర్తురే?" అనగా నామరూపాత్మకమైన జగత్తును సత్యమని ఇంద్రియ మనోవృత్తులచే భావించెడి మానవుడు తర్క చాతుర్యమున ఆత్మదర్శనము పొందజాలడు.

ఋగ్వేదమున వృత్రాసురవధ ఆంగిరసులకథ అనునవి రెండు కథలు కలవు. ఈ కథలు అనేక పర్యాయములు ఋఙ్మంత్రముల యందు మరల మరల చెప్పబడినవి. వీని సంకేతార్థము గ్రహించినచో ఋగ్వేద సంహిత అంతరార్థము గ్రహించినట్లే.

"They (the two stories) run through the hymns as two closely connected threads of symbolic imagery, and around them all the rest of Vedic symbolism is woven. Not that they are the central ideas but they are two main pillars of ancient (vedic) structure. When we determine their sense we

have determined the sense of the whole Rik Samhitha."

వేదములు, బ్రాహ్మణములు, ఉపనిషత్తులు, పురాణములు, సంహితలు - అన్నింటికి ఏకవాక్యత కలదు. (Unity in diversity) అన్నింటిలోనుగల వృత్రాసురవధ కథ సంకేతార్థము ఒకటిగానే ఉండవలయును కదా? వైదికపదములకు సంకేతార్థము కలదని నిర్ణయించుటకు భారతమే ఒక నిదర్శనము.

శ్లో॥ అజో అగ్ని ర్వరుణో మేషః సూర్యో అశ్వ ఇతి దర్శనమ్
కుంజరాశ్చ మృగా నాగా మహిషా శ్చాసురా ఇతి
— భారతము - అనుశాసనిక పర్వము

అజ=అగ్ని: మేష=వరుణ; అశ్వ=సూర్య:
ఏనుగు, జింక, పాము, ఎనుము=అసురులు
కోళ్ళు, పందులు=రాక్షసులు

"The Cows are the rays of the dawn, the herds of the Sun and not Physical Cattle"

వేదమంత్రములకు మూడువిధములైన అర్థములను చెప్పవచ్చునని శ్రీ మధ్వాచార్యులు తెలిపిరి.

1) యజ్ఞ యాగాది కర్మలయందు క్రియా కలాపపరముగ (కర్మ)
2) భగవంతుని పొగడ్త, వర్ణనపరముగ (భక్తి)
3) వేదమంత్రమునే దేవతగా భావించుట (జ్ఞానము)

వేదమంత్ర ఉచ్చారణతో చేయబడు యజ్ఞములయొక్క ప్రయోగ విధానములను బ్రాహ్మణములు వివరించెను. సాయణ భాష్యముకూడ ఇందులకే ఉపయోగింపబడినది (కర్మకాండ). వేదమంత్రముల అర్థమును పురాణాలు భగవంతునిపై భక్తిపరముగా వివరించెను. (భక్తి మార్గము). ఉపనిషత్తులు వేదమంత్రముయొక్క జ్ఞాన విమర్శనము

గావించెను. కాబట్టి వైదికపదముల అర్థము కర్మ, భక్తి, జ్ఞానపరముగ నిర్ణయింపవలయును.

యజ్ఞయాగాదు లొనరించుటవలన ఇంద్రుడు తృప్తిజెంది వర్షము కురిపించును. కావున సాయణుడు సూచించిన వృత్రాసురవధ సంకేతార్థము వైదిక కర్మపరముగా నున్న దనవచ్చును. భక్త రక్షణకై విష్ణువు రాక్షససంహార మొనర్చినట్లు ఇంద్రుడు వృత్రాసురుని జంపెనని భక్తిపరముగా వ్యాఖ్యానించవచ్చును. ఎందుకనగా ఋగ్వేదమున ఇంద్రుడే పరదైవముగా చిత్రింపబడెను. కాని జ్ఞానపరముగా వృత్ర శబ్ద సంకేతార్థము నిర్ణయించునప్పుడు మేఘమని కాని అసురుడని కాని తెలుప వీలుపడదు. యాస్కుడు మొదలగు నిరుక్తకారు లిట్టి పదములకు ధాతువునుబట్టి అర్థము గ్రహింపవలెనని తెలిపిరి. వృత్ర శబ్దమునకు "చుట్టుకొనునది" "మఱుగుపరచునది" (ఆవృతం = Encircle) అను అర్థమును చెప్పినఎడల ఆత్మజ్ఞానము అరిషడ్వర్గములచే ఆవృతమై మఱుగుపడి యున్నదని ఈ క్రింది భగవద్గీత శ్లోకము సూచించుచున్నది. వృత్రాసురవధ సంకేతార్థము ఇంద్రియవృత్తుల విరోధమేనని సూచించి ధృవపరచుచున్నది.

## భగవద్గీతలో వృత్రాసురవధ :-

శ్లో॥ ఆవృతం జ్ఞానమేతేన జ్ఞానినో నిత్య వైరిణా
కామరూపేణ కౌన్తేయ దుష్పూరే ణానలేవచ.

— గీత 3-39

కౌన్తేయ! జ్ఞానికి నిత్యశత్రువును, ఎప్పటికిని కోర్కె తీరనిదియును, కోరికలే స్వభావముగా గలదియును అగు కామముచే జ్ఞానము (ఆవృతం) చుట్టుకొనబడినది.

పై శ్లోకమున "ఆవృతం" అను పదము గమనింపదగినది. ఈ పదమె వృత్రాసుర కల్పనకు మూలము.

శ్లో॥ ఇంద్రియాణి మనోబుద్ధి రస్యాధిష్ఠాన ముచ్యతే
ఏతై ర్విమోహయ త్యేష జ్ఞాన మావృత్య దేహినమ్.

— గీత 3-40

కామమునకు ఆశ్రయము లెవ్వి? ఇంద్రియములు, మనస్సు, బుద్ధి - ఈ మూడు కామమునకు ఆశ్రయములు. కామము ఇంద్రియములచేత జ్ఞానమును మఱుగు పరచి నా నా విధములుగ మోహపెట్టు చున్నది. పై శ్లోకమున "ఆవృత్య" అను పదము గమనింపదగినది.

శ్లో॥ తస్మా త్త్వ మింద్రియా ణ్యాదౌ నియమ్య భరతర్షభః
పాప్మానం ప్రజహి హ్యేనం జ్ఞాన విజ్ఞాన నాశకమ్॥

గీత 3-41

అర్జునా: అందువలన నీవు మొదట ఇంద్రియముల నిగ్రహించుము. పాప స్వరూపమును, శాస్త్రానుభవ జ్ఞాన నాశకమగు కామమును విడువుము.

శ్లో॥ ఇంద్రియాణి పరాణ్యాహుః ఇంద్రియేభ్యః పరమ్ మనః
మనసస్తు పరా బుద్ధి ర్యో బుద్ధేః పరతస్తు సః

— గీత 3-42

స్థూలదేహముకంటె ఇంద్రియములు గొప్పవి. ఇంద్రియముల కంటె మనస్సు గొప్పది. సంకల్ప వికల్పాత్మకమైన మనస్సుకంటె నిశ్చయాత్మకమైన బుద్ధి గొప్పది. బుద్ధికంటెను పరమాత్మ గొప్పవాడు.

శ్లో॥ ఏవం బుద్ధేః పరం బుద్ధ్వా సంస్తభ్యాత్మాన మాత్మనా
జహి శత్రుం మహాబాహో కామరూపం దురాసదమ్.

— గీత 3-43

మహాబాహూ! బుద్ధికంటె శ్రేష్ఠమగు ఆత్మను తెలిసికొని, ఆత్మచేత బుద్ధిని, బుద్ధిచేత మనస్సును, మనస్సుచేత ఇంద్రియములను

జయించి సమస్త దుఃఖములకు కారణమగు కామమను శత్రువును జయించుము.

పై గీతా వాక్యములవలన జ్ఞానము ఇంద్రియాధిష్ఠమైన కామముచే ఆవృత్తమైనదనియు. ఇంద్రియ మనో నిగ్రహములచే కలిగిన నిశ్చయాత్మక బుద్ధివలన జ్ఞానమును పొందవచ్చుననియు, సూచింపబడినది. కావున ఇంద్రియ మనోవృత్తులే వృత్రాసురుడు. ఆ వృత్తుల నిరోధమే జ్ఞాన సాధన మార్గము.

శ్లో॥ "సర్వ ధర్మాన్ పరిత్యజ్య మామేకం శరణం వ్రజ"

అను భగవద్గీత యందలి వాక్యములో "ధర్మ" శబ్దమునకు ఇంద్రియ మనోధర్మములు లేక కోరికలని కుర్తాలం స్వాములవారు వ్యాఖ్యానించిరి. అన్ని కోరికలు వదలి నన్ను శరణు వేడుమని పై శ్లోకార్థము. ఇంద్రియార్థములే మన కోరికలు. కామమే వీని మూలము. దానివలన క్రోధ లోభ మద మాత్సర్యము లేర్పడును. ఇందిృయ మనోనిగ్రహమే రజస్తమోగుణ పరిహారియగు భాగవత భక్తి. ఇందిృయ మనోవృత్తుల నిగ్రహమే వృత్రాసురవధకు సంకేతము.

## పరాశర సంహితలో వృతాృసుర వధ:

పంచముఖ హనుమత్ స్తోత్రము, దాని ప్రయోజనమును తెలుపునపుడు, పరాశర సంహితయందు వృత్రాసుర ప్రసక్తి వచ్చినది.

ఇంద్రుడు వృత్రునితో పోరజాలక తనచేతనున్న వజ్రాయుధమును జారవిడచి మూర్ఛ నొందెను. ఇది గమనించిన దేవగురువైన బృహస్పతి ఇంద్రుని మేల్కొల్పి పంచముఖ హనుమత్‌స్తోత్రము నుపదేశించెను. దాని ప్రభావముచే ఇంద్రుడు సత్వవంతుడై వజ్రాయుధముచే వృత్రుని సంహరించెను. పై విధముగా మైతేృయునకు శ్రీపరాశర మహర్షి వృతాృసుర కథను తెలిపి పంచముఖ హనుమత్ స్తోత్ర పఠన ఫలమును ఇట్లు తెలిపెను.

శ్లో॥ పఠంతి యే స్తోత్ర మిదం పవిత్రం
జిగీషవ స్తేఒరిజయం ప్రయాతి
అస్మాక మంత ర్ద్విషతా మపేక్షయా
హనూమత స్తోత్ర బలాదభూత్ పురా ॥

అనగా శత్రుజయమును కోరువారికి బృహస్పతి ఉపదేశించిన పంచముఖ హనుమత్ స్తోత్రమును పఠించినచో శత్రుజయము సిద్ధిం చును. విశేషమేమనగా పరాశరుడు పూర్వము ఈ హనుమత్ స్తోత్ర పఠన బలమువలన కామ క్రోధ లోభ మద మాత్సర్యములను అంతః శత్రువులను జయింపగలిగెను. అనగా వృత్రాసురవధ కుపయోగపడిన హనుమత్స్తోత్రమే అరిషడ్వర్గ జయమున కుపయోగపడి, ఇంద్రియ మనోనిగ్రహములకు దారిదీసినదని చెప్ప వీలగుచున్నది కదా? అంతః శత్రునాశమే వృత్రాసురవధ రూపమున సాంకేతికముగా చెప్పబడిన దనుట నిర్వివాదాంశము.

## భారతములో వృత్రాసురవధ:-

సంస్కృత భారతమున అశ్వమేధ పర్వమున వృత్రాసుర వధ చెప్పబడినది.

శ్లో॥ తతో వృత్రం శరీరస్థం జఘాన భరతర్షభ!
శతక్రతు రదృశ్యేన వజ్రేణ తీ హనః ఖ్రితమ్

శరీరస్థుడగు వృత్రుని ఇంద్రుడు అదృశ్యమగు వజ్రాయుధము చేత సంహరించెను. వ్యాసుడు వృత్రాసురవధను గూర్చిన సంకేతార్థ మును తాను ఋషులవద్ద గ్రహించెనని ధర్మరాజుతో చెప్పెను. ఇదియే "చదువులలో మర్మమెల్ల చదివితి తండ్రీ" అని ప్రహ్లాదుడు చూచిన మర్మము.

"The Mahabharatha also says that the whole legend of Vritra is a secret" – Aravindo.

ఆంధ్రభారతము ఈ వృత్రాసురవధ సంకేతార్థమును క్రింది విధముగా సువ్యక్తము చేయుచున్నది.

"ధర్మరాజు బంధువిషయ శోకంబునన్ గ్రమ్మఱన్ దెలివి నందియు, నొందక ధూమంబు వొదివిన యనలంబునుం బోలెనున్న పాండవాగ్రజున్ గనుఁగొని కమలనాభుండు,

సీ॥ అవని ఎల్లను వృత్రు డాక్రమించి తదీయ
గుణమగు గంధంబు గొనిన, వజ్రి
వానిపై వజ్రింబువైవ, గ్రిమంబున
నంబు తేజః పవనాంబరముల
యందు బ్రివేశించి, యందుల రసరూప
సంస్పర్శ శబ్దముల్ చంద వికర్రి
ముండై యతడు సముద్ధత గొనగొని
దోడ్తోడ నమ్మహేంద్రుడు గులిశ

ఆ॥ విహతి వెలువరింప, నిర్భరవేగుడై
నతనిలోన జొచ్చె నసుర, దాన
మూర్ఛవోయె దివిజ ముఖ్యుడు, బోధితు
జేసె మంత్రవిధి వశిష్ఠు డతని.

ఇట్లు వశిష్ఠ ప్రయుక్త మంత్ర శక్తిం బ్రిబుద్ధుండై వృత్రు తద్దృశ్యంబైన వజ్రింబున వధియించె, నవ్వాసవుం డీ ధర్మరహస్యంబు తెలుంగు మునుల కెఱింగించె, మునులు నాకుం జెప్పిరి. మానవేశ్వర దీనిని నీవు తెలిసికొనుము." అని వ్యాసుడు తెలిపెను.

తొలుత వృత్రుడు ప్రపంచమునందలి పంచభూతముల నాక్ర మించి శబ్ద స్పర్శ రూప రస గంధములను గ్రిహించెను. ఇంద్రుడు వజ్రాయుధముచే వృత్రుని వానినుండి వెలువడునట్లు చేసెను. అంతట వృత్రుడు ఇంద్రుని దేహమునందు ప్రవేశించెను. త్వక్ చక్షు శ్రోత్ర జిహ్వా ఘ్రాణములనెడి పంచేంద్రియముల యొక్క శబ్ద స్పర్శ రూప

రస గంధముల నాక్రమించెను. అంత ఇంద్రుడు మూర్ఛపోయెను.

వశిష్ఠు డతనిని మేల్కొల్పి మంత్రోపదేశ మొనర్చెను. ఇంద్రుడు మంత్రశక్తిచే ప్రబుద్ధుడై వృత్రుని అదృశ్యంబైన వజ్రముచే వధించెను. వృత్రుడు పంచేంద్రియములలో ప్రవేశింపగా. ఇంద్రుడు మంత్రశక్తిచే ప్రబుద్ధుడై ఇంద్రియ వృత్తుల నిరోధించెనని భావము. ఇంద్రియములు స్థూలదేహము తమోగుణము వలన జనించినవి. మనో విక్షేపము రజోగుణము వలన కలిగెను. ఇంద్రియవృత్తి నిరోధమే తమోగుణ పరిహారము. మానవుడు ఇంద్రియార్థముల వెంటబడి సంసార బద్ధుడగును. ఇంద్రియార్థములకు మూలము కామము. దాని నుండి క్రోధలోభమద మాత్సర్యాది అంతః శత్రువులు ఏర్పడినవి. ఇంద్రియముల నిగ్రహించి అంతః శత్రునాశనము చేయగలిగిన శాంతి లభించును. కామాద్యరిషడ్వర్గ లయమే శాంతి. బంధుశోక విషయ మెవ్విధంబునను బాయక పోవుటచేత ధర్మరాజునకు శోకము కలిగి శాంతి చేకూర దయ్యెను. అతని శోకము బాపుటకై శాంతిని చేకూర్చుటకై వృత్రాసురవధ కథ చెప్పబడినది.

ACC NO. 14342

ధర్మరాజు బాహ్య శత్రువులైన కౌరవులను మాత్రమే జయించెను. బాహ్య శత్రువుల జయించుట కంటె అంతః శత్రువుల జయించుటయే (అనగా ఇంద్రియముల నిగ్రహించి కామాద్యరిషడ్వర్గముల జయించుటయే) కష్టతరమని వ్యాసుడు తెలిపెను.

30-2000 294.592 NAR

క॥ వెలి పగఱ గెలుపు గెలుపే
యల ఘుమతిన్ గెలువ వలయు నభ్యంతర శ
త్రుల దద్విజయము మోక్షము
నలువఱుపం జాలు, నొంట నమ్మెలగునే

P-2

అంతః శత్రుజయమే మోక్షప్రదము. అదియే నిజమగు గెలుపు. బాహ్య శత్రువుల జయించుట గొప్ప విషయము కాదు.

క॥ విను మంతశ్శ్రుతువులలో
ఘనుడగు కాముడు, నిరస్త కామంబగు వ
ర్తనము విరల, మధ్యయన య
జన దానంబులును గామ సహితములు గదా?

అరిషడ్వర్గములలో కామము బలవత్తరమైనది. కామ రహిత మైన వర్తనమే శ్రేష్ఠము. యజ్ఞము దానము మొదలగునవి కామ సహితములు.

పై కామమునకు ఆశ్రయము పంచేంద్రియములు మనస్సు బుద్ధి అని భగవద్గీతలో తెలుపబడినది.

శ్లో॥ "ఇంద్రియాణి మనోబుద్ధి రస్యాధిష్ఠాన ముచ్యతే"

ఇంద్రియార్థముల గోరియే మానవుడు సంసారమగ్నుడగు చున్నాడు. ఇంద్రియముల వశపరచుకొని కోరికల నాపువాడే స్థిత ప్రజ్ఞుడు.

శ్లో॥ తస్మా దింద్రియా ణ్యాదౌ నియమ్య భరతర్షభ:

"నీవు ఇంద్రియముల తొలుత నియమింపుమని అర్జునునకు శ్రీకృష్ణు డుపదేశించెను.

క॥ విను పెక్కులేల, కోరిక

మనమున జొరనీయకున్న మడియును గాముం"డు. భారతము మార్కండేయ పురాణములో వృత్రునిగూర్చియు, పాండవులనుగూర్చి ఇట్లు చెప్పబడినది. పంచ పాండవులు ఇంద్రునిలోని భాగములే అయి నను వేరువేరు దేవతలకు జనించిరని తెలుపబడినది. ఇంద్రుడు త్వష్ట కుమారుని వధించుటచేత అతని తేజస్సు ధర్మదేవతను ప్రవేశించెను. తరువాత ఆ త్వష్టకుమారుడే వృత్రుడుగా జన్మించి మరల ఇంద్రునిచే చంపబడెను. ఇప్పుడు ఇంద్రుని తేజస్సు మరుత్తునందు ప్రవేశించెను.

తరువాత ఇంద్రిడు అహల్యను కామించుటచేత అతని సౌందర్యము అశ్వినుల ప్రవేశించెను.

ధర్మదేవత, మరుత్తు, అశ్వినులు తాము గ్రహించినవి తిరిగి ఇంద్రున కిచ్చిరి. అందువలన ధర్మరాజు, భీముడు, నకులుడు, సహదేవుడు జన్మించిరి. అర్జునుడు ఇంద్రుని సగము తేజస్సుచే జన్మించెను. వీరందరు ఇంద్రుని అంశలే కాబట్టి ద్రౌపది ఆ ఐదుగురిని వివాహమాడుటలో దోషము లేదు.

The Maha Bharatha, a History and a Drama by Rai Promothanath Mullick Bahadur.

## వజ్రాయుధ సంకేతము:-

ఇంతవరకు ఇంద్రియ వృత్తుల నిరోధమే వృత్రాసుర వధయని గ్రహించితిమి కదా? ఇంద్రుడు వజ్రాయుధముతో వృత్రుని సంహరించె ననుటలో వజ్రాయుధ సంకేతార్థ మేమి? వజ్రాయుధము దధీచి మహర్షి వెన్నెముక గదా? వెన్నెముకను వజ్రాయుధ మనుటలో విశేష మేమి?

పూర్వము వృత్రాసురుని బాధల కోర్వలేక ఇంద్రాది దేవతలు శ్రీమన్నారాయణుని శరణువేడిరి. వారల రక్షించుటకై భగవంతుడు దధీచి మహర్షి వెన్నెముకను ఆయుధముగ నుపయోగించిన వృత్రాసురుని జయింపవచ్చునని తెలిపెను. నారాయణ కవచ పారాయణముచే దధీచి మహిమోపేతు డయ్యెను. దేవతలు దధీచిని వెన్నెముక నివ్వమని కోరగా అతడు యోగమార్గమున దేహత్యాగ మొనర్చెను. దేవతలు అతని వెన్నెముకను గ్రహించిరి. ఇంద్రుడు దానిని వజ్రాయుధముగా ధరించి వృత్రుని వధించెను.

దేవతలు రాక్షసులు అనగా నెవరని తెలిసికొని తరువాత వజ్రాయుధ సంకేతమును పరిశీలింతము. ఛాందోగ్యములో "దేవాసురాహవై

ఋత్రి సంవేతరే" అను వాక్యమునకు శంకరుని వ్యాఖ్యానము గమనింపుడు.

దేవాః= దీవ్యతే ద్యోతనార్థస్య శాస్త్రోద్భాసిత బుద్ధి వృత్తయః.
అసురా= స్త ద్విపరీతాః
సంగ్రామకృతవంతః
శాస్త్రీయ ప్రకాశ వృత్త్యభి భవనాయ ప్రవృత్తాః

స్వాభావిక్య స్తమోరూపా ఇంద్రియ వృత్తయో అసురాః

తథాతద్విపరీతాః శాస్త్రార్థ విషయ వివేక జ్యోతిరాత్మనో దేవాః స్వాభావిక తమోరూపా సురాభి భవనాయ ప్రవృత్తాః ఇత్యన్యోన్యాభి భవోద్భవ రూపః సంగ్రామ ఇవ సర్వప్రాణిషు ప్రతి దేహం దేవాసుర సంగ్రామోఽనాది కాలప్రవృత్త ఇత్యభిప్రాయః

శాస్త్రోద్భాసిత సాత్విక బుద్ధి వృత్తులు దేవతలు. భాగవతము నందు దేవతలనగా "ఆమ్నాయ విహిత కర్మాచారములు గల్గి తివుటమై వర్తించు దేవగణము" భాగవతము 3-887 అని శాస్త్రవిహిత కర్మాచరణముగలిగి వర్తించు వారే దేవతలని చెప్పబడినది.

తమస్సు రజస్సు రూపములైన ఇంద్రియ మనః ప్రవృత్తులే రాక్షసులు, అసురులు దేవతలసంపదను (రాక్షసులు) హరింపజూతురు. ప్రతి దేహమునందును సాత్విక వృత్తులకును (దేవతలకును) తామస రాజస వృత్తులకును (రాక్షస అసురులకును) మధ్య అనాదిగా యుద్ధము జరుగుచునే యున్నది. దేవాసురు లిద్దరు ప్రజాపతి నుండియే పుట్టిరి. అనగా మనస్సు నుండియే పుట్టిరి. ధర్మక్షేత్రమైన కురుక్షేత్రమున (దేహమున) జరిగిన కౌరవ పాండవ యుద్ధమిట్టిదే. పై శంకర వ్యాఖ్యానము వలన వృత్రాసురు డనగా ఇంద్రియ వృత్తులని తెలియుచున్నది కదా? ఈ ఇంద్రియ వృత్తులు అదృశ్య వజ్రాయుధముచేత ఎట్లు విరోధింపబడినవి?

బ్రహ్మదండి యనబడు వెన్నెముక యందు సుషుమ్నానాడి కలదు. దానిలో షట్చక్రము లున్నవి. మూలాధారము నుండి భ్రూ మధ్యమువరకుగల నాడిని అధః కుండలిని యందురు. మూలాధారము నుండి భ్రూమధ్యము వరకు కుండలిని శక్తిని ప్రబోధించినవారు రజ స్తమోగుణముల జయించి ఇంద్రియ మనోనిగ్రహముల సాధింపగలరు. భ్రూమధ్యమున అజ్ఞాచక్రము కలదు. ఇది గాయత్రికి స్థానము. ఇచట ఇడా పింగళ సుషుమ్నా అను మూడునాడులు కలియుటచేత ఈ స్థాన మును త్రికూట స్థానమని యందురు. ఇచటనుండి సహస్రారమువరకు ఊర్ధ్వకుండలిని వ్యాపించినది. దీనిని సాధించిన ఆవరణము సత్వ గుణము నశించి మోక్షము లభించును. ఇంద్రియ మనో నిగ్రహములను సాధించుటకు వెన్నెముకలోని సుషుమ్నానాడి యందలి అధః కుండ లిని సాధించవలెను. కాన ఇంద్రియ వృత్తులైన అసురులను నిగ్ర హించుటకు వెన్నెముకయే సంకేతముగా వజ్రాయుధ రూపమున చెప్ప బడినదని అనవచ్చును కదా.

అప్రస్తుతము కానిచో ఒక విషయము తెలుపుదును. భ్రూమధ్య మును వారణాసి అందురు. వారణ=ముక్కు; అసి=కొన అని అర్థము. నాసికాగ్రమే భ్రూమధ్యస్థానమని శ్రీకృష్ణుడు ఉత్తర గీతలో నిరూ పించెను. వారణాసి లేక కాశియందు మరణించినవారికి శివుడు బ్రహ్మ తారక ముపదేశించి మోక్ష మొసగునని ప్రతీతి. కాని త్యాగరాజు తన పాటయందు "గోచిలో పాపము గట్టుకపోయిన కాశి రక్షించునె త్యాగ రాజనుత" అని తెలిపెను. అనగా ఇంద్రియ మనోనిగ్రహము లేనివాడు (వారణాసి = ముక్కుకొన వరకు అధః కుండలిని సాధించినవాడు)- రజోగుణము తమోగుణములను బాయనివాడు, కాశిలో మరణించినను శివుడు బ్రహ్మోపదేశ మొనరింపడని భావము. ఇడా పింగళా సుషు మ్నానాడులు లేదా గంగా యమునా సరస్వతులు కలసిన స్థానమే త్రి కూటము లేదా కాశి. "నమో గంగా యమునయో ర్మధ్యే ఏ వసంతి

తేమే పరిసన్నాత్మనః చిరం జీవితం వర్ధయంతి" అని గంగా యమునా మధ్యప్రదేశమున గల ఋషులు మమ్ములను చిరంజీవులుగా ఆశీర్వదింతురుగాక యని సంధ్యా వందనములో చెప్పికొనుట అధః కుండలిని జయించిన ఋషులు మమ్మాశీర్వదింతురు గాక యని అర్థము.

## శ్రీ మహా భాగవతములో వృత్రాసుర వధః-

భాగవత కథలో వృత్రాసుర పూర్వజన్మ వృత్తాంతము కూడ చెప్పబడియున్నది. ఈ కథ ఇంద్రియ జయమే వృత్రాసుర వధ సంకేతమని నిస్సంశయముగా నిరూపించు చున్నది. (దేవీ భాగవతములో కథ వేరు విధముగా నున్నది.)

శూరసేన దేశమునకు భర్తయైన చిత్రకేతుడను రాజు అనపత్యుడై యుండి అంగిరసుడను ముని అనుగ్రహము వలన సుతుని బడసెను. రాజునకు అనేకభార్యలుండిరి. ఈర్ష్యచెందిన కొందరుభార్యలు ఆ కుమారునకు విషమును బెట్టించి చంపించిరి. చిత్రకేతుడు అతని పట్టపురాణి, పుత్ర వియోగబాధకు విలపించుచుండ, అంగిరస మునియు నారదుడు చనుదెంచి వేదాంత వాక్యముల వైరాగ్యమును బోధించి వారి దుఃఖోపశమనము గావింప ప్రయత్నించి విఫలులైరి. తుదకు మృత బాలుని తిరిగి బ్రతికించిరి. కాని ఆ బాలుడే జనన మరణ క్లేశముల మరలమరల బొందజాలనని చెప్పి తోడనే మరణించెను. చిత్రకేతుడు విగత శోకుడై నారదునిచే మంత్రోపదేశమును బొంది సప్త వాసరములు శ్రీహరిని ధ్యానించెను.

చ॥ మది నొకయింత మాత్రన సమంబుగ చేయుచు, బాహ్యవర్తనం
గదిసిన ఇంద్రియంబుల నొకంతకు దెచ్చి, మనంబు వాక్కునన్
పదురుగ దోచి, తత్త్వమున గూర్చుచు, శాశ్వత విగ్రహంబునా
పయు, బ్రశాంతు, లోకగురు సన్నుతిసేయ దొడంగె నిమ్ములన్

భాగవతము-6-468

అతని ఇంద్రియము లీశ్వరపరములై మదినిశ్చల వృత్తిని బొందెను. ఇట్టి తపముచే నతడు విద్యాధర పదవిని పొందెను.

విద్యాధరుడైన చిత్రకేతుడు విమానమున విహరించుచు, కైలాస ప్రాంతమున కేగెను. అందు "బ్రహ్మేంద్రాది సుర నికర సేవితుండై యూరు పీఠముననున్న భవానిం గౌగిటం జేర్చికొని యొడ్డోలగంబున నున్న పరమేశ్వరు జూచి" అనగా బ్రహ్మ ఇంద్రుడు మహర్షులున్న సభయందు పార్వతిని తొడపై గూర్చుండ బెట్టుకొని కౌగలించుకొని యున్న శివుని జూచి "చిత్రకేతుడు పకపకనగి యద్దేవి వినుచుండ నిట్లనియె.

సీ॥ కామరొప్పగా లోకగురుడును గడలేని
ధర్మ స్వరూపంబు దాన యగుచు
జడలు ధరించియు సరిలేని తపమున
బొడవైన ఈ యోగి పుంగవుడును
బ్రహ్మాదు లగొల్వ భాసిల్లు కొలువులో
మిథున రూపంబున మెలత తోడ
బ్రాకృతుండును వోలె బదానురాగుడై
లాలితుండయ్యె నిర్లజ్జత విట

ఆ॥ అకట ప్రకృతి పురుషుడైన దా నేకాంత
మందు సతులతోడ నలరు గాని
యిట్లు ధర్మసభల నింతులతో గూడి
పరిఢవింప లేడు భ్రాంతి నొంది.

భాగవతము-489

అనగా శివుడు బ్రహ్మవాదులున్న కొలువులో సతి నాలింగనము చేసికొని కూర్చుండుటకు కారణము ఈశ్వరునకు ఇంద్రియ నిగ్రహము లేకపోవుటయే నని చిత్రకేతుడు భావించెను. తనకు ఇంద్రియ నిగ్రహము కలదని తాను గర్వించెను.

ఇట్లు తన పూర్వకర్మ విశేషంబున ఇంద్రియ జయుండనని పుట్టిన అహంకారంబున జగద్గురువుం బెక్కు ప్రల్లదము లాడుచున్న

చిత్రకేతుం జూచి భవాని "నీవు రాక్షసుడవై పుట్టు"మని శపించెను. (భాగవతము 6-491) పై కథలో ఇంద్రియ జయములేని చిత్రకేతుదే వృత్రాసురుడుగా జన్మించెనని నిస్సంశయముగా తెలుపబడి యున్నది. గమనింపుడు.

పూర్వము ఇందు్రిడు విశ్వరూపుడను బ్రాహ్మణుని వలన నారాయణ కవచము నుపదేశము బొంది అతనిని గురువుగా స్వీకరించి యజ్ఞమున అతనికి హవిర్భాగము లొసగుచుండెను. విశ్వరూపునకు మూడు తలలుండెను. అతడు యజ్ఞ భాగముల గ్రహించి రహస్యముగా రాక్షసుల కందజేయుటను ఇంద్రుడు తిలకించి, కోపించి, గురువని లెక్కచేయక, అతని మూడు తలలను ఖండించెను. బ్రాహ్మణ హత్యవలన అతనిని బ్రహ్మహత్యా పాతకము బాధింపగా ఆ దోషమును భూజల వృక్ష స్త్రీలకు పంచి పెట్టెను.

విశ్వరూపుని తండ్రియగు త్వష్ట తన పుత్రుని చావునకు కోపించి ఇంద్రునిపై మారణ హోమము జరిపెను. పార్వతిచే శాపోపహతుడైన చిత్రకేతుడు వృత్రాసురుని రూపమున హోమగుండమున అవిర్భవించి ఇంద్రునిపై దండెత్తి పోయెను. ఇంద్రుడు దధీచి వెన్నెముకను వజ్రాయుధముగా గైకొని వృత్రుని సంహరించెను.

రహస్య మేమనగా ఇంద్రియ మనంబులను నిగ్రహింపక చేయు నాత్మానాత్మ విచారము కేవల వాచా వేదాంతమే యగును. దానివలన ఆత్మానుభూతి కలుగదు. అందులకే రమణమహర్షి

క॥ "ఏ సిద్ధియు లేదు విజిజ్ఞాసువునకు శాస్త్రచర్చ సలుపుట
మాత్రిన్ వీసంబే" అన్నారు.

ఆత్మానాత్మ విచారమునకు అర్హత కావలయుననియు తెల్పిరి.

క॥ తనువు నశియించుననుబు
ద్ధిని. విషయమ్ముల నెడ గదిరిన విరాగ
మ్మున — గుణుతుల నీరెంటను
తమ నధికారిగ నెఱుగదగు విక్రమగన్ —రమణగీత

విషయముల ఎడ విరాగము ఇంద్రియ మనోనిగ్రహముచేతనే కలుగును. అప్పుడు ఆత్మానాత్మ విచారమున కర్హుడగును. పై వివరణమువలన వృత్రాసురవధ ఆత్మసాక్షాత్కారమునకు ఎంత ఆవశ్యకమో విశదమైనది కదా?

కేవల తర్కబలముచేత వాదించి బ్రహ్మజ్ఞానమును పొందుటకు వీలు కాదనుటకు నిదర్శనమును ఉమర్ ఖయ్యాము రుబాయతులు సూచించుచున్నవి. ఖయ్యాము పండితుడు, జ్యోతిశ్శాస్త్రవేత్త, వాదోపవాదముల చేయగల సమర్థుడు. కాని అతనికి ఆత్మానుభూతి కలుగలేదు. సంశయములు తీరలేదు.

Myself when young did eagerly frequent
doctor and saint and heard great argument
about it and about, but ever more
Came out by the same door as in I went.

There was the door to which I found no key
There was the Veil through which I cound not see
Some little talk a while of Me and Thee
There was - and then no more of Thee and Me.

అతనికి మాయ, అజ్ఞానము తొలగి సత్యము గోచరించలేదు. కాబట్టి వృత్రాసురవధ జరిగినగాని ఆత్మానుభూతి కలుగదు. సంశయములు తీరవు. ఇంద్రియములచేతను, మనస్సుచేతను భౌతిక సత్యములే గోచరించును. కాన పారమార్థిక సత్యములు ఇంద్రియ మనంబుల నధిగమించినగాని Transeendental meditation వృత్రాసుర వధ జరిగినగాని గోచరింపవు.

ఇంద్రియాధిష్ఠాన దేవత ఇంద్రుడని భావించిన యెడల ఇంద్రుడు వజ్రాయుధమను కుండలినీ శక్తిచే వృత్రాసురుని సంహరించెను లేదా ఇంద్రియవృత్తుల నిరోధింప గలిగెనని సంకేతము. కావున వృత్రాసుర వధ సంకేతము ఆవశ్యకత తెలియవచ్చినది కదా?

# 24 నరకాసురవధ - ఔచిత్యము

"అనౌచిత్య దృతేనాన్య ద్రస భంగస్య కారణమ్" ఔ
లోపించిన రసభంగ మగును. రసపోషణ చేయునప్పుడు ఔచి
తప్పక పాటించవలయును. ఔచిత్యములేని విషయమును ఎం
పోషణతో వివరించినను రసభంగమే యగును. నరకాసురవధ
నడుపుటయందు పోతన ఔచిత్య పోషణమున నెంతటి ప్రజ్ఞ
గోచరించుచున్నది.

నేను విద్యార్థిగా నున్నప్పుడు, పోతనను నా అభిమా
భావించి పొగడుచుండుట గాంచి నెల్లూరునుండి వచ్చిన ఒక స
"మీ పోతనకంటె మా ఎఱ్ఱాప్రగడ గొప్ప కవి" యని వా
అతని దృష్టిలో ఎఱ్ఱాప్రగడకున్న ఔచిత్యము పోతనకు లేదు.
భాగవతము నందలి నరకాసుర వధ కథా కథనముకంటె ఎఱ్ఱ
హరివంశమునందును, నాచనసోముని ఉత్తర హరివంశము న
కథ చక్కగా నడుపబడినదని నాతో వాదించి భాగవతకథ
రెండు లోపములు నాకు జూపెను.

1) నరకాసురునితో యుద్ధముచేయ సంసిద్ధురాలగు సత్య
పోతన చాల పేలవముగ వర్ణించుట మొదటి లోపము.

శా॥ వేణిం జొల్లెము వెట్టి, సంఘటిత నీవీ బంధయై, భూషణ
శ్రేణిం దాల్చి, ముఖేందు మండల మరీచీజాలముల్ పర
బాణిం బయ్యెద జిక్కగా దుఱిమి, శుంభ ద్వీర సంరం
ఏణీలోచన లేచి నిల్చె తన ప్రాణేశా గ్ర భాగంబునన్.

భాగవతము

కేవలము జడను చుట్టుకొని, నడుము బిగించి, ఆభర
ధరించి, పైట సవరించి, వీర సంరంభముతో సత్యభామ యుద్ధ

లేచి నిలుచుకొనె ననుటలో ఆమె సామాన్య స్త్రీవలె చిత్రింపబడినది కదా? ఈ సందర్భాన ఎఱ్ఱాప్రగడ వ్రాసిన పద్యమెంత రసవంతముగా నున్నదో చూడుడు.

శా॥ వీరం బాడుదనంబు నొందె ననగా, విక్రాంత సౌందర్య ల
క్ష్మీరేఖన్ బచరించె నాగ, ధృతి అక్షీణాకృతిన్ బొందెనా,
ధీరోదాత్త పతిక్రియా చరణ భక్తిప్రౌఢ యాతన్వి దా
ప్రారంభించె మహారణ క్రియకు ఆ ప్రత్యర్థితో నుక్కునన్.

పై పద్యములో వీరత్వమే ఆడుదనము పొందినట్లు పరాక్రమము సౌందర్య లక్ష్మీరేఖగా తోచినట్లు సత్యభామ అగుపించుచున్నదని వ్రాయుటలో ఆమె చక్కగా వర్ణింపబడినది. పై రెండు పద్యములు పోల్చిచూచిన ఎఱ్ఱనదే పై చేయి యనవచ్చును.

2) సత్యభామ యుద్ధ వర్ణనములో రెండు సీసపద్యములయందు పర స్పర వ్యతిరేక అభిప్రాయము లుండుట రెండవ లోపము.

సీ॥ బొమ్మ పెండ్లిండ్లకు బోనొల్లనను బాల
రణరంగమున కెట్లు రాదలంచె
మగవారి గనిన దా మఱుగుజేరెడు వింతి
పగవారి గెల్వ నే పగిది జూచె
బపిడియుయ్యాల లెక్క భయమందు భీరువు
ఖగపతి స్కంధ మే కడిది నెక్కె
సఖుల కోలాహల స్వనము లోర్వని కన్య
పటహ ఝాంకృతుల కెట్బెంగి నోర్చె

ఆ॥ నీలకంఠములకు నృత్యంబు గఱపుచు
నలసి తలగిపోవు నలరు బోడి
యే విధమున నుండె నెలమి నాలీఢాది
మానములను రిపుల మాన మడప.

భాగవతము 10-180

సీ॥ వీణ జక్కఁగబట్ట వెరవెఱుంగని కొమ్మ
బాణాసనం బెట్లు పట్ట నేర్చె
మ్రాకున దీగె మార్పంగ నేరని లేమ
గుణము నేక్రియ ధమఃకోటి గూర్చె
సరవి ముత్యము గ్రువ్వజాలని యబల యే
విపుణత సంధించె నిశిత శరము
జిలుకకు పద్యంబు సెప్పనేరని తన్వి
అస్త్రమంత్రము లెన్న డభ్యసించె

ఆ॥ బలుకు మనిన బెక్కు బలుకని ముగుద యే
గతి నొనర్చె సింహ గర్జనములు
ననగ మెఱసె ద్రిజగదభిరామ, గుణధామ,
చారు సత్యభామ, సత్యభామ.

భాగవతము ।

పై పద్యములలో సత్యభామనుగూర్చి చెప్పిన అభిప్రాం
పరస్పర విరుద్ధములుగానున్నవి. అస్త్రమంత్రము లెన్న డభ్యసి
బాణాసనము నెప్పుడు బట్టనేర్చెను? అనుటచే సత్యభామకు
ముందు యుద్ధనైపుణ్యము లేదని చెప్పవలయును కదా? అం
నరకాసురునితో పోరగల పరాక్రమము, నైపుణ్యము, ఆమెకు
ఎట్లు సమర్థింప వీలుపడును? పోతన కేవలము నాచనసోముని
పద్యముల ననుకరించెనని నా సహపాఠి అభిప్రాయము.

సీ॥ తంత్రి వినోదంబు తడవు సైపని వేళ్ళు,
గొనయంబు తెగలపై గోరుకొనుట
చెలికత్తె నొత్తిల చీరలేని ఎలుంగు
సింహ నాదంబుచే చెదర కునికి

— ఉత్తర హరివ

పై పద్యమునకూడ సత్యభామ ప్రదర్శించిన పరాక్రమః
కారణ మగుపించునేదు.

"పలికించెడు వాడు రామభద్రుండట" అని పోతన తలపోసెను. శ్రీరాముడే పలికించిన శ్రీ మహాభాగవతములో లోపములుండవుకదా? అందువలన హరివంశము, ఉత్తర హరివంశము. భాగవతము ఈ మూడింటి యందలి నరకాసురవధ ఘట్టములను జాగ్రత్తగా పరిశీలించితిని. ఎఱ్ఱన, నాచనసోముల కంటె పోతనయే రసవత్తరముగను ఔచిత్య యుక్తముగను కథను నడిపించినట్లు నాకు తోచినది.

నాచనసోముని ఉత్తర హరివంశములోని కథను మొదట పరిశీలింతము. నరకాసురుని ధాటి కోర్వజాలక ఇంద్రుడు శ్రీకృష్ణునితో మొరపెట్టుకొనెను. శ్రీకృష్ణు డతని కభయ మిచ్చి సత్యభామతోకూడి గరుత్మంతు నధిరోహించి నరకుని జంపుటకు వెళ్ళెను. తొలుత తన్నెదిరించిన మురాసురుని వధించెను. తరువాత నరకుడు శ్రీకృష్ణు నెదిరించెను. యుద్ధమున నరకునిదే పైచేయిగా తోచెను.

క॥ నరకుం డేసిన బాణము
హరి నిటల తటంబుదాకి యల్లల నాడెన్

నరకుడు వేసిన బాణము ఫాలభాగమున దాకగా శ్రీహరి తల్లడిల్లెను. ఇంకను

ఉ॥ కాడిన యమ్ముతో సొలసి కంస విరోధి శిరోధి వ్రేల జే
యాడక మూర్ఛపోయె — ఉత్తర హరివంశము

బాణము తాకిడితో తెలివిదప్పి తన తల వ్రేలాడగా, చేయి కదల్పలేక శ్రీహరి మూర్ఛపోయెను. అంత సత్యభామ తగిన పరిచర్యసేసి మేల్కొల్పగా

"శార్ఙమిందు నీవు సమరంబె కోరుదు
నవసరంబు వచ్చె ననుచు నిచ్చె"

సత్యభామకు తన ధనుస్సునిచ్చి "నీవు యుద్ధము చేయగోరియుంటివి. సమయము వచ్చినది యుద్ధము చేయుము"మని తెలిపెను.

సత్యభామ నరకునితో యుద్ధమొనర్చి అతని నోడించి తన ప
మును ప్రదర్శించుకొనెను. "నీవు సమరమె కోరుదు"వని
సత్యభామతో తెల్పుటచేత ఆమె కోర్కెను పూర్తిచేయుటకు
నకు తీసికొని రాబడినను, శ్రీకృష్ణుడు నరకుని బాణము సో
కుడై సత్యభామను తనకు బదులుగా యుద్ధము చేయుమని కో
కథ నడచినది.

భాగవతమున కూడ సత్యభామ యుద్ధము నేయుటకై
దనియే చెప్పబడినది.

క॥ జన్యంబున దనుజుల దౌ
ర్జన్యము లుడుపంగ గోరి సనుదెంచిన సౌ
జన్యవతి —భాగవతము

ఎఱ్ఱాప్రగడ హరివంశమునకూడ కథ పైవిధముగనే న
మూర్ఛనుండి తేరుకొన్న శ్రీకృష్ణుడు సత్యభామను నరకాసు
యుద్ధము నేయమని కోరగా నరకుడు శ్రీకృష్ణ నుద్దేశించి
పరిహాస వాక్యము లాడెను.

చ॥ తన పనిమాలి ఇంక వనితన్ బురికొల్పి రణం బొనర్ప
చిన జయింప నోపునె ఇసీ యని

— హరి

"తాను యుద్ధ మొనరింపజాలక అబలయగు సత్యభామ
కొల్పి యుద్ధమునకు బంపిన శ్రీకృష్ణుడు జయము పొందగలడా
నరకాసురుడు గేలిచేసెను. ఇచట శ్రీకృష్ణుని పరాక్రమము కు
నదిగా అగుపించుచున్నది.

ఇక శ్రీమహాభాగవతమున పైకథను నడిపించుటయందు
జూపిన నైపుణ్యము పరికించిన అది అనన్యసాధ్యమని చెప్పవ

సత్యభామను రణరంగమునకు కొని రావలసిన కారణవ

వంశమునగాని ఉత్తర హరివంశమునగాని సంస్కృత వ్యాస భాగవత మునగాని తెలుపబడి యుండలేదు. ఈ లోటును పోతన సవరించెను. సత్యభామ మనసులో యుద్ధము తాను చేయవలయునని కోర్కె యున్నది. కాని ఆమె స్త్రీ సహజమైన నేర్పుతో రణరంగమున యుద్ధము చేయవలెనను తన ఉబలాటమును గుప్తపరచి శ్రీకృష్ణుని పొగడుచు ఇట్లు తెలిపెను. యుద్ధరంగమున శ్రీకృష్ణుని యుద్ధ ప్రావీణ్యమును స్వయముగా కన్నులార తిలకించి తిరిగివచ్చి తన సవతులకడ ఆతని ప్రతాపమును పొగడుటకై తాను యుద్ధభూమి కరుదెంతునని వేడుకొన్నది. ఇట్లు ముఖస్తుతి చేసిన శ్రీకృష్ణుడుబ్బిపోయి ఆమెను యుద్ధభూమికి గొనిపోవునని ఎత్తుగడ వేసినది.

శా॥ దేవా! నీవు నిశాట సంఘముల నుద్దీపించి చెండాడ నీ
ప్రావీణ్యంబును జూడ గోరుదు గదా ప్రాణేశ। మన్నించి, న
న్నీ వెంటం గొనిపొమ్ము నేడు కరుణన్, నే జూచి ఏతెంచి నీ
దేవీ సంహతికెల్ల జెప్పుదు భగవద్దీప్త ప్రతాపోన్నతుల్.

భాగవతము 10-151

ఆమె ఎత్తుగడను గ్రహింపనివాడు వోలె నటించి జగన్నాటక సూత్రధారియగు శ్రీకృష్ణుడు యుద్ధమునందలి భయంకర విషయములను తెలిపి భయపెట్టి ఆమె ప్రయత్నమును మాన్పజూచెను.

సీ॥ సమద షట్పంధయ ఝంకారములు గావు
భీషణ కుంభీంద్ర బృంహితములు
వాయునిర్గత పద్మ వనరేణువులు గావు
తురగ రింఖా ముఖోద్ధూత రజము
లాకీర్ణ జల తరంగాసారములు గావు
శత్రు ధనుర్ముక్త సాయకములు
కలహంస సారస కాసారములు గావు
దనుజేంద్ర సైన్య కదంబకములు

తే॥ కమల కల్హార కుసుమ సంఘములు గావు
చటుల రిపుశూల ఖడ్గాది సాధనములు
కన్య నీ వేడ? రణరంగ గమన మేడ?
వత్తు వేగమ, నిలువుము, వలదు వలదు.

భాగవతము 10-153

అని వారించెను. అంత నేర్పరియైన సత్యభామ "ప్రియునకుం ప్రియంబు జనింప దగ్గటి" అతని మనస్సును కరిగింప ప్రయత్నించెను

ఉ॥ దానవులైన నేమి, మరి దైత్య సమూహము లైననేమి? నీ
మానిత బాహుదుర్గముల మాటున నుండగనేమి శంక; నీ
తో నరుదెంతునంచు, గరతోయజముల్ ముకుళించి మ్రొక్కెన
మ్మానిని దన్ను భర్త బహుమాన పురస్సరదృష్టి జూడగన్.

భాగవతము 10-155

శ్రీకృష్ణుడు పోగడ్తకు లొంగడని గ్రహించిన సత్యభామ అతనికి నమస్కరించి అతని దయాదృష్టిని కోరినది. సత్యభామ రెండవ ప్రయత్నముకూడ విఫలమైనఎడల స్త్రీ సహజముగా ఆమె కన్నీరు గార్చి విలపించునని శ్రీకృష్ణుడు భావించెనేమో? "తనకు మ్రొక్కిన సత్యభామను కరకమలంబుల గ్రుచ్చి ఎత్తి తోడ్కొని గరుడారూఢుడై హరి గగనమార్గంబున జనియె."

శ్రీకృష్ణుడు ప్రాగ్జ్యోతిష పురంబునకేగి తొలుత మురాసురుని వధించెను. తరువాత మురాసుర నందనులను సంహరించెను. ఈ వార్త విని నరకుడు స్వయముగా యుద్ధము నేయుటకు బయలుదేరి వచ్చుచుండెను. ఆ సమయములో శ్రీకృష్ణుడు "లలనారత్నము కూడి సంగర కథా లాపంబులన్" జేయుచుండెను. "జన్యంబున దనుజుల దౌర్జన్యము లడుపంగ గోరి చనుదెంచిన" దని గ్రహించిన శ్రీకృష్ణు డామెను సంగర కథాలాపములతో నుత్తేజితను జేసి యుద్ధము నేయ పురికొల్పెను. నరకుని జూడగనే సత్యభామ యుద్ధసన్నద్ధ యగుటకు

లేచి నిలచుకొనెను.

శా॥ వేణిం జొల్లెము వెట్టి సంఘటిత నీవీ బంధయై భూషణ
శ్రేణిం దాల్చి ముఖేందు మండల మరీచీ జాలముల్ పర్వఁగా
బాణిం బయ్యెద జక్కఁగా దునిమి ఘంటద్వీర సంరంభయై
యేణీలోచన లేచి నిల్చె దన ప్రాణేశాగ్ర భాగంబునన్.

భాగవతము 10-17●

ఇట్లు నిలుచున్న సత్యభామయందు యుద్ధము చేయవలయునను కుతూహలము, ఆవేశము ఉన్నవి కాని, నరకాసురుని వంటి రాక్షస యోధునితో పోరాడగల శక్తి లేదని శ్రీకృష్ణుడు గ్రహించెను. "జన్యం బున దనుజుల దౌర్జన్యము లుడుపంగ గోరి చనుదెంచి"నను ఆమెను గెలిపించుటకు శ్రీకృష్ణుడు అట్టి శక్తిని ఆమెకు ప్రసాదింపవలయు నని పోతన భావించెను.

పోతనకు భగవంతుని శక్తియందే నమ్మకము. మానవు డస్వ తంత్రుడని అతని నిశ్చితాభిప్రాయము. దీనికి తార్కాణముగా కృష్ణ నిర్యాణానంతరము అర్జునునితో బలించిన దీనాలాపములు పరికింపుడు.

సీ॥ పందికై పోరాడ ఫాలాక్షు డెవ్వని
బలమున నా కిచ్చె బాశుపతము
ఎవ్వని లావున నిమ్మైన దేవేంద్రు
పీఠార్ధమున నుండ బెంపు గంటి
కాలకేయ నివాత కవచాది దైత్యుల
జంపితి నెవ్వని సంస్మరించి
గోగ్రహణమునాడు కురు కులాంభోనిధి
గడచితి నెవ్వని కరుణజేసి

ఆ॥ కర్ణ సింధురాజ కౌరవేంద్రాదుల
తలల పాగలెల్ల దడవి తెచ్చి

ఏ మహాత్మ బలిమి నిచ్చితి విరటుని
పుత్రి యడుగ బొమ్మ పొత్తికలకు.

భాగవతము 1-365

మ॥ గురు భీష్మాదులుగూడి బన్నిన కురుక్షోణీశ చక్రంబులో
గురుశక్తిన్. రథయంతమై, నొగలపై గూర్చుండి, యామేటి నా
శరముల్ వాఁడికమున్న వారల బలోత్సాహాయు రుద్యోగత
త్వరతల్ చూడ్కుల సంహరించు, నమితోత్సాహంబు నా కిచ్చుచున్

భాగవతము 1-366

మ॥ అసురేంద్రుం డొనరించు కృత్యములు ప్రహ్లాదున్ బ్రవేశించి గె
ల్వ సమర్థంబులు గానికై వడి, కృపాశ్వత్థామ గాంగేయ సూ
ర్యసుత ద్రోణ ధనుర్విముక్త బహు దివ్యాస్త్ర ప్రపంచంబు నా
దెసకున్ రాక దొలంగు, మాధవు దయాదృష్టిన్ నరేంద్రోత్తమా!

భాగవతము 1-367

శ్రీకృష్ణునివలన అర్జునునకు ఇట్టి సహాయము శక్తి లభించినవి. కాని శ్రీకృష్ణ నిర్యాణానంతరము అర్జునుని గతి పరికింపుడు.

శా॥ కాంతారంబున నొంటి దోకొని రాగా జూచి, గోవిందు శు
ద్ధాంత స్త్రీల బదారువేల మదరా గాయత్తులై తాకి, నా
చెంతన్ బోయలు మూగి పట్టికొన, నా సీమంతినీ సంఘమున్,
భ్రాంతిన్ భామినిభంగి నుంటి విడిపింపన్ లేక, ధాత్రీశ్వరా!

భాగవతము 1-374

పై పలుకులలో మహావీరుడైన అర్జునుడు శ్రీకృష్ణుని అనుగ్రహమువలననే శివునితో పోర గలిగెను. అనేక శక్తిమంతములైన కార్యము లొనర్చి జయమే పొందగలిగెను. కాని శ్రీకృష్ణ నిర్యాణానంతరము అతడు "భామిని భంగి నుంటి" నని తన బలహీనతను తెలిపికొనెను.

అందువలన భగవంతుని శక్తియందు నమ్మకముగల పోతనకు హరివంశము నందును, ఉత్తర హరివంశమునందును గల నరకాసుర వధ కథలో, నరకాసురుడు ప్రయోగించిన బాణము శ్రీకృష్ణుని ఫాల మున సోకి శ్రీకృష్ణుడు మూర్ఛనందుటయు, సేదదీరిన తరువాత సత్య భామను యుద్ధమునకు పురికొల్పి తన యశక్తతను జాటుకొనుటయు నరకాసురుడు శ్రీకృష్ణుని పరిహసించుటయు, సత్యభామ స్వయముగా తన స్వశక్తిచేత తన పరాక్రమము జూపి నరకుని ఓడించుటయు, అనౌచిత్యములుగా దోచినవి. సర్వశక్తిమంతుడు, సర్వ కారణభూతుడు నైన శ్రీకృష్ణపరమాత్మ దెబ్బతిని మూర్ఛబొంది సత్యభామను యుద్ధ ము సేయుమని కోరు దుర్గతికి దిగజారుట ఔచిత్యము కాదు గదా! భగవత్సంకల్పము లేక మానవమాత్రురాలగు సత్యభామ యుద్ధము జేయగలదా? ఎఱ్ఱన నాచనసోములు కథనెంత రసవంతముగ వ్రాసి నను ఔచిత్యము లోపించుటవలన రసభంగమైనదని పోతన భావించెను. వ్యాస విరచితమైన సంస్కృత భాగవతమున సత్యభామ నరకునితో యుద్ధ మొనర్చుట వ్రాయబడి యుండలేదు. సంస్కృత హరివంశము ననుసరించి ఎఱ్ఱన నాచనసోములట్లు వ్రాసిరేమో. ఔచిత్యము లేనందున పోతన కథావస్తువును పూర్తిగా మార్పువైచెను. శ్రీ మహాభాగవత కథలో సత్యభామ యుద్ధము చేయ గోరుదునని చెప్పలేదు. యుద్ధ మొనర్ప కుతూహల మున్నను భర్తయైన శ్రీకృష్ణుని పరాక్రమమును తిలకింప వత్తునని కోరినది. శ్రీకృష్ణుడు మురాసురుని చంపిన తరు వాత నరకుడు యుద్ధసన్నద్ధుడై వచ్చులోపల సత్యభామతో "సంగర కథాలాపములాడి "ఆమె అంతర్యమును గ్రహించి ఆమెలోని సంగర కుతూహలమును ఇనుమడించెను. నరకాసురుడు రాగానే సత్యభామ శ్రీకృష్ణుడు కోరకయే, యుద్ధము సేయుటకై లేచి విల్లెత్తెను. ఈ కథలో శ్రీకృష్ణుడు నరకునితో తొలుత పోరు సలుపలేదు. మూర్ఛచెందలేదు. శ్రీకృష్ణుడు నరకునితో తొలుత పోరు సలుపలేదు. మూర్ఛచెందలేదు. కోరకయే లేచి విలు సత్యభామను యుద్ధము సేయుమని కోరనులేదు.

నున్న సత్యభామయొక్క ఆవేశమును గ్రహించి జగన్నాటక సూత్ర ధారుడు సరస సల్లాపము లాడెను.

క॥ లేమా! దనుజుల గెలువగ
లేమా? నీవేల కడగి లేచితి విటు రా,
లే, మాను, మానవా
లే ,, భాగవతము 10-172

"యుద్ధమున నేను దనుజుల గెలువగలను గదా? ఏల నీవు యుద్ధము చేయ లేచితివి?" అని సరసోక్తు లాడెను. తన చేతి విల్లును ఆమె కందించి దాని ద్వారా నరకునితో పోరజాలు బలమును ఆమెకు ప్రసాదించెను.

శా॥ ఆ విల్లందీ, బలంబు నొంది, తదగణ్యానంత తేజో విశే
షావిర్భూత మహా ప్రతాపమున వీరాలోక దుర్లోకయై
భాగవతము 10-176

పై పద్యములో పోతన పాఠకునకు తన అభిప్రాయమును చక్కగా తెలుపబూని, సత్యభామకు నరకు నెదిరించుబలము శ్రీకృష్ణ దత్తమైన విల్లునుండి కలిగినదని రెండు పర్యాయములు తెలిపెను. ఇది పునరుక్తి దోషము కాదు. పాఠకుని మేల్కొలిపి తన అభిప్రాయమును గ్రహింపజేయుటకై అట్లు చేసెను. శ్రీకృష్ణపరమాత్మ ప్రసాదించిన శక్తిచేత ఆమె "వీరాలోక దుర్లోక" అయినది. ఇదిగాక హరి వంశములో కేవలము వీరత్వము మాత్రమే అదుదనము నొందినది. భాగవతమున భగవత్ప్రసాదమున సత్యభామ

"వీర శృంగార భయ రౌద్ర విస్మయములు" (10-177) కలిసి భామిని యైనది. ఇంకను హరికి శృంగారరసము నరకునకు వీరరసము చూపరులకు భయ రౌద్ర విస్మయములు సత్యభామ యుద్ధమున వెద జల్లినది.

మ॥ పరుజూచున్, వరుజూచు, నొంప నలరింపన్, రోష రాగోదయా
విరతి భ్రూకుటి మందహాసయుతో, వీరంబు శృంగారమున్
జరగన్, గన్నుల గెంపు సొంపు బరగన్ చంద్రాస్త్ర సందోహమున్
సరసాలోక సమూహమున్ నెఱపుచున్, చంద్రాస్య హేలాగతిన్

భాగవతము 10-178

ఇక నా స్నేహితుడు సూచించిన రెండవ లోపమును పరిశీలింతము. ముందు వ్రాసిన సీసపద్యముల [(1) బొమ్మ పెండ్లిండ్లకు 2) వీణ చక్కగబట్ట]లో సత్యభామ యుద్ధముచేయునప్పుడు పరస్పర విరుద్ధ భావములు గోచరించుచున్నవి. పై పద్యములు నాచనసోముడు రచించిన "తంత్రీ వినోదంబు" అను పద్యమునకు అనుకరణము లను టకు సందేహములేదు. బొమ్మ పెండ్లిండ్లకు బోనొల్లనను సత్యభామ రణరంగమున కెట్లు రాగలిగినది? మొదలగు ప్రశ్నలకు సమాధానము బడయ వలయును. ఆమె తొలుత భీరువే. శ్రీకృష్ణ ప్రసాదమున శక్తిని పొందిన తరువాతనే యుద్ధమున నరకు నోడింపగలిగినది. ఈ విషయము తెలియని చూపరులకు పై ఆశ్చర్యము కలిగించు అభిప్రాయములు కలుగవచ్చును కదా? శ్రీకృష్ణ దత్తమైన విల్లును గ్రహించి శక్తిని పొందకముందు సత్యభామ

బొమ్మ పెండ్లిండ్లకు బోనొల్లదు
మగవారి గనిన మరుగు జేరును
పసిడి యుయ్యల లెక్క భయమందును
నకుల కోలాహల స్వనము లోర్వదు
ప్రాకున తీగ గూర్పలేదు
ముత్యము గ్రువ్వజాలదు
చిలుకకు పద్యము సెప్పనేరదు
పలుకు మనిన బెక్కు పలుకదు.

"ఆ విల్లంది బలంబు నొందిన" తరువాతనో
రణరంగమునకు రా గలిగినది
పగవారి గెల్వ జూచినది
ఖగపతి స్కంధ మెక్క గలిగినది
పటహాభాంకృతుల కోర్వ గలిగినది
ఆలీఢాది మానముల నుండగలిగినది
బాణాసనము పట్ట గలిగినది
అల్లెత్రాటిని ధనుస్సునకు గూర్చ గలిగినది
నిపుణతతో శరము సంధించ గలిగినది
అస్త్రమంత్రము లెఱిగినది
సింహగర్జనము చేసినది.

హరి కరుణా విశేషముతో బలమునుపొంది పై విధముగా జేయ గల్గుటలో వ్యతిరేక మేమియు లేదుకదా? అందులకే పోతన చూపరులకు సత్యభామ "అనగ నొప్పె" యని సమర్థించుకొన్నాడు. "తంత్రీ వినోదంబు" అను నాచనసోముని సీసపద్యములో వ్యతిరేక అభిప్రాయముల సమర్థింపగల కారణము గోచరింపదు.

ఇదిగాక పోతనకథ నడపుటయందు చేసిన ఇంకొక గొప్ప చమత్కారము గమనింపదగినది. ఇది హాస్యరస కారకమైనది. భాగవతమందును హరివంశము నందును నరకుడాడిన పరిహాస వాక్యములలో గల తారతమ్యమును గమనింపుడు. హరివంశమున నరకుడు వేసిన బాణముచే శ్రీకృష్ణుడు మూర్ఛపోయెను. సత్యభామ యొనర్చిన పరిచర్యచే సేదదేరెను. ఆమెను యుద్ధముసేయుమని కోరెను. అప్పుడు నరకుడాడిన పరిహాస వాక్యములు శ్రీకృష్ణుని పరాక్రమమును కించపరచుచున్నవి.

చ॥ తన పనిమాని ఇంక యుపి... బురికొల్పి రణంబుసేయ బంచినను జయింప నోపునె ... యని

తాను మగవాడై యుద్ధము చేయక శ్రీకృష్ణుడు ఆడదానిని యుద్ధము చేయ బంపుట సిగ్గుచేటని నరకుడు ఎత్తి పొడిచెను.

శ్రీ మహాభాగవతమున పరిస్థితి వేరుగ నున్నది. హరి దత్తమైన పరాక్రమముచే సత్యభామ నరకుని చిత్తుగా నోడించెను. అతని సైన్యము ఆమె ధాటి కోర్వజాలక వెనుకకు మరలెను. అంతట శ్రీకృష్ణుడు సత్యభామ ఆహవ నైపుణ్యమును కొనియాడి, ఆమెకు ఆభరణములు బహుమానముగా నిచ్చి సంతోషపరచి తానిచ్చిన విల్లును వెనుకకు తీసికొనెను. అప్పుడు శ్రీకృష్ణు నుద్దేశించి నరకు డాడిన పరిహాస వాక్యములు పాఠకులకు నరకుని బలహీనతనే సూచించుచున్నవని తోపక మానదు. "తాను క్రిందబడినను తనదే పైచేయి" అన్నట్లు క్రింది పలుకులు అతని శక్తిహీనతను వ్యంగ్యముగా ధ్వనింపజేయుచున్నవి.

క॥ మగువ మగవారి ముందర
మగతనములు సూప రణముమానుట నీకున్
మగతనము గాదు, దనుజులు
మగువల దెస జనరు, మగల మగ లగుట హరీ!

భాగవతము 10-189

నరకాసురుడును అతని సైన్యము సత్యభామ ధాటి కోర్వలేక పోయిరి. ఆమెను యుద్ధవిరమణ చేయమని శ్రీకృష్ణుడు కోరుట నరకునకు లోలోన సంతోషము కలిగించెను. సత్యభామ యుద్ధము విరమించుటగని తేరుకున్న నరకుడు శ్రీకృష్ణుని గెలువగలనని భావించి ఎగతాళి చేయ బూనెను. "ఆడదైనను సత్యభామ మగవారైన రాక్షసులతో యుద్ధముచేసి మగతనము ప్రకటించుకొనుచుండగా కృష్ణుడు యుద్ధమునకు మగువను పంపి తాను యుద్ధము చేయకుండుట మగతనము గాదు. రాక్షసవీరులు మగలకు మగ లగుటచేత మగువలతో యుద్ధము చేయరు" అని శ్రీకృష్ణు యుద్ధము చేయుటకు పురికొల్పెను.

శ్రీకృష్ణుడు కేవలము పురుషుడు మాత్రమే కాదని పురుషోత్తముడని నరకుడు గ్రహింపలేదు. సత్యభామ శక్తియు శ్రీకృష్ణ దత్తమని గ్రహింపలేదు. పై నరకుని ఎత్తిపొడుపు మాటలు నిజముగా ప్రగల్భ వాక్యములనియు, తాను సత్యభామకే ఓడిపోయెననియు పాఠకులు గ్రహింపగలరు. శ్రీకృష్ణుని పరాక్రమము కించబడకుండునట్లు పోతన వ్యంగ్యముగా నరకునినోట ఎట్లు బలికించెనో గమనింపదగినది.

ఇట్లు కథా కథనమునందును, ఔచిత్యము పాటించుటయందును రసపోషణమునందును పోతన దిట్ట. అతని కతడే సాటి. నాటకీయత, నవ్యత పై కథయందు ఆరోపించ గలిగెను. కాన పోతన మహాకవి యగుటచే భాగవతమువంటి మహాపురాణము వ్రాయగలిగెను.

నరకాసురవధ అంతరార్థమును శ్రీరమణమహర్షి ఇట్లు తెలిపెను. వారు రచించిన తమిళ పద్యమునకు భావము

"నరక సదృశ శరీరగృహము నేనను అభిమానమే నరకుడు. ఆ యభిమానమును నిర్మూలించి తాను తానుగా ప్రకాశించుటయే దీపావళి."

# 25. కుచేలోపాఖ్యానము

## పోతన వ్యక్తిత్వము :-

పోతన జీవితమే ఒక భాగవతము. అతడు ప్రహ్లాద కుచేలాది భాగవత భక్తులతో తాదాత్మ్యము బొందియుండెడి భాగవత నైష్ఠికుడు. షష్ఠస్కంధమున సింగన సుకవినుతి యొనర్చుచు పోతనగూర్చి ఇట్లు వ్రాసెను.

ఉ॥ ఎమ్మెలు సెప్పనేల జగమెన్నగ పన్నగరాజశాయికిన్
సొమ్ముగ వాక్యసంపదలు సూరలు సేసినవాని, భక్తిలో
నమ్మినవాని, భాగవత నైష్ఠికుడై తగువాని బేర్మితో
బమ్మెర పోతరాజు గవి పట్టపురాజు దలంచి మ్రొక్కెదన్.

భాగవతము 6-12

కుచేలుడు శ్రీకృష్ణుని బాల్యసఖుడు, అతనిని ఖండోత్తరీయుడు, కుచేలుడు, పేదవిప్రుడు, దరిద్రపీడితుడు, కృశీభూతాంగుడు, జీర్ణాంబరుడని పోతన వర్ణించెను. అతని నామమునందే అతని దారిద్ర్యము కొట్టవచ్చిన ట్లగుపించుచున్నది. కాని అతడు మానధనుడు, విజితేంద్రియుడు, స్థితప్రజ్ఞుడు, విజ్ఞాని, రాగరహిత స్వాంతుడు, శాంతుడు, ధర్మవత్సలుడు, ఘనుడు, బ్రహ్మవేత్త యగుటచేత బ్రహ్మజ్ఞానికుండవలసిన లక్షణములన్నియు కుచేలునియందు మూర్తీభవించియుండెను. ఇట్టి లక్షణములే పోతనయందును గలవని గమనింపవలయును. కుచేలుని పాత్రయందు పోతనయే మన కగుపించును.

ఇంకను కుచేలుడు "దారిద్ర్యంబు బాధింపనొరుల గార్పణ్యావృత్తి నడుగబోవక దనకుదా వచ్చినట్టి కాసు పదివేల నిష్కములుగా దలంచి యాత్మ మోదించి పుత్ర దారాభిరక్ష యొక విధంబున నడపుచునుండు" వాడు. అట్లే పోతనకూడ దరిద్రుడైనను ఇతరుల యాచింపని ఆవేశి

గ్రహిందు. లభించినదానితో తృప్తి జెందెడివాడు. "సంతుష్టుడీ మూడు జగముల పూజ్యుండు" అని పోతన చెప్పెను. "నిజదార సుతోదర పోషణార్థమై" కవులు కర్షకవృత్తి నవలంబించినను, కందమూలములు తిని జీవించినను లోపములేదు. ఆకటికై పోతన కవితాకన్య నమ్ముకొని పడుపుకూడు తిన నిచ్చగింపడు. కుచేలునివలె దారిద్ర్యమునే వరించెను. సంపన్నాంధులకు దారిద్ర్యమే అంజనము.

శా॥ సంపన్నుండు డొరుగానలేడు, తనువున్ సంసారమున్ నమ్మి హిం
సింపన్ జూచు దరిద్రుడెప్పుడని కుక్షిభూతుడై చిక్కి హిం
సింపం డన్యుల నాత్మకున్ సములుగా జింతించు నటౌట త
త్సంపన్నాంధుల కంజనంబగు సుమీ దారిద్ర్య మూహింపగన్

భాగవతము 10-394

పోతనకు భోగభాగ్యములయం దాసక్తిలేదు. కుచేలునివలె పేదరికమునందే తృప్తి జెంది యుండెను. ధన మదాంధులైన రాజులయొద్ద కొలువు నాశింపలేదు.

సీ॥ కమనీయ భూమి భాగములు లేకున్నవే
పడియుండుటకు గూడి పరుపులేల
సహజంబులగు కరాంజలులు లేకున్నవే
భోజన భాజన పుంజమేల
వల్కలాజిన కుశావళులు లేకున్నవే
కట్ట దుకూల సంఘంబు లేల
గొనకొని వసియింప గుహలు లేకున్నవే
ప్రాసాద సౌధాది పటల మేల

గీ॥ ఫల రసాదుల గురియవే పాదపములు
స్వాదుజలముల నుండవే సకల నదులు
పొసగ భిక్షము వెట్టరే పుణ్యసతులు
ధన మదాంధుల కొలువేల తాపసులకు

భాగవతము 2-21

రాజులను "ఇమ్మనుజేశ్వ రాధములు" అని నిరసించెను.

మ॥ కారే రాజులు రాజ్యముల్ గలుగవే గర్వోన్నతిం జెందరే
వారేరీ! సిరి మూటగట్టికొని పోవం జాలిరే?

భాగవతము 8-590

అని సిరిసంపదలు చనిపోవునప్పుడు వెంటరావను సత్యము వెల్లడించెను. అందులకే వసురాయకవి పోతన కవిత్వమును గూర్చి ఆశ్చర్యమును వ్యక్తపరచెను.

"బ్రతుకుపై యాసకూడను బాడునేయు
ఘోర దారిద్ర్య దుఃఖంబు గుడుచు చకట
ఏ గతిని బల్కె పోతన్న భాగవతము?

కుచేలుని భార్య పతివ్రతా తిలకము వంశాభిజాత్య. దుస్సహ దరిద్రబాధకు ఓర్వలేని సంతానము గతినితిలకించి తన పతితో దారిద్ర్య బాధ దీర్పు నుపాయ మూహింపుమని, బాల్యసఖుడైన శ్రీకృష్ణు నాశ్రయింపుమని, మనయోక్తుల బలికెను. శ్రీకృష్ణుని దర్శించుట "యిహ పర సాధనమగు"నని కుచేలుడు భావించి అటుకులు మూట గట్టుకొని శ్రీకృష్ణ సందర్శనార్థ మేగెను. కుచేలునకు శ్రీకృష్ణు డిచ్చు భాగ్యము కంటె శ్రీకృష్ణ సందర్శన భాగ్యమే ఎక్కువ. అందువలన "జనియె గోవింద దర్శనోత్సాహి యగుచు"

దారిలో కుచేలున కనేక సందేహములు కలిగినవి. ఒకవేళ బడుగు బాపడని ద్వారపాలకు లడ్డగించిన వారిని సంతృప్తిపరచుటకు తా నర్థశూన్యుడు కదా? శ్రీకృష్ణ దర్శన భాగ్యమెట్లు లభింపగలదు? కుచేలుని మనసున దోచిన సమాధానము పరికింపుడు.

తే॥ ఐన నాభాగ్య మతని దయార్ద్రదృష్టి
గాక తలపోయగా నొంకుగలదె? యాత
డేల నన్నుపేక్షించు. నేటిమాట
లనుచు ద్వారకాపుర మతడు సొచ్చి భాగవతము 10-976

"సంశయాత్మా వినశ్యతి. తనకీ యనుమానము లేల?" తాను భక్తుడు శ్రీకృష్ణుడు భక్తవత్సలుడు. అతని దయార్ద్రదృష్టి దక్కు టతరము తన కందగాలేదు. భగవంతుడు తన దర్శనము ప్రసాదింపక నేల ఉపేక్ష చేయును. అని కుచేలుడు మనస్సును కుదుట బఱచు కొనెను. భక్త కుచేలుడు భావించినట్లే అతనికి ఏ అడ్డు తగులలేదు. ద్వారపాలకు లడ్డుపడలేదు. అతడు రాజమార్గమున పయనించి కక్ష్యాంతరములను ఏ అడ్డు లేక దాటి శ్రీకృష్ణుని దర్శించెను.

"ఇట్లు ప్రవేశించి రాజమార్గంబునన్ జని చని కక్ష్యాంతంబులు గడచి చని ముందట" అని వ్రాసి పోతన ద్వారపాలకు లడ్డగించు ప్రశక్తియే చేయలేదు. ఎందులకు? రాజ ప్రాసాదమునకు ద్వారపాలకు లుండరా? అను ప్రశ్న రాక మానదు.

రాజమార్గమును ప్రవేశించె ననుటచేత రాజయోగము (లేదా భగవద్గీతలోని రాజవిద్యా రాజ గుహ్యయోగము) ననుసరించి సుషుమ్నా మార్గముద్వారా పయనించెననియు అధః కుండలిని అధిగమించి ఆజ్ఞాచక్రమును చేరి ఇంద్రియములను మనస్సును వశపరచుకొనెననియు, ఊర్ధ్వ కుండలిలోని నవచక్రము లనబడు కక్ష్యాంతరముల దాటి ఆత్మసాక్షాత్కారము పొందెననియు చెప్పవచ్చును.

కుచేలున కెట్లు భగవద్దర్శనము కలుగుటయందు సందేహము లేదో అట్లే పోతన దృష్టిలో కూడ మోక్షము సిద్ధించుటయందు అనుమానము లేదు. తాను "శ్రీ కైవల్య పదంబు జేరుటకునై" చింతించెను. తాను నిమిత్తమాత్రుడు. శ్రీహరి సూత్రధారి. భాగవతమును పలికించినవాడు రామభద్రుడు. శ్రీరాము డతనిని సాక్షాత్కరించి "ఏను రామభద్రుండ. మన్నామాంకితంబుగా శ్రీ మహాభాగవతము తెనుంగు చేయుము. భవ బంధంబులు తెగు"నని యాన తిచ్చెను. పోతన "శ్రీ మహాభాగవత పాదప పారిజాత సమాశ్రయంబునను హరి

కరుణా విశేషంబునను గృతార్థత్వంబు సిద్ధించె"నని బుద్ధి నెఱిగెను. భాగవతమును తెనిగించి పునర్జన్మము లేకుండ తన జన్మను సఫలము చేసికొనెను. అట్లే కుచేలుడు శ్రీకృష్ణ దర్శనభాగ్యము తనకు తప్పక కలుగునని భావించెను. ఆత్యంతిక భక్తుడైన కుచేలుడు భారమంతయు శ్రీహరిపై వదలెను. అందువలన ఏ అడ్డులేక కక్ష్యాంతరముల దాటెను.

ఈ సన్నివేశములో భారతము నాంధ్రీకరించిన తిక్కన వాక్యములలోని అభిప్రాయమును గమనింతము. తిక్కనకూడ పోతనవలె అభేదభక్తినే పాటించి హరిహరనాథుని స్తుతించెను.

శ్లో॥ కిమస్థిమాలా కిము కౌస్తుభం వా
పరిష్క్రియా యాం బహు మన్యసే త్వం
కిం కాలకూటః కింవా యశోదా
స్తన్యం తవస్వాదు వద ప్రభో మే

హరిహరనాధుడు స్వప్న దర్శన మిచ్చెను. (పోతన ధ్యానమగ్నుడైనపుడు శ్రీరాముడు దర్శన మిచ్చెను.) తాను అల్పజ్ఞుడయ్యు మోక్షఫలము నాశించెను. తలపై కిరీటముంచిన రీతిని మోక్ష మొసగుటకు వీలులేదు కదా? ఇంద్రియ మనోనిగ్రహములు ఆవరణ నాశము కలుగవలెను. వీనిని సాధించుటకు కర్మ భక్తి జ్ఞానమార్గముల నవలంబించి పరిణత దశకు చేరుకొనవలెను. అందువలన హరిహరనాథు డతనికి సంసారమునుండి దూరము తొలగు మార్గము కనుగొను వెలుగును మాత్రము ప్రసాదించెను. మోక్షమును ఇవ్వలేదు.

తే॥ జనన మరణాదులైన సంసార దురిత
ములకు నగుపడ కుండంగ దొలగు తెరువు
గను వెలుంగు నీ కిచ్చితి

అని హరిహరనాథుడు తెలిపెను. కాని పోతనకు శ్రీరాముడు తగుపించి "శ్రీ మహాభాగవతంబు దెనుంగు సేయుము. భవ బంధములు తెగు"నని యానతిచ్చెను.

ఇదిగాక ఇంకొక రహస్యము శుద్ధ సత్వగుణముగల సనకస
నందనాదులు శ్రీహరిని దర్శింప వైకుంఠమున కేగినపుడు రజస్తమో
గుణములుగల జయ విజయు లడ్డగించి వారిచే శపింపబడిరి. వారే
కుంభకర్ణ రావణులుగను, హిరణ్యాక్ష హిరణ్యకశిపులుగను శిశుపాల
దంతవక్త్రులుగను జన్మించిరి. భాగవత పఠనమువలన రజస్తమోగుణ
పరిహారిణియగు భక్తి సంభవించును. కుచేలుడు భాగవత శిఖామణి
యగుటచేత రజస్తమోగుణములను జయించి ఇంద్రియ మనోనిగ్రహ
ముల సాధించిన ఉత్తమాధికారి, శుద్ధసత్వగుణ సమన్వితుడు. అందు
వలన శ్రీకృష్ణ దర్శనము (లేక ఆత్మ సాక్షాత్కారము) పొందుటకు
అడ్డులేకపోయినది. కుచేలుని శ్రీకృష్ణ మందిర ద్వారపాలకులు అడ్డ
గింపలేదని పోతన చెప్పలేదు. చెప్ప నవసరములేదు. కుచేలుడు,
పోతన, పరీక్షిత్తు అర్థ కామముల సన్యసించినవారు. అందువలన
పోతన, కుచేలుడు తమకు బ్రహ్మ సాక్షాత్కారము తప్పక కలుగునని
భావించిరి.

చూడవచ్చిన కుచేలుని శ్రీకృష్ణు డతిథి సత్కారముల బూజిం
చెను. రుక్మిణీదేవి వింజామరలచే వీచెను. కుచేలుని పూర్వజన్మ సు
కృత మేమని వర్ణింపవచ్చును? తరువాత శ్రీకృష్ణుడు ప్రాస్తావికము
గా కుచేలుడు తన సహపాఠిగానున్న దినములలో గురువుయింట జరి
గిన విషయములను జ్ఞప్తికి దెచ్చెను. భార్య అనుకూలవతిగా నున్నదా?
యని తొలుత ప్రశ్నించెను. తరువాత కుచేలుని నిస్సంగత్వము
తెలుపుటకై ఇట్లనెను.

సీ॥ తలప గృహక్షేత్ర ధన దార పుత్రాదుల
యందు నీ చిత్తంబు చెందకుంట
తోచుచున్నది; ఏను దుది లోక సంగ్రహా
ర్థంబు కర్మాచరణంబు సేయు

తే॥ గతి మనంబుల గాను మోహితులు గాక
యర్థిమె యుక్త కర్మంబు లాచరించి
ప్రకృతి సంబంధములు వాసి భవ్యనిష్ఠ
దవిలియుందురు కొందరుత్తములు భువిని.

భాగవతము 10-990

తామరాకుపై నీటి బిందువువలె కుచేలుడు సంసారము నంటక యుండెను. ఓడ సముద్రమున తేలియుండవలయునే గాని సముద్రము నీరు ఓడలో ప్రవేశింపరాదు. కొందరుత్తములు ఇట్లు జీవితము గడపుదురు పోతనయు ఇట్టి ఉత్తమ వర్తనము గలవాడే.

శ్రీకృష్ణుడు స్వయముగా విజ్ఞాన ప్రదుడైన గురువయ్యు, గురుభజనంబు పరమ ధర్మంబని భావించి కుచేలునితో గూడి సాందీపునను గురువును సేవించెను. త్రిజగద్గురువైన శ్రీకృష్ణుడు గురువును ధర్మమని సేవించుటయు, తాను రాజయ్యు దరిద్రుడగు కుచేలునితో స్నేహితము సేయుటయు గమనింపదగినవి.

ఒకనాడు సాందీపు దూరలేనపుడు అతని భార్య శ్రీకృష్ణకుచేలురను, అరణ్యమున కరిగి కట్టెలు గొనితెమ్మని కోరెను. వారు అరణ్యమున కేగి అచట గాలివానలో చిక్కుకొని కదలలేక యుండగా తెల్లవారు సమయమున వారిని వెదకుచు గురువగు సాందీపు డరుదెంచి "శిష్యులై కష్టములకోర్చి ఋణంబు దీర్చుకొంటిరి. మీకు ధన బంధు దార బహుపుత్ర విభూతి జయాయు రున్నతల్ సమకూరెడి" అని దీవించెను. శ్రీకృష్ణుడు కుచేలున కీ విషయమును జ్ఞప్తికి తెచ్చి "నీకు గురు దీవన ఫలించినదా?" అని ప్రశ్నించెను. శ్రీకృష్ణున కేమో గురుదీవన ప్రకారము సకలసంపద లొప్పియుండెను. కుచేలుడు దరిద్రుడు గనేయుండెను. అందువలన శ్రీకృష్ణుని ప్రశ్నకు బదులుగా కుచేలుడు "సాభిప్రాయంబుగ" బలికిన పలుకులు గమనింపుడు.

క॥ గురుమతి దలపగ త్రిజగ
ద్గురుడవనం దగిన నీకు గురుడనగా నొం

దొరు డెవ్వ డింతయును నీ
కరయంగ విడంబనంబు యగుగాదె హరీ:

భాగవతము 10-1005

గురువులకు గురువై సంపద లిచ్చువాడు శ్రీకృష్ణుడైన నీవే కదాయని పై మాటలలో స్ఫురించుచున్నది. ఆ మాటలువిని "సమస్త భావాభిజ్ఞుండై"న శ్రీకృష్ణుడు "నీవు భక్తితో నాకేమి యుపాయనంబు దెచ్చితివి. ఆ పదార్థము కొంచెమైనను బదివేలుగ నంగీకరింతును. భక్తిలేని నీచవర్తనుడు హిమాచల తుల్యమైన పదార్థ మొసంగినను నాకు సమ్మతముగాదు.

కII దళమైన పుష్పమైనను
ఫలమైనను సలిలమైన బాయని భక్తిన్
గొలిచిన జను లర్పించిన
నెలమిన్ రుచిరాన్నముగనె యేను భుజింతున్

భాగవతము 10-1010

అని తెలిపెను. పై పద్యమును స్ఫురించు శ్లోకము భగవద్గీత లోను కలదు.

శ్లో॥ పత్రం పుష్పం ఫలం తోయం యోమే భక్త్యా ప్రయచ్ఛతి
తదహం భక్త్యుప హృతం అశ్నామి ప్రయతాత్మనః

కుచేలు డటుకుల నిచ్చుటకు సిగ్గుపడి యూరకున్న "అవ్విప్రుండు నను దెచ్చిన కార్యంబు కృష్ణుండు దనదివ్యచిత్తంబున నెఱింగి యతండు పూర్వభవంబున నైశ్వర్యకాముండై నన్ను సేవింపడైన నిక్కుచేలుండు నిజకాంతా ముఖోల్లాసంబు కొరకు నా యొద్దకు జనుదెంచినవా" డని తలచి అటుకులను కొన్ని తానే తీసికొని "ఆ యటుకులే సకల లోకంబులను, నన్నును బరితృప్తి బొందింప జాలు"నని పలికి వాని నారగించెను. దానిచే కుచేలునకు సర్వ సంపదలు కలిగెను. కాని, కుచేలునకు ఈ విషయము తెలియదు. తా నారాత్రి కృష్ణుని అతిథ్యమును

స్వీకరించి నిజపురంబునకు బయలుదేరెను. తనకు శ్రీకృష్ణ సందర్శన భాగ్యమబ్బినందులకు సంతోషించెను. అతని పరిచర్యలను కొనియాడెను.

సీ॥ పరికింప గృపణ స్వభావుండ నైనట్టి
యేనెఁద? నిఖిలావనీశ్వరియగు
నిందిరాదేవికి నెనయంగ నిత్యని
వాసుడై యొప్పు నవ్వాసుదేవు
డేఁద? నర్థిమై దోడబుట్టినవాని
కైవడి కౌగిట గదియ జేర్చి
దైవంబుగా నన్ను భావించి నిజతల్ప
మున నుంచి సత్క్రియల్ పూని నడపి

తే॥ చారు నిజ వధూ కర సరోజాత కలిత
చామరానిలమున గతశ్రమునిజేసి
శ్రీ కుచాలిప్త చందనాంచన కరాబ్జ
తలములను నడ్గులొత్తు వత్సంత మెఱసి.

భాగవతము 10-1917

కావున,

ఉ॥ శ్రీనిధి ఇట్లు నన్ను బచరించి ఘనంబుగ విత్తమేమియు
నీని తెఱంగు గానబడె; నెన్న దరిద్రుడు సంపదంధుడై
కానక తన్ను జేఁడని కాక శ్రితార్తి హరుండు సత్కృపాం
భోనిధి సర్వవస్తు పరిపూర్ణునిగా నను జేయకుండునే!

భాగవతము 10-1919

అని తన మనంబున వితర్కించెను. ఒకవేళ తాను సంపదంధుడై శ్రీహరిని గొల్వడని భావించిన కృష్ణుడు సంపద లీయ దలంపడేమోనని కుచేలుడు భావించెను. కుచేలుడు ఇల్లు చేరగనే తనకు సర్వ సంపదలు హరి కరుణా విశేషంబున నొనగూడెనని కనుగొనెను.

పోతన కూడ తన దారిద్ర్యము శ్రీకృష్ణుడు బాపకుండుటకు కారణము తాను ధనమదాంధుడై శ్రీహరిని చింతింపడని అట్లొనర్చియుండునని భావించెను. "సంపన్నాంధుల కంజనంబగు సుమీ దారిద్ర్యమూహింపగన్" అని రచించెను.

కుచేలుడు సతీసమేతుడై నిఖిల భోగంబులయం దాసక్తినొందక రాగాది విరహితుండును నిర్వికారుండునునై అఖిల క్రియల యందును అనంతుని అనంత ధ్యాన సుధా రసంబునన్ జొక్కుచు విగత బంధనుండై యపవర్గ ప్రాప్తి నొందెను. పోతనయు పై విధముగనే తన జీవితకాలము గడిపెను.

పై విధముగా కుచేలోపాఖ్యానము పోతన నిరాడంబర జీవితమున కద్దము పట్టినట్లుండి అతని వ్యక్తిత్వము జాటుచున్నది. భాగవత పాత్రలతో ఆయన తాదాత్మ్యము గమనింపదగినది.

కుచేలోపాఖ్యానమున గమనింపదగిన విషయములు :-

1) భక్తి విఖ్యులైన సజ్జనులు లేశ మాత్రంబగు పదార్థంబైన భక్తి పూర్వకంబుగా సమర్పించిన దానిని కోటి గుణితంబుగ కృష్ణుడు గ్రహించును.

2) ధనమదము గలవాడు శ్రీహరిని విస్మరించును.

3) భగవద్భక్తితో గడపు సాత్విక జీవన ముత్తమమైనది.

4) సంపదలు గలిగినను కుచేలుడు తనకు మనోవికారము లంటకుండ జాగ్రత్తపడెను.

# 26 ఉద్ధవునకు శ్రీకృష్ణుడు పరమార్థోపదేశము చేయుట

శ్రీకృష్ణ నిర్యాణమునకు ముందు ఉద్ధవుడు పరమార్థోపదేశము చేయుమని శ్రీకృష్ణుని కోరెను. అప్పుడు శ్రీకృష్ణు డుపదేశించిన భక్తి, ధ్యాన మార్గంబులు గమనింపదగినవి.

1) "నీ రూపం బేలాగున గానవచ్చు"నను ఉద్ధవుని ప్రశ్నకు శ్రీకృష్ణుని సమాధానమును చూడుడు.

"భక్తి భావ పరాయణుండై కృపారస తత్పరుండై మిత భాషణుండై బొంకక కర్మంబులు మదర్పణంబు నేసి యతండు భాగవతుం డనం బరగు. మత్కథలను మజ్జన్మ కర్మంబులను వినుచు మత్సేవకులైన భాగవతులం జూచి తన గృహంబునకు గొనిపోయి మజ్జన పూజన భోజన శయ నాసనాదికంబుల బరితుష్టులంజేసిన యతండైనను భాగవతుం డనబడు. ఇట్లెంతకాలము జీవించు నంతకాలంబును నడపు నతండు మద్రూపంబున వైకుంఠ నిలయంబు నొందు" భాగవతుల కర్తవ్యమిందు గోచరించుచున్నది. (భాగవతము 11-90)

2) ధ్యానమార్గం బేరీతియాన తీయవలయుననిన హరి ఇట్లనియె "ఏకాంత మానసులై హ[illegible]బ్జంబు లూరు ద్వయంబున సంధించి నాసాగ్రంబున నీక్షణంబు నిలిపి ప్రాణాయామంబున నన్ను హృదయ గతుం గా దలంచి అష్టాదశ ధా[illegible] యోగసిద్ధు లెఱింగి [illegible]ణిమాదులు ప్రధాన సిద్ధులుగా దెలిసి. [illegible]యింద్రియంబుల బంధించి మనం బాత్మ యందు జేర్చు నాత్మతో గ[illegible] బ్రహ్మపదంబు బొం[illegible] భగవత్సేవ లితర ధర్మంబుల [illegible] గాంతురు." భాగ. ము 11-90

# 27. మార్కండేయోపాఖ్యానము

## హరిహరా భేదము :-

మార్కండేయోపాఖ్యానము ద్వాదశ స్కంధాంతమందు కలదు. భాగవతారంభమున పోతన తాను మహేశ్వర ధ్యానము సేయగా శ్రీరాము డగుపించి, శ్రీకృష్ణ చరితమైన భాగవతమును వ్రాయుమని కోరెను. ఇట్లు హరిహరులకు అభేదమని సూచించెను. మార్కండేయోపాఖ్యానమున ఈ అభేదభక్తియే గానవచ్చుచున్నది.

మృకండు డను మహర్షి బ్రహ్మచర్య వ్రతుడై సంతానార్థియై హరిం దలంచుచు తప మొనర్పగా హరిహరులు ప్రత్యక్షమై వరం బడుగుమనిరి. అతడు గుణాఢ్యుడగు కుమారుని వరముగా కోరెను. అమ్మునికి మార్కండేయు డుదయించెను. మార్కండేయుడు వినయనిష్ఠాగరిష్ఠుడై యుండ మృత్యువతని పాశబద్ధు జేసెను. మృత్యువును ధిక్కరించి పదివేల హాయనములు తపంబు జేసెను. అంత శ్రీహరి దర్శన మిచ్చి శరీరముతోడనే అనేక యుగములు బ్రదుకునట్లు వర మొసంగెను.

మార్కండేయుడు శివపూజ చేయుచు హరి స్మరణము చేయ మరచెను. నూరు సంవత్సరములు వర్షము గురిసి అంతయు జలమయంబై అంధకార బంధురమయ్యెను. జల మధ్యంబున వటపత్రశాయియగు బాలుని గని అతని శరీరము ప్రవేశించి చాలకాలముండి అతని చరణారవింద సంస్మరణంబున బయట పడెను. అంత బాలు డంతర్ధానమందెను. మార్కండేయుడు తన ఆశ్రమమున తపము సేయుచుండగ శంకరుడును పార్వతియు అతని జూడ వచ్చిరి. తపోనిష్ఠలో నున్న అతని హృదయాంతరమున దర్శనమిచ్చిరి. ముని వారిని స్తుతించెను. పరమ శివుడాతనిని పరమ శైవుండని పొగడెను. అంత మార్కండే

యుడు "దేవా! హరిమాయా ప్రభావంబు దుర్లభంబు. అయ్యది శివ త్వం దర్శనంబునన్ గంటి"నని తెల్పెను. నారాయణ చరణాంబుజ ధ్యానమును మృత్యుంజయమును వరములుగా గోరెను. కల్పకోటి పర్యంత మాయువును ప్రసాదించి పురుషోత్తముని యనుగ్రహము కలుగునని శివుడు దీవించెను.

ఈ కథలో శివకేశవు లిద్దరు మార్కండేయుని అనుగ్రహించిరి. ఈ భద్రమువందు రుద్రుడు సర్వాంతర్యామిగా అన్నిటియందున్నట్లు చెప్ప బడినది. విష్ణు వనగా సర్వాంతర్యామి యగు జగత్త్రయము వ్యాపించిన వాసుదేవుడు. "నమో రుద్రాయ విష్ణవే మృత్యుర్మే పాహి"యని కోర బడినది. అందువలననే ఈ కథ హరిహర అభేదమును సూచించు చున్నది.

# 28. భాగవతము - భక్తిరస పోషణము

భక్తి రసమా? భాగవతము భక్తి ప్రధానమైన గ్రంథము. నవ రసములనేగాక భక్తినికూడ రసముగా పరిగణింపవచ్చునా? ప్రాచీనా లంకారికులగు విశ్వనాథ కవిరాజు, మమ్మటుడు, జగన్నాథ పండితుడు, హేమచంద్రుడు మొదలగువారు భక్తిని ఒక భావముగా పరిగణించిరి. దానికి రసత్వసిద్ధి నాపాదింపరైరి "ఆపో జ్యోతి రసో అమృతం బ్రహ్మ" "రసో వై సః" ఇత్యాది వేద ప్రమాణములచే భగవంతుడు రస స్వరూపుడని చెప్పబడినది. అందువలన రూపగోస్వామి, మధుసూదన సరస్వతి భక్తిని రసరాట్టుగా నిరూపించిరి.

శ్లో॥ కాంతాది విషయావా యే రసా ద్యా స్తత్ర నేదృశమ్
రసత్వం పుష్యతే పూర్ణ సుఖాన్ స్పర్శత్వ కారణాత్
పరిపూర్ణ రసా క్షుద్ర రసేభ్యో భగవ ద్రతిః
ఖద్యోతేభ్య ఇవాదిత్య ప్రభేవ బలవత్తరా.

"కాంతాది లౌకిక విషయములయందలి రసములయందు భగవద్రతియందువలె సంపూర్ణానందము కలుగదు. అవి క్షుద్ర రసములు. భగవద్రతి పూర్ణరసము మిణుగురుపురుగు కాంతికంటె సూర్యకాంతి అనేక రెట్లు తేజోవంతమగునట్లు క్షుద్రరసముకంటె భగవద్రతి తేజోవంతము" అని మధుసూదన సరస్వతి భక్తిని రసరాట్టుగా స్థాపించెను. భగవదవతార చిత్తవృత్తిగల భక్తిరసమునందు నిరవధిక ఆనందానుభవము కలుగుచున్నది. ఇతర రసములయందలి ఆనందానుభూతి క్షణికము. అందువలన భక్తియే రసములకు రాజని చెప్పవచ్చును.

భాగవతమున నవరసములు చక్కగా పోషింపబడినవి. కంసవధయందు వీరరసము. నృసింహావిర్భావమున రౌద్రాద్భుత రసములు. శ్రీకృష్ణుని నోటిలో విశ్వమును జూపుటయందు అద్భుతరసము ... ని పరిశీలించుటయందు హాస్యరసము. అశ్వత్థామను అవమానించుట

యందు భీభత్స భయానక రసములు, కుచేలోపాఖ్యానమున శ్రీకృష్ణ నిర్యాణమున కరుణరసము, ప్రహ్లాద చరిత్ర యందు శాంతరసము, రుక్మిణీకల్యాణము రాస కేళులయందు శృంగారరసము, నరకాసురవధ యందు వీర శృంగార భయ రౌద్ర విస్మయములు పోషింపబడినవి. కాని భక్తిరస మీ కథలయం దంతర్వాహినియై యున్నది. నవరసములు భగవత్కైంకర్యరూపములై భక్తికి దాసోహ మనినవి.

పోతన తెలుగు శుకయోగియని పేరు గాంచెను. వల్లభాచార్యుని, చైతన్యుని మధురభక్తికి జీవము పోసెను. భారతము "నానా రసాభ్యుదయోల్లాసి" కాగా భాగవతము "భక్తి రసాభ్యుదయోల్లాసి" యనవచ్చును. సంస్కృత భాగవతమును విపులీకరించి పోతన భక్తి రసమును చక్కగా పోషించెను. కొందరు పోతన మధురభక్తి శ్రుతి మించి అసభ్యముగా నున్నదని భావింతురు. పోతన "రసికుడు" అని కొందరి భావన.

పరమాత్మయైన శ్రీకృష్ణుడు గోపికలతో రమించుట అధర్మము. అవినీతి యని వారి వాదన.

ఉదాహరణమునకు "అని యిటు కుసుమ శరుని శర పరంపరా పరవశలై యోపికలు లేక పలికిన గోపికల దీనాలాపంబుల విని నవ్వి యోగేశ్వరేశ్వరుండైన శ్రీకృష్ణు డాత్మారాముండై వారలతో రమించె నప్పుడు,

మ॥ కరుణాలోకములన్, భుజాంచల కచాకర్షంబులన్, మేఖలా
కర బాహుస్తన మర్శనంబుల, నఖాంక వ్యాప్తులన్, నర్మ వా
క్పరిరంభంబుల, మంజులాధర సుధా పానంబులన్, గోపికన్
గరగించెన్ రతికేళి కృష్ణుడు గృపం గందర్పు బాలార్చుచున్

భాగవతము 10-1002 పూర్వభాగము

తరువాత "వెన్నుం డింద్రియ స్ఖలనంబు సేయక గోపికంతో

రమించె"నని శుకుడు తెలిపెను. ఇంత అసత్యముగా లేకుండ కృష్ణుడు గోపికలతో రమించుటను ఎంతో జాగరూకతతో ఎఱ్ఱాప్రగడ వర్ణించె నవి హరివంశమునుండి క్రింది పద్యమును కొందరు ఉదాహరింతురు.

మ॥ లలితాలోకములన్, మనోజ్ఞ మధురాలాపంబులన్, విస్ఫుర
త్కలహాసంబుల, బంధుర స్తనభరోత్తానంగ సంగంబులన్,
విలస ద్వక్త్ర సరోరుహార్పణములన్, స్నిగ్ధోరు సంవేష్టనం
బుల, బూజించిరి గోపభామలు జగత్పూజార్హు దాశార్హునిన్

శ్రీకృష్ణుడు ధర్మవర్తనము నతిక్రమించెనను సందేహము పరీక్షితునకే కలిగి శుకుని ప్రశ్నించెను.

మత్త॥ ధర్మకర్తయు ధర్మభర్తయు ధర్మమూర్తియు నైవ స
త్కర్మ దీక్షు డధర్మశిక్షయు ధర్మరక్షయు జేయగా
నర్మిలిన్ ధరమీదబుట్టి పరాంగనాజన సంగ మే
ధర్మమంచు దలంచి జేసె నుదాత్తమానస చెప్పవే.

భాగవతము 10-1102 పూర్వభాగము

శుకు డిట్లు బదులు చెప్పెను.

ఆ॥ సర్వభక్షి డగ్ని సర్వంబు భక్షించి
దోషిగాని పగిది దోషమైన
జేసి దోషపదము జెందరు తేజస్వు
లగుట చంద్రవాస వాదు లధిప॥

భాగవతము 10-1104 పూర్వభాగము

ఆ॥ గోపజనము లందు గోపికలందును
సకల జంతు లందు సంచరించు
నా మహాత్మునకు పరాంగన లెవ్వరు
సర్వమయుడు లీల సలిపెగాక.

భాగవతము 10-1108 పూర్వభాగము

ఇది కృష్ణలీల. అందులకే "హరి సంతత లీలల నామరూపముల్

దవిలి చరించు మానవులు దార్కిక చాతురి ఎంత గర్గియున్ మిగిలి కుతర్కవాదముల మేరలు మీరి ఎఱుంగ నేర్తురే" అని పోతన పాఠకులను తొలుతనే హెచ్చరించెను.

మ॥ సిరి చాంచల్యముతోడి దయ్యు దనకుం జీవేశ్వరుండంచు నే
షరుష శ్రేష్ఠు వరించు, నట్టి పరమున్ బుద్ధిన్ విలోకంబులన్
గర యుగ్మంబుల గౌగిలించిరి సతుల్. గల్యాణబాష్పంబు లా
ఽరణ శ్రేణులుగా ప్రతిక్షణ నవ ప్రాప్తానురాగంబులన్.

భాగవతము 1-270

ఇదిగాక గోపికల కామచేష్టలు శ్రీకృష్ణుని చలింపజేయలేదు.

ఉత్ప॥ పంచబాణుని పీరు సేసిన భర్గునిన్ దనవిల్లు వ
ర్జించి మూర్ఛల జేయజాలు విశేషహాస విలోక నో
దంచి తాకృతులయ్యు గాంతలు దంభచేష్టల మాధవుం
జంచలింపగ జేయ నేమియు జాలరైరి బుధోత్తమా!

భాగవతము 1-271

"ఇవ్విధంబున సంగ విరహితుండైన కంసారి సంసారి కైవడి విహరింప, అజ్ఞాన విలోకులైన లోకులు లోకసామాన్య మనుష్యుండని తలంతురు. ఆత్మాశ్రయమైన బుద్ధి ఆత్మయందున్న ఆనందాదులతో గూడియు, ఆ ప్రకృతి గుణంబులైన సుఖదుఃఖంబులన్ జెందక యుండు" —భాగవతము 1-272

ఇట్టి శ్రీకృష్ణ లీలలను భక్తిభావముతో గ్రహింపవచ్చును గాని తర్కముచే గ్రహింప వీలుకాదని ముందుగనే పోతన హెచ్చరించెను.

ఉ॥ ఇంచుక మాయలేక మదినెప్పుడు బాయని భక్తితోడ వ
ర్తింపుచు నెవ్వడేని హరి దివ్య పదాంబుజ గంధరాశి సే
వించు నతం డెఱుంగు నరవింద భవాదులకైన దుర్లభో
దంచితమైన యా హరి యుదార మహాద్భుత కర్మమార్గముల్

భాగవతము 1-71

"గుతర్కకృతమోహితచేత నజ్ఞతం బొరసిన యప్పుడు అవ్వీటుని మూర్తి గనుగొనలేరు"

—భాగవతము 2-111

కం॥ హరి సురుచిర లలితాకృతి
దరుణులు గని ముక్త విరహతాప జ్వరులై
పరమోత్సవంబు సలిపిరి
పరమేశ్వరు గనిన ముక్తబంధుల భంగిన్

భక్తి భవబంధ విముక్తిని లక్షించినది కాని ఇంద్రియ తృప్తిని లక్షించలేదు.

"నైవస్త్రీ నపుమానేవ నైవచాయం నపుంసకః" దేవీగీత. భగవంతుడు పురుషుడు కాడు, స్త్రీ కాదు, నపుంసకుడు కాదు. అట్టి నిర్గుణ పరబ్రహ్మయగు శ్రీకృష్ణుని గోపికలు సగుణునిగా ప్రేమించిరి. ఎందుకనగా నిర్గుణము నిరుపాధికము అగు జ్ఞానము పొందుట మూఢులగు గోపికలకు సాధ్యముకాదు కదా? కామము ఇంద్రియార్థమైనప్పటికిని ఈశ్వర పరమైనపుడు నిష్కామమే యగును.

"Devotion is sublimation of sex instinct"

— FREUD

మీరాబాయి "కల్యాణ మాడెనమ్మా శ్రీహరి" శ్రీకృష్ణుడు తన్ను పెండ్లాడినట్లు భావించెను. శ్రీరామకృష్ణ పరమహంస తాను గోపికలను కాళీమాత శ్రీకృష్ణుడుగను భావించెను. జయదేవుని అష్టపదులలో భక్తి శృంగారము గానవచ్చుచున్నది.

గోపికలు ఇంద్రియార్థమైన ప్రేమను ఈశ్వరపరము జేసిరి. "ఇంద్రియంబు లీశ్వర విషయంబులైన మదిసంచిత నిశ్చలతత్త్వమై వచో" అను భాగవత భక్తి రహస్యము వారిలో వర్తించును. "భగవద్గీతయందును "తస్మాదింద్రియాణ్యాదౌ నియమ్య భరతర్షభ?" అని శ్రీకృష్ణుడు కోరెను. ఇంద్రియము లీశ్వరపరము జేసి నియమించమని

భాగవతము ఇంద్రియ జయమునకు సులభోపాయము సూచించినది. అందుకే గోపికలు భగవంతునియందు పతిపుత్రాదిక వాంఛలు విలుపు కొనుట న్యాయమని వాదించిరి.

మ॥ పతులన్ బిడ్డల బంధులన్ సతులకున్ బాటించుటొ దర్మ వ
ద్దతి యౌనంటివి దేహధారిణులకున్, దర్మజ్ఞ! చింతింపుమా
పతి పుత్రాదిక నామమూర్తి వగుచున్ భాసిల్లు నీయందు ద
త్పతి పుత్రాదిక వాంఛలన్ సలిపి సంభావించు టన్యాయమే?

భాగవతము 10-987

నీవే పతిపుత్రాదుల రూపముల నుంటివి. నీయందు పతి పుత్రాదికమైన కోర్కెలనుంచుట అన్యాయమా?" అని గోపికలు ప్రశ్నించిరి.

శ్రీకృష్ణుడు సామాన్య మానవుడు కాదు. అనేకవేల మందిని పెండ్లి యాడెను.

శ్లో॥ చిత్రం బతై తదేకేన వపుషా యుగపత్ పృథక్
గృహేషు ద్వ్యష్ట సాహస్రం స్త్రియ ఏక ఉదావహత్

— 10-69-2

ఒకే కాలములో 16 వేల గోపికల ఇండ్లయందు శ్రీకృష్ణుడుండుటను నారదుడు తిలకించెను. అత డనేక రూపములగూడ దాల్చెను.

సీ॥ సకలార్థ సంవేది యొక ఇంటిలోపల
జెలితోడ ముచ్చటల్ సెప్పుచుండు
విపుల యశోనిధి వేరొక యింటిలో
సరసిజాసనిగూడి సరసమాడు

—భాగవతము 10-621

రాసక్రీడలలో ప్రతి గోపికవద్ద యుండెను.

"అంగనా మంగనా మంతరే మాధవమ్
మాధవం మాధవం చాంతరే చాంగనా"

ఇట్టి శ్రీకృష్ణ పరమాత్మయందు బద్ధానురాగురై "మూఢులైన స్త్రీలు గుణదేహముల నెట్లు విడువగలిగి"రని పరీక్షిత్తు శుకుని ప్రశ్నించెను. భగవద్గీతలో "నిస్త్రైగుణ్యో భవార్జున" అని శ్రీకృష్ణుడాదేశించెను. త్రిగుణములను తొలగించుకొనుటకు జ్ఞానమవసరము. గోపికలు మూఢులు అజ్ఞానులు. వారెట్లు త్రిగుణములను వర్జింపగలరు? మాయాదేవి సత్త్వరజస్తమో గుణములచేత కారణ సూక్ష్మ స్థూల దేహములను కలిగించెను. ఆమెయే త్రిపురసుందరి. స్థూల సూక్ష్మ కారణ దేహములు త్రిపురములు. ఈశ్వరుడు త్రిపుర దహన మొనర్చెను. గోపికలు మూఢులైనను, త్రిగుణాత్మకమైన గుణ దేహమును వదలుటకు తమ కామతృష్ణను ఈశ్వరపరము చేసి బంధవిముక్తలైరి. ఎట్లనగా

మ॥ తరుణుల్ గొందరు మూల గేహముల నుద్దండించి రారాక త
ద్విరహాగ్నిన్ పరితాప మందుచు, మనోవీథిన్ విభున్ మాధవున్
బరిరంభంబులు వేసి, జారుడనుచుం భావించియున్, జొక్కి పొం
దిరి ముక్తిన్ గుణ దేహమున్ విడిచి ప్రీతిన్ బంధనిర్ముక్తలై

భాగవతము 10-967

బాంధవముననైన బగనైన వగనైన
ప్రీతినైన ప్రాణ భీతినైన
భక్తినైన హరికి బరతంత్రులై యుండు
జనులు మోక్షమునకు జనుదు రధిప!

భాగవతము 10-972

వెయ్యేల. "పరమ పురుషుండును, నజుండును, యోగీశ్వరేశ్వరుండును, నైన హరిని సోకిన స్థావరంబైన ముక్తంబగు"

భాగవతము 10-973

కాబట్టి గోపికలు ధన్యజీవులు కదా? భక్తి లేనివారు పై విషయ

ములను గ్రహింపక భగవంతుడైన శ్రీకృష్ణుని నిందించి పాపము నొందికట్టు కొందురు. అందులకే శుకుడు ఇట్లనెను.

క॥ పాపాత్ముల పాపములను
పాపంగా నోపునట్టి పద్మాక్షునిపై
పాపము గలదని నుడివిన
పాపాత్ముల పాపమునకు పారము గలదే॥

—భాగవతము.

మ॥ దరహాసాంకుర మోహనాకృతి! భవత్సౌందర్య లీలా మనో
హర రూపంబును గాంచి గోపికలు మోహా విష్టలై ప్రేమతో
హరి మా భర్త యటంచు వేద వ్రజ కన్యా బాహువల్లీ నిరం
తర బందీకృత దేహివైతివె ముకుందా! శ్రీ నృసింహేశ్వరా॥

—సువర్ణమాల.

కావున భగవత్పరమైన మధుర భక్తియు మోక్షప్రదమే కదా॥



# 29. భాగవత పద్య రత్నములు

భాగవత పురాణమున తొలుతనే భాగవత సందేశము, దృక్ప థము, సారము వివరింపబడినవి. పోతన 5 పద్యములలో ఈ సార మును వివరించి పాఠకులను ఈ పద్యముల భావము గ్రహించికాని భాగవతమును పఠించుట వ్యర్థమని హెచ్చరించెను.

1) చ॥ జననము లేక కర్మముల జాడలబోక సమస్త చిత్త వ
ర్తనుడగు చక్రికిం గవు లుదారపదంబుల జన్మకర్మముల్
వినుతులు సేయుచుందురు, వేదరహస్యములందు నెందు జూ
చిన మఱిలేవు జీవునికి జెప్పిన కైవడి జన్మ కర్మముల్

భాగవతము 1-68

భాగవతము నిగమార్థ ప్రతిపాదక మగుటచేత దానిలో కథల మూలమున వేదములోని సత్యములు వెల్లడింపబడినవి. ఆ కథల సంకేతముల గ్రహించి శ్రీకృష్ణలీలల అంతరార్థమును తెలిసికొనవల యును. జీవునికి వలె దేవునికి జన్మ కర్మములు వేదమున చెప్పలేదు. అయినను కవులు దేవుని జన్మకర్మముల వినుతించిరి. భాగవతము భగవంతుని ఏక వింశ్యవతారములు వర్ణించెను. వేద రహస్యము దెల్పుటకై "భువన క్షేమంకరంబైన భాగవతామ్నాయము బాదరాయ ణుడు తా కల్పించె నేర్పొప్పగన్" అని పోతన తెలిపెను.

2) భువనశ్రేణి సమోఘలీలు డగుచుం బుట్టించు రక్షించు, సం
హరిణన్ జేయు, మునుంగ డందు, బహుభూత వ్రాత మందాత్మ తం
త్ర విహారస్థితుడై షడింద్రియ సమస్త ప్రీతియున్ దవ్వులన్
దివి భంగిం గొను, జిక్క, డింద్రియములన్ దిప్పన్ నిబం
ధించుచున్

భాగవతము 1-69

ఈ పద్యములో సృష్టికి కారణము తెలుపబడినది. భగవంతుడు

త్రిగుణాత్మకమైన మాయచే సృష్టి స్థితి లయములను జేయుచు ఆత్మ రూపమున వెలుగొందును. అతనికి సంసారబంధము లంటవు. సర్వమునకు కారణ మతడే. ఈ అభిప్రాయమే భగవద్గీతయందు చెప్పబడినది.

శ్లో॥ ఈశ్వర స్సర్వ భూతానాం హృద్దేశేర్జున! తిష్ఠతి
భ్రామయన్ సర్వభూతాని యంత్రారు ఢాని మాయయా
గీత 18-16

సర్వభూతముల హృదయము లందును ఈశ్వరు డున్నవాడై యంత్రగాడు కీలుబొమ్మల దిప్పునట్లు తన మాయచేత సమస్త భూతముల నాడించుచున్నాడు.

శ్లో॥ మయాధ్యక్షేణ ప్రకృతి స్సూయతే సచరాచరమ్ -గీత 9-10

నా అధ్యక్షతచేతనే చరాచరమగు సమస్త భూతములను ప్రకృతి పుట్టించుచున్నది.

3) జగదధి నాథుడైన హరి సంతత లీలల నామరూపముల్
దగిలి మనో వచోగతుల దార్కిక చాతురి ఎంత గల్గియున్
మిగిలి కుతర్కవాది తగ మేరలుమీరి ఎఱుంగ నేర్చునే
యగణిత వర్తనక్రమము అజ్ఞు డెరింగి నుతింప నోపునే.
భాగవతము 1-78

తర్కము మనస్సువరకే పరిమితము. ఇంద్రియములకు మనస్సునకు అతీతమైన భగవంతుని లీలను తర్కబలముతో విమర్శింప తగదు. నామ రూపాత్మకమైన జగత్తును అనుసరించు మానవుడు చేయు తర్కము కుతర్కమై భగవంతుని లీలలను గ్రహింపజాలదు. ఇంద్రియ మనో నిగ్రహమునగాని ఆత్మానుభూతి కలుగదు. భాగవతమును తర్కదృష్టితో పఠింపరాదని పాఠకులకు హెచ్చరిక చేయబడినది.

4) ఇంచుక మాయ లేక మది నెప్పుడు పాయని భక్తితోడ వ
ర్తించుచు నెవ్వఁడేని హరి దివ్య పదాంబుజ గంధరాశి సే
వించు నతం డెఱుంగు నరవింద భవాదులకైన దుర్లభో
దంచితమైన యాహరి యుదార మహాద్భుత కర్మమార్గముల్.

భాగవతము 1-71

హరి లీలలను గ్రహించుటకు భక్తియే సాధనము. భక్తి యనగా ఇంద్రియము లీశ్వరపర మొనర్చి మనస్సును ఏకాగ్రతతో భగవంతు నిపై నిలుపుట. ఇది రజస్తమో పరిహారిణియైన భాగవత భక్తి. బ్రహ్మాదులకుకూడ హరిభక్తియే తరుణోపాయము.

5) మ॥ హరి పాదద్వయ భక్తి మీవలన నిట్లారూఢమై యుండు నే
తిరుగం బారదు చిత్తవృత్తి హరిపై దీపించి మీలోపలన్
ధరణీ దేవతలార మీరలు మహాధన్యుల్ సమస్తజ్ఞులున్
హరిచింతన్ మిముఁజెంద వెన్నఁడును జన్మాంత వ్యథా యోగముల్.

భాగవతము 1-72

హరిపై చిత్తవృత్తిగలవారు జన్మాంతర వ్యధలను పొందరు. వారి కర్మలు నశించి ఉద్దామ ధ్యానగరిష్ఠులై ముక్తిని గాంతురు

విశ్వమానవ కల్యాణ విజయ భేరీ రవము లు రోదసి మారు మ్రోగునటు పోతన పై భాగవత సందేశము ప్రపంచమునకు చాటెను. ఈ సందేశము కేవలమొక జాతిని, ఒక దేశమును, ఒక కాలమును ఉద్దేశించినది కాదు. అతని కృతి సార్వకాలికత్వము సార్వదేశికత్వము గాంచినది. ప్రపంచమున ఏ మానవుడైనను మోక్షమును పొందగోరిన ఇంద్రియ మనోనిగ్రహములు సాధింపవలయును. అది భక్తిమార్గముచే సాధ్యమని భాగవతము సూచించినది. కులమత వివక్షతలేక ఈ మార్గమును అందరు అనుసరింపవచ్చును అందువలన భాగవతము భువన క్షేమంకరము, వేద కల్పవృక్ష విగళితము, త్రిజగద్వర మంగళము, పరమ భాగవతులు పాటించు పథము.

# 30. భగవదవతార తత్త్వము

"భాగవతో వాఙ్మయావతారః" భాగవత పురాణమే వాఙ్మయ రూపమైన భగవదవతారమని పెద్దలు అన్నారు. ఈ పురాణములో భగవంతుని దశావతారములేగాక కపిలాది ఇతర అవతారములుకూడ చేర్చబడినవి.

శ్లో॥ మత్స్యః కూర్మ వరాహశ్చ నారసింహశ్చ వామనః
రామో రామశ్చ కృష్ణశ్చ బౌద్ధః కల్కి రేవచ.

అనునవి దశావతారములు. అవతరణ మనగా దిగివచ్చుట.

## భగవంతు డెప్పుడు అవతరించెను :-

శ్లో॥ యధా యదాహి ధర్మస్య గ్లాని ర్భవతి భారతః
అభ్యుత్థాన మధర్మస్య తదాత్మానం సృజా మ్యహమ్.

—గీత 4-7

ధర్మ మడుగంటినప్పుడు ధర్మ పునరుద్ధరణకై భగవంతు డవత రించును. దుష్టశిక్షణము శిష్టరక్షణము జరిపి ధర్మమును మరల స్థా పించి అవతారము చాలించును. భక్తులకు శ్రవణ చింతన వందనార్చ నము లొసగుటకుకూడ భగవంతు డవతరించును.

గీ॥ మరచి అజ్ఞాన కామ్యకర్మముల దిరుగు
వేద నాతురులకు తన్నివృత్తి సేయ
శ్రవణ చింతన వందనార్చనము లిచ్చు
కొఱకు నుదయించి తండ్రు పిన్ కొందరభవః

భాగవతము 1-190

పై పద్యములో శ్రీకృష్ణుని అభవ=పుట్టుక లేనివాడా! అని సంబోధించియు అవతరించెనని చెప్పుట గమనింపుడు.

## మానవునివలె భగవంతుడు జన్మించునా ?

భగవంతునకు "జీవునకు జెప్పిన విధమున జన్మ కర్మములు లేవు" భగవంతుడు నిజయోగ మాయా మహిమముచేత స్వేచ్ఛా పరికల్పిత లీలా విగ్రహుండు.

ప్రకృతిం స్వా మధిష్ఠాయ సంభవా మ్యాత్మ మాయయా"
— గీత 4-6

నా ప్రకృతిని వశపరచుకొని మాయచేత నేను పుట్టుచున్నాను. భగవంతుని జన్మకర్మములు దివ్యములు. పుట్టుకలేని భగవంతుని పుట్టుక ఒక క్రీడ. జీవుల పుట్టుక అవిద్యతో కూడియుండును.

ఉ॥ పుట్టుకలేని నీకభవ! పుట్టుక క్రీడయెగాక, పుట్టుచే
యెట్టినుడున్, భవాది దశలెల్లను జీవులయం దవిద్య తా
బుట్టుచునుండు, గాని నిను బుట్టినదిం బలె బొందఁ నుండియున్
బుట్టగలేమి దత్క్రియల జొక్కని యెక్కటి వౌదు పీశ్వరా!
భాగవతము 10-99

అష్టే శక్తికూడ అయోనిజగా పుట్టుచున్నది. సీత అయోనిజ.

జీవుడు "అవిద్యా మహిమం జేసి కర్మానుగతంబైన మిథ్యారూప దేహ సంబంధుండు" మానవుడు కర్మవశమున జనన మరణ ప్రవాహముల కొట్టుకొని పోవుచుండును. అందులకే శంకరుడు మానవులను గూర్చి కరావలంబ స్తోత్రమునందు

శ్లో॥ "యన్మాయార్జిత వపుః ప్రచుర ప్రవాహ
మగ్నార్త మర్త్య నివహేషు"

అనగా మాయచేత సంభవించిన జన్మల ప్రవాహమున కొట్టుకొని పోవు ఆర్తులైన మానవులని తెలిపెను.

మత్స్య, కూర్మ, వరాహ, నరసింహ వామనావతారములు సత్య కాలములోనే చాలింపబడినవి. పరశురామావతారములో రాజులను

శిక్షించిన తరువాత పరశురాముడు తన శక్తిని శ్రీరామునకు ధారపోసి మహేంద్రగిరి చేరెను. అనగా దుష్టశిక్షణ ముగియగనే అవతారము ముగిసినది. దీనికి కారణము కృత త్రేతాయుగములందు ధర్మ వృషభము వరుసగా 4, 3 పాదములతో నడచినది. కాని ద్వాపర కలి యుగములలో ధర్మము కుంటుపడి వరుసగా 2, 1 పాదములతో నడచినది. అందువలన రామ, కృష్ణ అవతారములలో దుష్టశిక్షణయేగాక ధర్మరక్షణకూడ బోధన చేయవలసి వచ్చినది. శ్రీరాముడు భగవంతుడైనప్పటికి మానవునివలె కేవల దశరథ పుత్రునివలె మసలుకొని గృహస్థధర్మమును క్షత్రియధర్మమును పాటించెను. మహిమలనెక్కువగా జూపలేదు. మానవులలో నొకడుగా వర్తించి ధర్మవిగ్రహుడై ఆదర్శపురుషుడయ్యెను. రామకృష్ణ అవతారములను విభవావతారములని యందురు. శ్రీకృష్ణుడు మానవునివలెగాక మహిమలను జూపెను. ఆయన శ్రీవిష్ణువువలె చతుర్భుజుడు. అతడు తలచినంతనే శంఖ చ క్రాది ఆయుధములు గరుడవాహనము అరుదెంచుచుండెడివి. అతని లీలలన్నియు అప్రాకృతములే. తాను భగవంతుడని నిరూపించుకొనెను. భగవద్గీతలో ఇట్లు చెప్పెను.

శ్లో॥ "అవజానంతి మాం మూఢాం మానుషీం తను మాశ్రితం"

మూఢులైన మానవులు శ్రీకృష్ణుని పరమాత్మగను లీలా మానుష విగ్రహునిగను గుర్తింపజాలరు.

శ్లో॥ అవ్యక్తం వ్యక్తి మాపన్నం మన్యంతే మా మబుద్ధయః
పరం భావ మజానంతో మా మవ్యయ మనుత్తమమ్"
— గీత 7-24

వ్యక్తముగాని నన్ను బుద్ధిహీనులు వ్యక్తునిగా నెంచుచున్నారు. నా సర్వోత్కృష్టము నెఱుగనివారు నాకు నాశము గలదని భావించుచున్నారు.

శ్రీకృష్ణ దవతరించినది మొదలు నిర్యాణమువరకు ప్రదర్శించి నవి అద్భుతలీలలే కదా? భగవంతునివలె శ్రీకృష్ణుడు పంచభూతము లకు పరుడైనవాడని మనకు తెలుపుటకై క్రింది అద్భుతకథలు చెప్ప బడినవి.

1) మద్దివృక్షముల బడవేయుట——పృథివీ జయము.
2) నందుని వరుణలోకమునుండి గొనితెచ్చుట——అపజయము.
3) కార్చిచ్చు నార్పుట——తేజోజయము.
4) తృణావర్తుని చంపుట——వాయు జయము.
5) మృద్భక్షణ విశ్వరూప దర్శనములు——ఆకాశజయము

పై కథలను భాగవతములో భగవంతుడు అను అధ్యాయమున వివరించితిని.

బ్రహ్మ రజోగుణము కలవాడు. విష్ణువు సత్వగుణము కల వాడు. శివుడు తమోగుణము కలవాడు. పరమాత్మ త్రిగుణమయుడు త్రిగుణాతీతు డైనప్పటికిని శుద్ధసత్వగుణము జ్ఞానము కలిగించున దగుటచేత త్రిమూర్తులలో విష్ణువునకు భాగవతమున కొన్నిచోట్ల ప్రా ధాన్యత ఇవ్వబడినవి. భృగుమహర్షి త్రిమూర్తుల ప్రాశస్త్యమును శోధింపబోవుట పై ప్రయోజనము నుద్దేశించిన కథయేకదా? మృత్యు లైన విప్రకుమారులను గొనితెచ్చుటయు శ్రీకృష్ణుడు పరతత్త్వమని నిరూపించును. రజోగుణ ప్రధానుడైన బ్రహ్మ శ్రీకృష్ణుని పరీక్షింప గోరి గోవులను, గోపకులను దాచియుంచగా శ్రీకృష్ణుడే వారి రూప ములు ధరించెను. బ్రహ్మకు తానే సృష్టికర్త యను అహంకారము నశించెను. అనగా బ్రహ్మకంటె బాలగోపాల బ్రహ్మమే మిన్నయని తాత్పర్యము. అట్లే తమోగుణ ప్రధానుడైన శివుడు మృత్యువును మన్మథుని జయించినవాడైనప్పటికిని, విష్ణువు మోహినీరూపమును తిలకించి విమోహితుడై వెంబడెను. ఇదిగాక దేవతలకు రాజైన

ఇంద్రుడుకూడ రాళ్ళవాన గురిపించినప్పుడు శ్రీకృష్ణుడే గోవర్ధన పర్వతమునెత్తి గోగోపకులను కాపాడెను. అనగా శ్రీకృష్ణుడే దేవతలందరికంటె మిన్నయగు పరతత్త్వమని భావము. పై కథలన్నియు విష్ణుపారమ్యమును తెలుపుచున్నవి.

కేవల మాహాత్మ్యములు ప్రదర్శించుటయే గాక అక్రూరునకు భాగవత ధర్మములను అర్జునునకు గీతను బోధించెను. ఇతర అవతారము లిట్టి ఉపదేశములు చేయలేదు. అందులకే "కృష్ణం వందే జగద్గురుమ్" అన్నారు.

శ్రీకృష్ణు డస్ఖలిత బ్రహ్మచారి. యోగీశ్వరేశ్వరుడు. గోపికలతనిని కామోత్కంఠతతోను మధుర భక్తితోను వెంబడించి తరించిరి. గోపికా వస్త్రాపహరణము, రాసక్రీడలు, గోపికల మధురభక్తి మొదలగువాని అంతరార్థమును సంకేతమును ముందుగ వివరించితిని. కృష్ణోపనిషత్తునందు "యోనందో పరమానందః" "యశోదాముక్తి గేహినీ" "వంశస్తు భగవాన్ రుద్రః" "దయాసా రోహిణీ మాత" ఇత్యాది సంకేతములు భాగవతమున కలవని తెలుపుచున్నది.

శ్రీకృష్ణుడే సర్వాంతర్యామి అనుటకు నిదర్శనముగా నారదునకు శ్రీకృష్ణుడు 16 వేల గోపికల ఇండ్లలో ఒకే సమయమున అగుపించె ననుకథ. కంస శిశుపాలాదులు శ్రీకృష్ణుని వైరభక్తితో తలచి ఉద్ధావనధ్యాన గరిష్ఠు లగుటచేత అతనియందే ఐక్యము చెందిరి.

క॥ తిరుగుచు గుడుచుచు ద్రావుచు
నరుగుచు గూర్చుండి లేచు చనవరతంబున్
హరి దలచి దలచి జగమా
హరి మయమని జూచె కంసు డారని యలుకన్

భాగవతము 10-86

సీ॥ శ్రవణ రంధ్రముల నే శబ్దంబు వినబడు
నది హరి రవమని యాలించు
నక్షిమార్గమున నెయ్యది సూడబడు నది
హరిమూర్తిగా నోపుకొంచు జూచు
దిరుగుచో దేహంబు తృణమైన సోకిన
హరి కరాఘాతమో యనుచు మలుకు
గంధంబు లేమైన ఘ్రాణంబు సోకిన
హరి మాలికా గంధమనుచు నదురు

తే॥ బలుకు లెవ్వియైన బలుకుచో హరిపేరు
పలుక బడియెననుచు బ్రమసి బలుకు
దలపు లెట్టివైన దలచి యా తలపులు
హరి తలంపులనుచు నలుగ దలచు.

భాగవతము 10-87

పై విధముగా కంసునకు ఇంద్రియంబు లీశ్వర విషయంబులై మదిసంచిత నిశ్చలతత్త్వమయ్యెను. ఇదియే భాగవత భక్తిరహస్యము కదా? కావున ఎవ్విధముననైన (అలుకనైన, చెలిమినైన, గామంబుననైన) భగవంతునియందు ఉద్దామధ్యాన గరిష్ఠుడైన తరింప వచ్చునని తాత్పర్యము.

శ్రీకృష్ణ లీలలను తర్కచాతురితో విమర్శించిన వాని పరమార్థము గ్రహింప వీలుకాదు. శ్రీహరి మహాద్భుతకర్మలు భక్తిభావముతోనే గ్రహింపవలయును. భక్తిలేనిచో విష్ణుమాయా కల్పితమైన లీలలు బ్రహ్మ రుద్రాదులుకూడ తెలియజాలరు. అట్టి కృష్ణలీలలో ఆతని జన్మమొకటి.

## శ్రీకృష్ణ జననము :-

జీవునకు ఎక్కడ ఎప్పుడు ఏ రూపముతో జన్మమందవలయునో తెలియదు. శ్రీకృష్ణుడు తాను పుట్టక ముందుగనె తానవతరించుటకు

తగిన ఏర్పాట్లు చేసికొనెను. యోగమాయను పిలిచి దేవకీ గర్భమున నున్న శేషాఖ్యమైన తన తేజమును రోహిణీ గర్భమున నుంచుమని తెలిపెను. తాను దేవకీ గర్భమున బుట్టి శంఖ చక్రాద్యాయుధములు గల చతుర్భుజునిగ దర్శన మిచ్చెను. దేవకీ వసుదేవులు పూర్వజన్మ మున పృశ్ని సుతపులని వారి కోర్కె మేరకు వారికి తాను జన్మించెనని తెలిపెను. తర్వాత సాధారణ శిశువుగా మారెను. వసుదేవు డాబాలుని గొనిపోయి యశోద ప్రక్కన ఉంచి ఆమెకు శిశువుగా జన్మించిన యోగమాయను గొనితెచ్చి దేవకి కడ నుంచెను. చిత్ర మేమనగా యోగమాయ ప్రభావమున కారాగారము తలుపులు తమంతతామే తెర చుకొనెను ద్వారపాలకులు నిదురనుండి లేవలేదు. యమునానది దారి చేసినది. వ్రేపల్లెలో ఎవరూ మేల్కొనలేదు.

ఇట్టి చిత్రములను జూపుట భగవంతునకే కదా సాధ్యము? ఇది అంతయు కల్పిత కథయని మనము భావించవచ్చును. కాని ఒక ఉదం తమును అప్రస్తుతము కాని ఎడల వ్రాయుదును.

రమణమహర్షికి ఒక మహమ్మదీయ శిష్యు డుండెను. అతని భార్య బ్రాహ్మణులకు తనఇంట భోజనము పెట్టవలెనని భర్తను కోరె నట ఆ విషయము భర్త మహర్షితో తెలిపెను. మహర్షి తనముందు కూర్చున్న ఇద్దరు నైష్ఠిక బ్రాహ్మలను పిలిచి మహమ్మదీయుని ఇంటికి భోజనమునకు వెళ్ళుమని ఆదేశించెను. వారును మారు పలుకక వెళ్ళి భోజనముచేసి మహర్షి ముందుకువచ్చి కూర్చొనిరి. మహర్షి వారి నేమియు అడుగలేదు. ఇతర బ్రాహ్మలు వారిని తప్పుపట్టి వెలివేయ లేదు. ఏమి జరుగనట్లే జరిగిపోయినది. ఇది జీవన్ముక్తుడైన భగవాన్ రమణమహర్షి మహిమగాక మరి ఏమి?

శ్రీకృష్ణుని అప్టి అద్భుత లీలలను వర్ణింప వీలులేదు. ఈ భగవ ల్లీలలను పురస్కరించుకొని శ్రీకృష్ణావతారము పూర్ణావతారమని చెప్ప

బడినది. ఇట్టి అవతారతత్త్వమును గూర్చిన కథలను శ్రవణము చేసిన పరీక్షితునకువలె మానవులకు భక్తి జ్ఞాన వైరాగ్యములు సిద్ధించి ముక్తి లభించునని యీ అవతారతత్త్వ విగూఢ రహస్యము.

గీ॥ అతి రహస్యమైన హరిజన్మ కథనంబు
మనుజు డెవ్వడేని మాపు రేపు
జాల భక్తితోడ జదివిన సంసార
దుఃఖరాసి బాసి తొలగిపోవు.

గీ॥ అరసి నిర్గుణ బ్రహ్మంబు నాశ్రయించి
విధి నిషేధనివృత్తి సద్విమల మతులు
చేయుచుందురు హరిగుణ చింతనమును
మానసంబున నేప్రొద్దు మానవేంద్ర!



# 31. షట్ దర్శనములు

## భగవద్గీత - భాగవతము

మానవుడు దుఃఖ నివృత్తికి, సుఖప్రాప్తికి నిరంతర కృషి సల్పుచున్నాడు. అన్ని మతములు దుఃఖ నివృత్తికి సుఖప్రాప్తికి మార్గములు సూచించుచున్నవి. షడ్దర్శనములు పురాణములు ఇట్టి ఉద్దేశ్యముతోనే వ్రాయబడినవి. సుఖము సత్త్వలక్షణము. తృష్ణ రజస్సు లక్షణము. ఇంద్రియ సుఖమును మన మాశించు చున్నాము. కాని ఇంద్రియ సుఖములు స్వర్గాది భోగములు, నిత్యమైనవి కావు అవి దుఃఖ హేతువులే.

శ్లో॥ "సుఖ మాత్యంతికం యత్ర బుద్ధి గ్రాహ్య మతీంద్రియం"
—గీత 6-21

సుఖము అతీంద్రియ మైనది. బుద్ధిచేత గ్రాహ్యమైనది. అందులకే భాగవతము

"అల్పతరమైన సుఖముల నందుచున్న జనుల దుఃఖంబు మాన్పంగ జాలు"న దని చెప్పబడినది. ఇంద్రియ సుఖములు అల్ప సుఖములే. ఉదాహరణమునకు భగవద్గీత అర్జున విషాద యోగముతో ఆరంభమైనది. యుద్ధము చేయవలయునా? వలదా? అను అంశముపై కర్తవ్యమేది? అకర్తవ్యమేది? ధర్మమేది? అధర్మమేది? అని నిర్ణయింప జాలక అర్జునుడు విషాదమున మునిగెను. శత్రువులను జయింప జాలనను భయముగాని, రాజ్యకాంక్షగాని అతనికి విషాదము కలిగింప లేదు. ఆ కారణములచేత యుద్ధ విముఖుడు కాలేదు.

శ్లో॥ నకాంక్షే విజయం కృష్ణ! నచ రాజ్యం సుఖానిచ
—గీత 1-32

శ్లో॥ అహో బత మహత్పాపం కర్తుం వ్యవసితా వయం
యద్రాజ్య సుఖ లోభేన హంతుం స్వజన ముద్యతాః

— గీత 1-45

"రాజ్యము సుఖములపై ఆశచేత బంధువులను గూడ చంపుట కుద్యుక్తుల మగుట పాపహేతువు కదా! ఇట్టి పాపభీతిచే అర్జును నకు విషాదయోగము కలిగినది. ఇది కాక యుద్ధము వలన వంశ క్షయము, కుల ధర్మనాశనము, కులస్త్రీలు చెడుట, వర్ణసంకరము ఇత్యా దులు కలుగును. కావున అర్జునునకు కర్తవ్య అకర్తవ్యములు నిర్ణ యించుటకు వీలు కాలేదు. అతని విషాద కారణమును గుర్తించి గార్యో న్ముఖుని చేయుటకు భగవంతుడు ధర్మాధర్మములు వివరించి కర్తవ్య మును నిర్ణయించెను.

శ్లో॥ అశోచ్యా నన్వశోచ స్త్వం ప్రజ్ఞావాదాంశ్చ భాషసే
గతాసూన గతాసూంశ్చ నాను శోచన్తి పండితాః

—గీత 2-11

నీవు దుఃఖింపదగని భీష్మద్రోణాదుల గురించి దుఃఖించితివి. మాటలు మాత్రము వివేకులు పలుకునట్టి మాటలు పల్కుచున్నావు. మృతి నొందిన వానిని గూర్చిగాని బ్రతికియున్న వానిని గూర్చిగాని పండితులు శోకింపరు.

శ్లో॥ జాతస్య హి ధ్రువో మృత్యుః ధ్రువం జన్మ మృతస్యచ
తస్మా దపరి హార్యేర్థే నత్వం శోచితు మర్హసి

— గీత 2-27

పుట్టిన వానికి జావును, చచ్చిన వానికి పుట్టుకయును గలుగుట నిశ్చయమైనది, గావున ఆవశ్యకముగా గలుగుచున్న జనన మరణ ముల విషయమై నీవు వ్యసనము బొందుట యుచితము గాదు.

శ్లో॥ సర్వ ధర్మాన్ పరిత్యజ్య మామేకం శరణం వ్రజ
అహం త్వా సర్వపాపేభ్యో మోక్షయి ష్యామి మా శుచ

—గీత 18-66

సర్వ ధర్మములను విడనాడి నన్నొక్కనినే శరణు పొందుము. నేను నిన్ను అన్ని పాపములనుండి విడిపింతును. శోకింపకుము.

అట్లే భాగవతమున కూడ వ్యాసునకు విషాద యోగము కలిగినది. ఆ మహర్షి ఒకటిగానున్న వేదమును ఋగ్ యజు స్సా మాథర్వణములను నాలుగు భాగములుగా విభజించెను. పామరులకు వేదార్థము స్ఫురించదని భావించి 17 పురాణముల వ్రాసెను. ఇట్లు లోకహిత మొనర్చినను, అతనికి మనశ్శాంతి లభించలేదు. శాంతి అనగా కామాద్యరిషడ్వర్గలయము. అట్టి శాంతిని పొందుటకు చేయదగినదేమో తెలియక నారదు నాశ్రయించెను.

సీ॥ వ్రతధారినై వేదవహ్ని గురుశ్రేణి
మన్నింతు, విహిత కర్మముల గొఱత
వడకుండ నడపుదు, భారత మిషమున
బలికితి వేదార్థ భావమెల్ల,
మునుకొని స్త్రీశూద్ర ముఖ్యధర్మములందు
దెలిపితి, నే జెల్ల దీనజేసి
యాత్మసంతత మంద, దాత్మలో నీశుండు
సంతసింపక యున్న జాడదోచె

భాగవతము 1-85

అని వ్యాసుడు విషాదమున మునిగెను. దానికి నారదుడు "భగవంతుడు, ధర్మముల్ ప్రపంచించిన మెచ్చునే! గుణవిశేషము లెన్నినగాక" (భాగవతము 1-95) అని తెలిపి శ్రీనారాయణ స్తుతిపరమైన భాగవతమును వ్రాయుమని ఆదేశించెను.

దప్పిచే బాధపడువాడు నీటికై వెదకునట్లు, విషాదము కలిగినప్పుడే మానవు డానంద ప్రాప్తికి ప్రయత్నించును. దుఃఖమునుండి నివృత్తి జెంది సుఖమును పొందగోరును. షడ్దర్శనములు దుఃఖముతో ఆరంభించి దుఃఖనివృత్తికి వేరువేరు మార్గములను సూచించినవి. ఈ

మార్గములలో భిన్నత్వము కలదు. వీనిని సవరించి సమన్వయ పరచు టయే భగవద్గీత భాగవతముల విశిష్టత యనవచ్చును. (Synthetic philosophy). ఈ గ్రంథముల లక్ష్యము దుఃఖనాశము బ్రహ్మానంద ప్రాప్తి.

సంసారము దుఃఖమయ మని భగవద్గీత అనేక పర్యాయములు తెలుపుచున్నది.

"అనిత్య మసుఖం లోక మిమం ప్రాప్య" —గీత 9-33
లోకము అనిత్యము సుఖ రహితము.

"మృత్యు సంసార వర్త్మని" —గీత 9-3
మృత్యు రూపమగు సంసార పథము.

జన్మదుఃఖ జరా వ్యాధి దుఃఖ దోషాను దర్శనం"
జననము ముసలితనము వ్యాధి మొదలగు దుఃఖములు కలది.

భాగవతమునకూడ ప్రహ్లాదుడు రాక్షస బాలురతో సంసారమును గూర్చి ఇట్లు తెలిపెను.

ఆ॥ దీన శుభము లేదు, దివ్య కీర్తియు లేదు,
జగతి పుట్టి పుట్టి చచ్చి చచ్చి
పొరల నేల? మనకు పుట్టని చావని
త్రోవ వెదకికొనుట దొడ్డ బుద్ధి

భాగవతము 7-214

సంసారమున మునుగుటయే విషాదయోగము. భాగవత భగవద్గీతలు ఇట్టి సంసార దుఃఖ నివారణోపాయములను సూచించినవి. ఏ విధముననైన భగవంతుని శరణు పొందుటయే ఆనందప్రాప్తికి హేతు వని దీని సందేశము.

1) జైమిని పూర్వ మీమాంసా దర్శనము
2) గౌతముని న్యాయ దర్శనము

3) కణాదుడు వైశేషిక దర్శనమును
4) కపిలుడు సాంఖ్యదర్శనమును
5) పతంజలి యోగదర్శనమును
6) బాదరాయణుడు వేదాంత దర్శనమును వ్రాసిరి.

సాంఖ్య న్యాయ వైశేషికులు తర్కము నవలంబించిరి.

షడ్దర్శనములు సూచించిన మార్గములను భగవద్గీత భాగవతము లెట్లు వివరించినవో పరిశీలింతము.

## పూర్వ మీమాంసా దర్శనము :

వేదమున సంహిత బ్రాహ్మణముల యందు కర్మకాండ వివరింప బడినది. పూర్వమీమాంసకులకు వేదమునందలి కర్మకాండయే ప్రధానము. వేదవిహితమైన యజ్ఞ యాగాదులు చేయుటయే వారు ధర్మమువి. కర్తవ్యమని భావించిరి. "స్వర్గకామో యజేత" స్వర్గకాములు యజ్ఞము నాచరింపవలెను. దానివలన స్వర్గమును పొందుటచే దుఃఖనివృత్తి కలుగును. అశ్వమేధమును చేసినచో పాపమును మృత్యువును తరింపవచ్చును.

కాని స్వర్గప్రాప్తి శాశ్వత దుఃఖనివృత్తి కలిగించదని గీతాచార్యుడు వచించెను.

శ్లో॥ యామిమాం పుష్పితాం వాచం ప్రవదం త్యవిపశ్చితః
వేద వాద రతాః పార్థ నాన్యదస్తీతి వాదినః
గీత 2-42

వేదములందు తెలిపిన ఫలములను అర్థవాదములని గ్రహింపక మీమాంసకులు ఇంతకంటే వేరు లేదని యందురు.

శ్లో॥ కామాత్మనః స్వర్గపరా జన్మకర్మ ఫలప్రదాం
క్రియా విశేష బహుళాం భోగైశ్వర్య గతిం ప్రతి
గీత 2-43

కర్మ ననుసరించి జన్మలు కలుగును. స్వర్గమే ఉత్తమ పురుషార్థము. అని ఇట్టి భోగైశ్వర్య ప్రాప్తికై కర్మ భేదములను తెలుపుచున్నారు.

శ్లో॥ భోగైశ్వర్య ప్రసక్తానాం తయాపహృత చేతసాం
వ్యవసాయాత్మికా బుద్ధిః సమాధౌ నవిధీయతే గీత 2-44

భోగైశ్వర్య లాలసులైన వారి వాక్కులకు మోసపోయినవారు చలచిత్తము కల వారగుదురు. అట్టివారికి నిశ్చయాత్మక బుద్ధి కలిగి సమాధియందు స్థిరపడరు.

అట్లయినచో కర్మకాండ వదలుమని భగవంతుని ఆదేశమా? కాదు.

"యజ్ఞదాన తపఃకర్మ నత్యాజ్యం కార్యమేవ తత్" గీత 18-5

అని భగవంతుడు యజ్ఞ దాన తపములను వదలకూడదని తెలిపెను. అయినచో గీత చెప్పిన కర్మానుష్ఠాన మెట్టిది? దుఃఖ నివృత్తికై స్వర్గప్రాప్తి కోరి చేయు యజ్ఞ యాగాది కర్మలు మోక్షప్రదములు కావు.

"క్షీణే పుణ్యే మర్త్యలోకే విశంతి" గీత 9-21

పుణ్యము భోగమువలన పూర్తిగా నశించిన తరువాత మరల భూమిపై జన్మింపవలసినదే. కాబట్టి స్వర్గసుఖ మశాశ్వతము.

"న కర్మణా, ప్రజయా, ధనేన, త్యాగేనైకే అమృతత్వ మానశుః"
— మహానారాయణోపనిషత్తు

కర్మ, ధనము మొదలగు వానిచే మోక్షమురాదు. త్యాగము చేత మాత్రమే మోక్షప్రాప్తి.

భాగవతమున జెప్పబడిన యజ్ఞము స్వర్గకాముడుచేయు పశుయజ్ఞముకాదు. భారతమున ధర్మరాజు రామాయణమున రాముడు అశ్వమేధములు చేసిరి. భాగవతమున హరిని జేరుటకై ఋషులు సత్ర

కామక యజ్ఞము చేసిరి. ఇది నిష్కామముగా ఈశ్వరార్పణ బుద్ధితో చేయు మనోయజ్ఞము, లేదా ధ్యానయజ్ఞము లేదా బ్రహ్మ యజ్ఞము. ప్రాచీనబర్హిచే చేయబడిన పశుయజ్ఞము భాగవతమున దూషింప బడినది.

"కర్మణా బధ్యతే జన్తుః విద్యయాతు విముచ్యతే"

జీవుడు సకామకర్మవలన బద్ధుడగును। జ్ఞానమువలన ముక్తు డగును. అందువలన కర్మల నీశ్వరార్పణబుద్ధితో చేయవలయునని భాగవతము తెలుపుచున్నది.

"కర్మంబులు సంసార హేతుకంబు లయ్యును. ఈశ్వరార్పిత ములై తమ్ముతాము చెరచుకొన నోపియుండును." ఈశ్వరునియందు సమర్పితంబైన కర్మంబు దాపత్రయంబుల మాన్పు నౌషధంబగు.

భాగవతము 1-110

"ఫలంబు గోరక కర్మం బీశ్వరునకు సమర్పణంబు సేయకున్న నది ప్రశస్తంబై యుండదు"

భాగవతము 1-98

తే॥ అరయ నిష్కామ ధర్ములైనట్టి భక్తు
లందు నీవు ప్రసన్నుండవైన రీతి
హృదయములు బద్ధకాములై యొనయు దేవ
గణములందు బ్రసన్నత గలుగ నీవు. భాగవతము 3-99

"నిపుణుడైనవాని నిష్కర్మతకు మెచ్చువాని కే నాచర్తు వంద నములు" గజేంద్రమోక్షము.

అట్లే భగవద్గీత యందును ఇట్లు చెప్పబడినది.

శ్లో॥ యజ్ఞార్థా త్కర్మణోఽన్యత్ర లోకోఽయం కర్మబంధనః
తదర్థం కర్మ కౌంతేయ! ముక్తసంగ స్సమాచర.
—గీత 3-9

ఈశ్వరార్థముగా చేయు కర్మతకంటె భిన్నమగు కర్మ లోకమునకు

బంధము కలిగించును. అందువలన ఈశ్వరార్థమగు కర్మను ఫలాపేక్ష లేనివాడై చేయును.

పై వివరణమువలన భగవద్గీతకాని భాగవతముకాని కర్మలను చేయకూడదని నిషేధింపదు. కామ్య కర్మ మోక్షప్రదముకాదు. అందు వలన ఈశ్వరార్పణబుద్ధితో ఫలాపేక్ష రహితముగ యజ్ఞయాగాదులను చేయవలయునని బోధించుచున్నవి. ఇదియే కర్మయోగము.

ఇంకను

శ్లో॥ యోగస్థః కురు కర్మాణి సంగం త్యక్త్వా ధనంజయ
సిద్ధ్య సిద్ధ్యోః సమోభూత్వా సమత్వం యోగ ఉచ్యతే.

—గీత 2-48

యోగమునందున్నవాడవై, కర్మఫలానక్తి వదలి, కర్తృత్వ భావమును వదలి, సముడవై అనగా కార్యము సిద్ధించినప్పుడును ప్రతి కూలించినపుడును సమబుద్ధితో కర్మం నాచరింపుము. ఇదియే కర్మ యోగము. కర్తృసంగము ఫలసంగము వదలుమని భావము.

శ్లో॥ బుద్ధియుక్తో జహాతీహ ఉభే సుకృత దుష్కృతే
తస్మాత్ యోగాయ యుజ్యస్వ యోగః కర్మసు కౌశలమ్

గీత 2-50

సమత్వబుద్ధితో కూడిన వానికి పుణ్యపాపములు రెండును అం టవు. కావున నీవిట్టి కర్మయోగము నవలంబింపుము. కర్మలుచేయుట యందు నేర్పరితనమే యోగము.

శ్లో॥ కర్మజం బుద్ధియుక్తాహి ఫలం త్యక్త్వా మనీషిణః
జన్మ బంధ వినిర్ముక్తాః పదం గచ్ఛం త్యనామయమ్.

— గీత 2-51

సమత్వబుద్ధితో గూడుకొన్న పండితులు కర్మవలన బుట్టిన ఫల మును వదలి జన్మబంధములకు లోబడనివారై సర్వోపద్రవ రహిత మైన విష్ణుదివ్యపదమును పొందుదురు.

పై విధముగా మీమాంసకుల కర్మ సిద్ధాంతము స్వర్గప్రదము కాగా, భగవద్గీత భాగవతముల యందలి కర్మయోగము మోక్షప్రద మైనది.

## న్యాయదర్శనము :

కేవల మనుమాన ప్రమాణము ద్వారా ఈశ్వరు డున్నాడని ఈ దర్శనము చెప్పుచున్నది. మానవుడు చేయు కర్మఫలము అతని అధీనమున నున్నదని తెలుపుచున్నది. మోక్షప్రాప్తికి సాధనము ఈ దర్శనమున పేర్కొనబడిన 16 పదార్థముల జ్ఞానమే ననియు, ఈశ్వరునకు ప్రాధాన్యత లేదనియు సూచించుచున్నది. భగవద్గీతయందు, భగవంతుని సంకల్పము లేనిది ఏమియు జరుగదనియు, మానవుడు పురోగమింప జాలడనియు, తెలుపుటచే గీతలో న్యాయదర్శన ప్రసక్తి అగుపించదు.

## వైశేషికదర్శనము:

ఈ దర్శనముతో గూడ గీత ఏకీభవించదు. ఇందులో ఏడు పదార్థముల సాధర్మ్య వైధర్మ్య జ్ఞానమే తత్త్వజ్ఞానమని తెలుపబడినది. ఈశ్వరునకు ప్రాధాన్యతలేదు. అందువలన గీతలో దీని ప్రసక్తిలేదు.

## సాంఖ్యదర్శనము :

దీనిని కపిలమహర్షి రచించెనని చెప్పుదురు.

ప్రస్తుతము ఈశ్వరకృష్ణ కవి రచించిన సాంఖ్యకారికలను బట్టి సాంఖ్య సిద్ధాంతమును సంగ్రహముగ గ్రహింపవచ్చును. ఈ సిద్ధాంత సారమేమనగా ఆధ్యాత్మిక, ఆధిభౌతిక, ఆధిదైవిక దుఃఖములను నివారించుటే ముక్తికి మార్గము. ఇది ప్రకృతి పురుష వివేకమనెడి జ్ఞానముచేత సాధ్యమగును. పరిణామమే స్వభావముగా గల ప్రకృతి

సత్త్వరజస్తమో గుణాత్మకము. అది స్వయముగా సృష్టి యొనర్చును. ప్రకృతి పురుష లిద్దరు స్వతంత్రులు. అనాది వస్తువులు. అనంతులు. ఈ దర్శనములో ఈశ్వర ప్రసక్తి లేదు. సాంఖ్యులు 25 తత్త్వముం సూచించిరి.

| | | |
|---|---|---|
| మూలప్రకృతి | — | 1 |
| మహత్తత్వము | — | 1 |
| అహంకారము | — | 1 |
| పంచతన్మాత్రలు | — | 5 |
| కర్మేంద్రియ జ్ఞానేంద్రియములు + మనస్సు | — | 11 |
| పంచభూతములు | — | 5 |
| పురుషుడు | — | 1 |
| | | 25 |

కొన్ని విషయములలో గీత సాంఖ్యముతో ఏకీభవించును.

1) సాంఖ్య సిద్ధాంతము ప్రకారము సృష్టియందు ప్రకృతి పురుషులు కలిసి యుందురు. పురుషుని గుణములు ప్రకృతి యందును ప్రకృతి గుణములు పురుషుని యందును సంక్రమించును. ఇందువలన అచేతనమగు ప్రకృతి సచేతన మగును. అకర్తయగు పురుషుడు కర్తగ అగుపించును. గీత ఈ సిద్ధాంతమునే సమర్థించుచున్నది.

శ్లో॥ పురుషః ప్రకృతి స్థోహి భుఙ్క్తే ప్రకృతిజాన్ గుణాన్

గీత 13-21

జీవరూపుడగు పరమ పురుషుడు ప్రకృతి యందుండియే ప్రకృతి వలన బుట్టిన గుణముల ననుభవించును.

భాగవతమున ఇట్టి అభిప్రాయమే తెలుపబడినది.

సీ॥ జననుత! సత్వరజస్తమో గుణ మయ
మైన ప్రాకృత కార్యమగు శరీర
గతుడయ్యుఁ పురుషుండు గడగి ప్రాకృతములు
నగు సుఖదుఃఖ మోహముల వలన
గర మనురక్తుండు గాడు. వికార హీ
నుడు త్రిగుణ రహితుడు నగుచు
బలసి నిర్మల జల ప్రతిబింబితుడైన
దినకరు భంగి వర్తించు నట్టి

తే॥ ఆత్మ ప్రకృతి గుణంబుల యందు దగులు
వడి, యహంకార మూఢుడై తొదరి యేను
గడగి నిఖిలంబునకు నేను గర్తనని ప్ర
సంగ వశతను బ్రకృతి దోషముల బొంది.

భాగవతము 3-904

2) ప్రకృతి గుణములైన సత్వరజస్తమో గుణములే సర్వ కార్యములను జేయుచున్నవి. పురుషుడు సాక్షిమాత్రుడని రెండును అంగీకరించుచున్నవి.

శ్లో॥ ప్రకృతేః క్రియమాణాని గుణైః కర్మాణి సర్వశః
అహంకార విమూఢాత్మా కర్తాహ మితి మన్యతే.

గీత 3-27

ప్రకృతివలన బుట్టిన సత్వరజస్తమోగుణములు కర్మలకు కారణమగుచుండును. అహంకారముగల అవివేకి ఆ కర్మలన్నియు తన చేతనే జరుగునని తలచును

శ్లో॥ ప్రకృత్యైవచ కర్మాణి క్రియమాణాని సర్వశః
యః పశ్యతి తథాఽఽత్మాన మకర్తారం స పశ్యతి

గీత 13-29

ఎల్ల కర్మలు ప్రకృతి గుణములచే చేయబడును. ఇది తెలిసిన

వాడు ఆత్మను కర్మలు చేయని దానినిగా జూచుచున్నాడు.

3) పరమాత్మ నిష్క్రియుడు, నిర్లిప్తుడని రెండును అంగీక రించును.

శ్లో॥ అనాదిత్వాత్ నిర్గుణత్వాత్ పరమాత్మాఽయ మవ్యయః
శరీరస్థోఽపి కౌన్తేయ నకరోతి నలిప్యతే గీత 13-31

పరమాత్మ అనాది, నిర్గుణుడు, అవ్యయుడు. శరీరము నందున్న ప్పటికిని ఏమియు చేయడు. దేనికి అంటుకొనడు. చేయనివాని కింక ఫల మంటు టెక్కడ?

సాంఖ్య దర్శనమునకు గీతా సిద్ధాంతమునకు కొన్ని భేదములు కలవు.

1) సాంఖ్యమున ఈశ్వరుని గూర్చిన ప్రసక్తియే లేదు. అతని యునికి ఋజువు కాలేదు.

2) గీతయందు ప్రకృతి రెండు విధములుగా చెప్పబడినది.

1) అపరా (2) పరా. ఈ రెండే సాంఖ్యులు సూచించు ప్రకృతి పురుషులనవచ్చును. వీరే క్షరపురుషుడు, అక్షరపురుషుడు. ఈద్వైతము తోనే సాంఖ్యము ముగిసినది. గీతయందు వీరిద్దరికి పరుడైన పర మాత్మ చెప్పబడెను.

శ్లో॥ ద్వావిమౌ పురుషౌ లోకే క్షర శ్చా క్షర ఏవచ
క్షర స్సర్వాణి భూతాని కూటస్థోఽక్షర ఉచ్యతే
గీత 15-16

పురుషు డీలోకమున క్షరుడనియు, అక్షరుడనియు రెండు విధ ములుగా నున్నాడు. సమస్త భూతజాలములు క్షరుడు. కూటస్థుడైన జీవు డక్షరుడు.

శ్లో॥ ఉత్తమః పురుష స్త్వన్యః పరమాత్మే త్యుదాహృతః
యో లోకత్రియ మావిశ్య బిభర్త్య వ్యయ ఈశ్వరః
గీత 15-17

క్షరా క్షరములకంటె విలక్షణమగు ఉత్తమ పురుషుడు మరి యొకడు కలడు. ఆయన మూడు లోకములు వ్యాపించి సమస్తమును భరించుచున్నాడు. నాశరహితుడు పరమాత్మ అని చెప్పబడుచున్నాడు.

3) 25 తత్త్వముల విచారణ, ప్రకృతి పురుషుల వివేక జ్ఞానమే ముక్తికి సాధనమని సాంఖ్యుల మతము. ఆత్మ సాక్షాత్కార జ్ఞానమే ముక్తికి సాధనమని గీత మతము.

భాగవతము కూడ గీత మతమునే సమర్థించుచున్నది.

శ్లో॥ విరోధోఽస్యాను శయన మాత్మనః సహశక్తిభిః
ముక్తిర్హిత్వా న్యథా రూపం స్వరూపేణ వ్యవస్థితః
ద్వి. 10-6

4) సాంఖ్యము పురుష లనేకులని తెలుపుచున్నది. గీత ఈ విషయము నొప్పుకొనదు.

శ్లో॥ యథా ప్రకాశయ త్యేకః కృత్స్నం లోక మిమం రవిః
క్షేత్రం క్షేత్రీ తథా కృత్స్నం ప్రకాశయతి భారత!
గీత 13-33

సూర్యుడొక్కడే యయ్యును లోకమంతయు నెట్లు ప్రకాశము కలిగించునో అటులనే పరమాత్మ ఒక్కడయ్యు సర్వ క్షేత్రములకు ప్రకాశము నిచ్చుచున్నాడు. భూతకోట్లనేకముగా నుండినను అంత ర్యామి యగు పరమాత్మ ఒక్కడే.

శ్లో॥ క్షేత్రజ్ఞం చాపి మాం విద్ధి సర్వ క్షేత్రేషు భారత!
గీత 13-12

సమస్త శరీరము లందుండెడి నన్ను క్షేత్రజ్ఞునిగా దెలియుము.

శ్లో॥ అవిభక్తంచ భూతేషు విభక్త మివచ స్థితం గీత 13-16

బ్రహ్మము సకల ప్రాణుల యందు అభేదముగా నున్నను

ఉపాధి భేదముచేత అజ్ఞానులకు వేరువేరుగా విభజింపబడిన దానివలె నుందును.

భాగవతమున భీష్ముడు శ్రీకృష్ణుని నుతించునప్పుడు పై అభిప్రాయమును సూచించెను.

మ॥ ఒక సూర్యుండు సమస్త జీవులకు దా నొక్కొక్కడై తోచు పోలిక, నే దేవుడు సర్వకాలము మహాలీలన్ నిజోత్పన్న జన్య కదంబంబుల హృత్సరోరుహములన్ నానావిధానూనరూపకుడై యొప్పుచు నుండునట్టి హరి నే బ్రార్థింతు శుద్ధుండనై
భాగవతము 1-226

5) ప్రకృతిస్వభావమే పరిణామమని సాంఖ్యుల మతము. కాని పురుషుని ఆశ్రయముచేతనే పరిణామము కలుగుచున్నదని గీతమతము.

శ్లో॥ మయాధ్యక్షేణ ప్రకృతిః సూయతే స చరాచరమ్
గీత 9-10

నా అధ్యక్షత చేతనే చరాచరమగు సమస్త భూతములను ప్రకృతి పుట్టించుచున్నది.

భాగవతము ఈ విషయమునే తెలుపుచున్నది.

శ్లో॥ కాల వృత్త్యాతు మాయా యాం
గుణమయ్యా మధోక్షజః
పురుషే ణాత్మ భూతేన
వీర్యమాధత్త వీర్యవాన్
తతో௨ భవత్ మహత్తత్త్వం. భాగవతము 3-5-26-7

కం॥ పురుషాకృతి నాత్మాంశ
స్ఫురణము గల శక్తి నిలిపి పురుషోత్తముడీ
శ్వరు డభవుం డజుడు నిజో
దర సంస్థిత విశ్వమపుడు దగ బుట్టించెన్

6) ప్రకృతి పురుషులు పరమాత్మయందే లీనమగుచున్నారని

భగవద్గీత భాగవతముల మతము. సాంఖ్యుల ప్రకృతిపురుషులు కేవల పరమాత్మ విలాసములు మాత్రమే.

శ్లో॥ భూమిరాపోఽనలో వాయుః ఖం మనో బుద్ధి రేవచ
అహంకార ఇతీయం మే భిన్నా ప్రకృతి రష్టధా గీత 7-4

భూమి నీరు అగ్ని గాలి ఆకాశము మనస్సు బుద్ధి అహంకారము అని నా మాయాశక్తి ఎనిమిది విధములగు భేదమును బొంది యున్నది.

శ్లో॥ అపరేయ మితి స్త్వన్యాం ప్రకృతిం విద్ధి మే పరామ్
జీవభూతాం మహాబాహో, యయేదం ధార్యతే జగత్ గీ 7-5

పైని జెప్పిన 8 విధములు గలది నా అపరా ప్రకృతి. దాని కంటె ఇతరమైనది పరాప్రకృతి అదియే సమస్త ప్రాణ ధారణ కారణము, సకల ప్రపంచము దానిచే ధరింపబడి యున్నదని తెలిసికొనుము.

శ్లో॥ ఏత ద్యోనీని భూతాని సర్వాణీ త్యుప ధారయ
అహం కృత్స్నస్య జగతః ప్రభవః ప్రలయ స్తధా
గీత 7-6

సమస్త భూతములు ఈ పరాప్రకృతి వలననే పుట్టినవి. నేను జగత్తునకు ఉత్పత్తికిని నాశనమునకును కారణ భూతుడను.

శ్లో॥ మత్త పరతరం నాన్య త్కించిదస్తి ధనంజయః
మయి సర్వమిదం ప్రోతం సూత్రే మణిగణా ఇవ.
గీత 7-7

నా కంటె ఇతర కారణము మఱొకటిలేదు. ఈ సర్వ ప్రపంచము దారమునందు రత్నమువలె నాయందు గూర్చబడి యున్నది.

గీత తెలిపిన పై అభిప్రాయములనే భాగవతము కూడ సమర్థించుచున్నది. శ్రీరామ నారాయణ వ్యాస్ రచించిన The Synthetic Philosophy of Bhagavatha నుండి ఈశ్వరకృష్ణుని సాంఖ్య

మునకును భాగవతమున కపిలుని సాంఖ్యమునకును గల భేదములను క్రింద సూచించితిని.

"The first point ofdifference between the two views is that while Bhagavatha postulates only one' Purusa' as the real all pervadingsoul, which is the real seer of all our experiences and the basic reality that underlies all things of the Universe, it emphatically rejects the plurality of the purusas accepted by the Classical Samkhya of Isvara Krishna.

Next, the Classical samkhya is atheistic, while the Bhagavatha samkhya is distinctly theistic.

The concept of' Prakrti' too has different connotations Prakrti according to the Bhagavatha, is no doubt beginningless, but for the true knower, brahman alone exists Prakrti loses its existence in Him Classicsl samkhya holds the view that Prakrti is eternal and beginningless and thus is coeval with Purusa

Both differ in their conception of emancipation. According to classical samkhya, emancipation means the absolute cessation of all pain, Spiritual (adhyatmika), material (adhibhouthika) and destined (adhi daivika) - without a possibility of return, But in the Bhagavatha, emancipation can be attained when the true nature of atman is realised and penetrating the veil of maya one identifies one self with brahman, the true self.

And then there is a further difference between the two so far as the number of categories is concerned. The Bhagavatha has allotted a very important position to Kala or Time which is missing from the classical Samkhya The Bhagavatha really speaking accepts only one category, viz, brahman or the supreme being, while the classical samkhya has the twenty five categories that constitute the world.

భాగవతమున ఇట్లు చెప్పబడినది.

జనులకెల్ల శుభము సాంఖ్యయోగము, దాని
వలన ధర్మనిష్ఠ వలననైన
అంతకాల మందు హరి చింత సేయుట
పుట్టువులకు ఫలము భూవరేంద్ర!

శ్లో॥ ఏతావాన్ సాంఖ్య యోగాభ్యాం స్వధర్మ పరినిష్ఠయా
జన్మలాభః పరః పుంసా మంతే నారాయణ స్మృతిః

సాంఖ్యమునకు కర్మతో యోగముచేసి సరియైనజ్ఞానము వలన సరియైన కర్మల నాచరించును. సాంఖ్యమును కర్మతో యోగముచేసి స్వధర్మమును పరినిష్ఠితము చేయవలయును.

పై విధముగా ఈశ్వరకృష్ణ సాంఖ్య కారికలకును భాగవత భగవద్గీతల సాంఖ్య సిద్ధాంతమునకును గల భేదములు వివరింప బడినవి.

## పాతంజల యోగ దర్శనము :-

దీనిని పతంజలి రచించెను. ఈ దర్శనమున 4 పాదము లున్నవి. 1) సమాధిపాదము. 2) సాధనపాదము. 3) విభూతిపాదము. 4) కైవల్యపాదము. పతంజలి సాంఖ్యులు చెప్పిన 25 తత్త్వములే కాక ఈశ్వరుడను 26వ తత్త్వమును తెలిపెను. ఈశ్వరుడనగా సాంఖ్యులు చెప్పిన పురుషుడుకాడు. ఇతడు విశేష పురుషుడు.

ఈ శాస్త్రము ప్రతిపాదించు ముఖ్య విషయము విశేష పురుషుని గుఱించి కాదు. దీని ముఖ్యవిషయము యోగము. అందులకే దీనిని యోగదర్శన మనిరి. ప్రకృతి పురుషుల నిశ్చయజ్ఞానమునకు యోగమేనని పతంజలి భావము.

"యోగః చిత్తవృత్తి నిరోధః"

పతంజలి చిత్తవృత్తి నిరోధమే యోగమని నిర్వచించెను. తపస్సు, స్వాధ్యాయము, ఈశ్వర ప్రణిధానము -దీనిని క్రియాయోగ మందురు, వీనిచే మానవుడు ఏకాగ్రచిత్తు డగును.

చిత్తపురుషసంయోగమే చిత్తవృత్తులు ఉత్పన్నమగుటకు కారణము భగవంతుడు శుద్ధస్ఫటికము వంటివాడు. ఎర్రని పువ్వు స్ఫటికము ప్రక్కన ఉన్నప్పుడు స్ఫటికము ఎరగా అగుపించును. అట్లే ఆత్మయందు దుఃఖము సుఖము మొదలగు చిత్తవృత్తులు ప్రతిఫలించును. ఆత్మ వానితో తద్రూపమునొంది తాను సుఖదుఃఖముల ననుభవించు నట్లు తలచును. కాని వాస్తవముగా ఆత్మకు సుఖదుఃఖములు లేవు. యోగమువలన చిత్తవృత్తులు నిరోధించిన పిదప ఆత్మయందు వాని వృత్తి కనిపించదు. ఆత్మ స్వస్వరూపమున నిలకడ జెందును.

చిత్తవృత్తి నిరోధమునకు అనేక ఇతర మార్గములు సూచింపబడినవి.

1) అభ్యాస వైరాగ్యములు

2) ఈశ్వర ప్రణిధానము

3) ప్రాణాయామము.

యోగాంగము లెనిమిది. అవి యమ నియమ ఆసన ప్రాణాయామ ప్రత్యాహార ధ్యాన ధారణ సమాధులు.

1) యమము=అహింస, సత్యము, బ్రహ్మచర్యము, అపరిగ్రహము.
2) నియమము=తపస్సు, స్వాధ్యాయము, ఈశ్వర ప్రణిధానము.
3) ఆసనము=యోగాసనములు.
4) ప్రాణాయామము=రేచక పూరక కుంభకములు.
5) ప్రత్యాహారము = ఇంద్రియ నిగ్రహము (బాహ్య నామరూపములయందు మనస్సును పోనీక ఏక మార్గము నొందజేయుట.)
6) ధారణ=మనస్సును ఒక స్థానమందు నిలుపుట.
7) ధ్యానము=సోహంభావముతో ధ్యానించుట.
8) సమాధి=అహమను స్ఫురణ అణగిన స్థితి.

వీనివలన ఏర్పడు నిర్బీజ సమాధిస్థితియే కైవల్యమని పతంజలి అభిప్రాయము.

భగవద్గీత పై అష్టాంగములను సమర్థించినది.

1) యమము :-

"ప్రశాంతతా విగతభీః బ్రహ్మచారి వ్రతే స్థితః" గీత 6-14

శాంతచిత్తుడై భయమును వదలి బ్రహ్మచర్య వ్రతనిష్ఠుడై యుండవలయును.

2) నియమము :-

"మనసై వేంద్రియ గ్రామం వినియమ్య సమం తతః"
— గీత 6-24

మనస్సును ఇంద్రియములను నియమించవలెను.

3) ఆసనము :-

శుచేదేశే ప్రతిష్ఠాప్య స్థిరమాసన మాత్మనః —గీత 6-11

పరిశుద్ధమగు ప్రదేశమున స్థిరాసనుడు కావలెను.

4) ప్రాణాయామము :-

"ప్రాణాపానే సమం కృత్వా నాసా భ్యంతర చారిణౌ"
— గీత 5-27

ప్రాణాపానముల రెంటిని సమము చేయవలెను.

5) ప్రత్యాహారము :-

"స్పర్శాన్ కృత్వా బహి ర్బాహ్యాన్" —గీత 5-27

బాహ్య విషయములనుండి విముఖుడు కావలెను.

6) ధ్యానము :-

"మనః సంయమ్య మచ్చిత్తో యుక్త ఆసీత మత్పరః"
— గీత 6-14

మనసును చిక్కబట్టి నాయందు లగ్నమొనరించి ధ్యానించుచుండవలెను.

7) ధారణ :-

"చక్షుశ్చైవాంతరే భృవోః" —గీత 5-27

శ్లో॥ యతో యతో నిశ్చరతి మనః చంచల మస్థిరమ్
తత స్తతో నియమ్యైత దాత్మన్యేవ వశం నయేత్
—గీత 6-26

చలించు మనస్సును విషయమునుండి మరల్చి ఆత్మయందు నిలకడ నొందింనవలయును.

8) సమాధి :-

"ఆత్మ సంస్థం మనః కృత్వా నకించిదపి చింతయేత్"
గీత 6-25

మనస్సును ఆత్మయందుంచి ఎట్టి చింతయు లేనివాడు కావలెను.

భాగవతముకూడ అష్టాంగయోగములవలన ముక్తి లభించునని తెలుపుచున్నది.

ధ్యానములో యోగ మవసర మనియు తెలుపుచున్నది.

పతంజలి యోగదర్శనమునకును గీతలో యోగముపై సూచించిన అభిప్రాయములకును భేదము లేకపోలేదు.

1) ప్రకృతి పురుషుల వియోగము లేక వివేకజ్ఞానమే పతంజలి యోగము. జీవబ్రహ్మల సంయోగమే యోగమని గీత తెల్పుచున్నది.

2) చిత్త నిరోధమునకు ఈశ్వర ప్రణిధానము అనేక సాధనములలో నొకటి యని పతంజలి భావించెను, కాని ఈశ్వర ప్రణిధానమే చిత్తవృత్తి నిరోధమునకు ముఖ్యమైన ఉపాయమని గీత తెలుపుచున్నది.

భాగవతమున కూడ ఇట్లు చెప్పబడినది.

"దివ్య విలస దవయవోదార సుందర నవ విలాస
మందహాస మనోహర మధుర వచన
రచనచే నపహృత మనః ప్రాణు కలగుచు,
నెలమి నుందురు" భాగవతము 3-879

భక్తుడు ఈశ్వరునియందు మనస్సు లగ్నము చేసినప్పుడు "అపహృత మనః ప్రాణుడగు"ననుటచేత చిత్తవృత్తి నిరోధమునకు ఈశ్వర ప్రణిధానమే ముఖ్యోపాయమని విశద మగుచున్నది. ప్రహ్లాదుడుకూడ విష్ణుచింతనమున "మఱచెనే తద్విశ్వమున్" అనగా బాహ్య ప్రపంచ జ్ఞానమును వదలెనని చెప్పబడినది.

3) పతంజలి తెలుపు ముక్తావస్థలో దుఃఖ నివృత్తియేగాని ఆనంద ప్రాప్తి లేదు. ఎందుకనగా పురుషుడు చిత్స్వరూపుడేగాని ఆనంద స్వరూపుడుగాడని పతంజలి అభిప్రాయము. కాని భగవద్గీతలో యోగి బ్రహ్మానంద మనుభవించునని చెప్పబడినది.

శ్లో॥ ప్రశాన్త మనసం హ్యేనం యోగినం సుఖ ముత్తమం
ఉపైతి శాంత రజసమ్ బ్రహ్మభూత మకల్మషమ్.

గీత 6-28

నిరంతరము ఇట్లు యోగమునందు దన యాత్మను నిల్పు స్థిర ప్రయత్నముగల యోగికి దోషములు పూర్తిగా నశించును. కావున అతడు అనాయాసముగ అత్యుత్తమమగు బ్రహ్మానందసుఖము ననుభవించును.

4) నిర్బీజ సమాధియందు జీవునకు తన సాక్షాత్కారమేకాని బ్రహ్మ ప్రాప్తి కాదని పతంజలి అభిప్రాయము. కాని యోగమువలన కలుగు సాక్షాత్కారము బ్రహ్మసాక్షాత్కారమని గీత అభిప్రాయము.

శ్లో॥ యుంజన్నేవం సదాఽత్మానం యోగీ నియత మానసః
శాన్తిం నిర్వాణ పరమాం మత్సం స్థా మధిగచ్ఛతి

గీత 6-15

ఇట్లు నిశ్చయించిన మనస్సుగల యోగి తన మనస్సు సర్వదా స్వాధీనము చేసికొని ఉత్తమ మగు నాయొక్క స్థానమును బొందు చున్నాడు.

5) కర్మల నీశ్వరున కర్పణ సేయుటయే ఈశ్వర ప్రణిధానమని పతంజలి మతము. కాని ఇది గీతయొక్క కర్మయోగ సిద్ధాంతము. ఈశ్వర ప్రణిధాన మనగా ఈశ్వరుని యందు మనస్సు లగ్నము చేయుట కాదని పతంజలి భావించెను.

శ్లో॥ యత్కరోషి, యదశ్నాసి, యజ్జుహోషి దదాసియత్,
యత్తపస్యసి కౌన్తేయ! తత్కురుష్వ మదర్పణమ్.
గీత 9-27

దేహయాత్రకు వలయునట్టి లౌకికకర్మ ఏది చేయుచున్నావో, యజ్ఞము, దానము, తపస్సు, భుజించు పదార్థములు అన్నీ నాకర్పణ చేయుము. ఇదియే ఈ కర్మ సిద్ధాంతమే పతంజలి ఈశ్వరప్రణిధానము. సర్వకాల సర్వావస్థల యందును ఈశ్వరునియందు మనస్సు లగ్నము సేయుటయే ఈశ్వర పణిదానమని భాగవతముకూడ సమర్థించెను. ప్రహ్లాదుని దినచర్య పరికింపుడు.

శా॥ పానీయంబులు ద్రావుచున్, గుడుచుచున్, భాషించుచున్, హాసలీ
లా నిద్రాదులు సేయుచున్, దిరుగుచున్, లక్షించుచున్ సంతత
శ్రీనారాయణ పాదపద్మ యుగళీ చింతామృతా స్వాద సం
ధానుండై మఱచెన్ సురారిసుతు డేత ద్విశ్వమున్ భూవరా!
భాగవతము 7-123

6) ఈశ్వర ప్రణిధానమున చిత్తైకాగ్రత కలుగును. ఆత్మ సాక్షాత్కారము కలుగునని పతంజలి అభిప్రాయము. కాని ఈశ్వరునితో చిత్త సంయోగమే యోగమని గీత అభిప్రాయము.

శ్లో॥ యోగినామపి సర్వేషాం మద్గతే నాన్తరాత్మనా
శ్రద్ధావాన్ భజతే యో మాం సమే యుక్తతమో మతః
గీత 6-47

యోగులందరిలో నాయందంతఃకరణము గలవాడగుచు, శ్రద్ధతో నన్నెవ్వడు సేవించుచున్నాడో అతడు యోగశ్రేష్ఠుడని నా మతము.

అందువలననే శ్రీకృష్ణుడు యోగము విట్లుపదేశించెను.

శ్లో॥ మన్మనాభవ, మద్భక్తో, మద్యాజీ మాం నమస్కురు
మామేవైష్యసి యుక్త్వైవ మాత్మానం మత్పరాయణః
గీత 9-34

నాయందే మనస్సు నిల్పుము. నాయందే భక్తి కలిగియుండుము. నాకే నమస్కరింపుము. ఇట్లు నన్నే ఎంచితివేని నన్నే పొందగలవు.

పైన చూపినట్లు భాగవత భగవద్గీతలకును పతంజలి యోగ సూత్రములకును కొంతభేదము అగుపించుచున్నది. అందులకే భాగవతమున బ్రహ్మదేవుడు యోగజనిత జ్ఞానమును పొందియు కమలనయనుడైన శ్రీహరిని కనుగొనజాలడయ్యెను. కాని "కనియెన్ విశ్వాల భక్తియోగమున" అని భాగవతము సూచించుచున్నది.

శ్లో॥ తపస్విభ్యోఽధికో యోగీ జ్ఞానిభ్యోపి మతోధికః
కర్మిభ్యశ్చాధికో యోగీ తస్మాద్యోగీ భవార్జున।
గీత 6-46

## వేదాంత దర్శనము :

దీనిని బ్రహ్మసూత్రములనియు, ఉత్తర మీమాంస అనియు అందురు. దీనికి బాదరాయణ మహర్షి రచించెను. వేదములలో అంత మందు జ్ఞానకాండ ఉపనిషత్తులలో చెప్పబడినది. ఆ విషయమునే క్రింది విధముగా వేదాంత దర్శనము ప్రతిపాదించుచున్నది.

దుఃఖనివృత్తి ఆనందప్రాప్తి-ఈ రెండు వేదాంతదర్శన లక్ష్యములు. బ్రహ్మప్రాప్తివలననే దుఃఖనివృత్తి కలుగును. బ్రహ్మజ్ఞానమువలననే గాని కర్మకాండవలన ముక్తి లభింపదు. వేదాంతమతానుసారము జీవుడే బ్రహ్మము. బ్రహ్మము సచ్చిదానంద స్వరూపము. వేదాంత దర్శనము బ్రహ్మజ్ఞానముతో ప్రారంభమై బ్రహ్మప్రాప్తితో ముగియుచున్నది. జీవుడు వేరు దేవుడు వేరను భావము

భ్రాంతి. కర్మవలన ఈ భ్రాంతి తొలగదు. జ్ఞానమువలననే సాధ్యమగును. భగవంతుడు సగుణ నిర్గుణరూపములు కలవాడు. శంకరులు చెప్పిన "బ్రహ్మ సత్యం జగన్ మిథ్య" అను వాక్యమును బ్రహ్మసూత్రములు సమర్థించుచున్నవి.

పారమార్థిక దృష్టితో బ్రహ్మము నిర్గుణము. నిరుపాధికము, వాక్కునకందనిది. వ్యావహారిక దృష్టితో సగుణము, ఉపాధి సహితము, నిర్గుణోపాసన పునరావృత్తి రహిత కైవల్యముక్తి కలిగించును. సగుణోపాసన క్రమముక్తి కలిగించును.

భాగవతము పునరావృత్తి రహిత కైవల్యముక్తి జ్ఞానముచేతనే గాక భక్తిచేతనే భాగవతులు పొందగలరని తెలుపుచున్నది.

పరమ భాగవతులు పాటించు పథమిది
ఈ పథమున యోగి ఏగెనేని
మగిడిరాడు వాడు, మరి సంశయములేదు
కల్ప శతములైన కౌరవేంద్ర. — భాగవతము 2-33

"స్వధర్మ నిరతుడైన పురుషుడు, అనేక జన్మల తర్వాత బ్రహ్మత్వమునొంది తరువాత ఈశ్వరత్వమును తరువాత విష్ణుదివ్యపదమును పొందును. కాని భగవంతు డట్టి పదంబును దనంతనే పొందు"నని శివుడు భాగవతుల ప్రాశస్త్యముగూర్చి తెలిపెను.

భాగవతము 4-699

భాగవత భగవద్గీతలు వేదాంత దర్శనముతో అనేక విషయములందు ఏకీభవించును.

1) వేదాంత దర్శనమువలెనే భగవద్గీత భాగవతములు దుఃఖనివృత్తి నిరతిశయ ఆనంద ప్రాప్తి లక్ష్యములుగా గలిగియున్నవి. బ్రహ్మసూత్రములచే తత్త్వము తెలుపబడినది. దానినే గీత రూపమున భగవానుడుపదేశించెను.

2) గీతలో కృష్ణుడే సృష్టి స్థితి లయములకు బీజమని చెప్పబడినది. జగత్తు పరమాత్మ రెండుసత్యములను ద్వైతులవలెగాక బ్రహ్మ సూత్రములు కూడ పరమాత్మ సత్యమని జగత్తు మిథ్య అని ఒప్పుకొనుచున్నవి.

"ప్రభవః ప్రలయః స్థానం నిధానం బీజ మవ్యయమ్"
— గీత 9-18

ఈ ప్రపంచ ఉత్పత్తి స్థితిలయ స్థానములు నేనే. దీనికి బీజము నిధానము నేనే.

3) పారమార్థిక దృష్టితో జగత్తు బ్రహ్మమే. వ్యావహారిక దృష్టితో దానికి మూలకారణము బ్రహ్మమైనను, మాయచే అది నానా త్వము పొందినదని బ్రహ్మసూత్రములు తెలుపుచున్నవి. భగ వద్గీత దీనిని సమర్థించుచున్నది.

శ్లో॥ భూమి రాపోనలో వాయుః ఖం మనోబుద్ధి రేవచ
అహంకార ఇతీయం మే భిన్నా ప్రకృతి రష్టధా
గీత 7-4

శ్లో॥ అపరేయ మతస్త్వన్యాం ప్రకృతిం విద్ధి మే పరాం
గీత 7-5

శ్లో॥ మత్తః పరతరం నాస్తి కించిదస్తి ధంనజయ
గీత 7-7

నా ప్రకృతి రెండు విధములు. 1) పరా 2) అపరా. నా అపరా ప్రకృతి అనగా భూమి, నీరు, అగ్ని, వాయువు, ఆకాశము, మనస్సు, బుద్ధి, అహంకారము అనునవి, జీవస్వరూప ప్రకృతి పరాప్రకృతి. నా కంటె భిన్నమగున దేదియు లేదు.

శ్లో॥ మయాధ్యక్షేణ ప్రకృతిః సూయతే స చరాచరమ్
గీత 9-10

నా ఆధిపత్యమున ప్రకృతి సృష్టి చేయుచున్నది.

4) జీవుడే బ్రహ్మమను వేదాంత వాక్యమునే గీత ఆమోదించు చున్నది.

శ్లో॥ అహమాత్మా గుడాకేశ సర్వభూతాశయ స్థితిః గీత 10-20
సమస్త ప్రాణుల హృదయ మందుండు ఆత్మను నేనే.

5) వేదాంతము జీవబ్రహ్మల ఐక్యమును అంగీకరించినను. ఉపాధి భేదముచే భిన్నత్వము తెలుపుచున్నది. అట్లే భగవద్గీత కూడ

శ్లో॥ ద్వావిమౌ పురషే లోకే క్షరశ్చాక్షర ఏవచ
క్షర స్సర్వాణి భూతాని కూటస్థోఽక్షర ఉచ్యతే గీత 15-16

శ్లో॥ ఉత్తమః పురుష స్త్వన్యః పరమాత్మే త్యుదాహృతః
గీత 15-17

లోకమున క్షరుడు అక్షరుడు అను ఇద్దరు పురుషులు కలరు. భూతములు క్షరపురుషుడు. కూటస్థు డక్షర పురుషుడు. ఈ ఇద్దరి కంటె ఉత్తమ పురుషుడే పరమాత్మ.

6) సగుణ నిర్గుణ బ్రహ్మమును గీతయు సమర్థించు చున్నది.

శ్లో॥ సర్వేంద్రియ గుణాభాసం సర్వేంద్రియ వివర్జితం
అసక్తం సర్వ భృచ్చైవ నిర్గుణం గుణభోక్తృచ. గీత 13-14

సమస్త ఇంద్రియ గుణములు కలిగియు, ఇంద్రియములు లేనిది. నిర్గుణమయ్యు అన్ని గుణములు కలది.

భాగవతమున కూడ

క॥ అగుణుండగు పరమేశుడు
జగముల గల్పించు కొఱకు చతురత మాయా
సగుణుండగు గావున హరి
భగవంతుం డనగ బరగె భాగవతము 2-99

7) యజ్ఞ యాగాదులచేత కల్ప పర్యంత ముక్తియని జ్ఞానముచేత పునరావృత్తి రహిత కైవల్య ముక్తియని గీతయు సమర్థించినది.

శ్లో॥ ఆబ్రహ్మ భువనాల్లోకాః పునరావర్తి నోర్జున
మా ముపేత్యతు కౌన్తేయ పునర్జన్మ నవిద్యతే -గీత 8-16

బ్రహ్మలోకమును జెందినవారు కల్పాంతమున తిరిగి పుట్టవలసి నదే. జ్ఞానులు ముక్తులగుచున్నారు.

కొన్ని విషయములలో మాత్రమే వేదాంత దర్శనమునకును, గీతకును భేదములు కనుపించును. గీత, జ్ఞానభక్తి కర్మ ధ్యానమార్గములను, నాల్గింటిని సమర్థించును. కాని నిష్కామ కర్మయోగమే ప్రధానమని గీతకూడ తెలుపుచున్నది.

శ్లో॥ ఉత్సీదేయు రిమే లోకా నకుర్యాకర్మచే దహం
సంకరస్యచ కర్తాస్యా ముపహన్యామి మాః ప్రజాః
గీత 3-24

శ్రీకృష్ణుడే తాను కర్మచేయని యెడల లోకములు నశించుననియు జీవుల నాశనమునకు కారణ మగుదుననియు తెలిపికొనెను.

వేదాంతము కర్తవ్యరూపమున ఏమియు చేయకుండుటయే సన్యాసమని తెలుపగా లోకరక్షణకై జ్ఞానియు కర్మముచేయుటను గీత సమర్థించుచున్నది. కర్మత్యాగి సన్యాసి కాదని, సంకల్పత్యాగి నిజమైన సన్యాసి అని గీతమతము.

శ్లో॥ ఏవం బుద్ధేః పరం బుద్ధ్వా సంస్తంభ్యాత్మన మాత్మనా
జహి శత్రుం మహాబాహో కామరూపం దురాసదమ్
గీత 3-43

ఈ విధముగా బుద్ధికంటె పరమైన ఆత్మను గ్రహించి, మనసుచేత ఇంద్రియముల నిగ్రహించి, కామరూప శత్రువును నిర్జించుము.

పై విధముగ భాగవత భగవద్గీతలు షడ్దర్శనములను సవరించి ముక్తి మార్గమును నిర్ణయించినవి.

# 32. వర్ణవ్యవస్థ

## రామాయణ భారత భాగవతములు

### కుల ధర్మము :-

మతప్రసక్తి నేటికాలమున వివాదగ్రస్తమైనది. కాని భాగవతము నిరూపించిన మతము సర్వ సమ్మతమైన మతమని విశ్వ శ్రేయోదాయకమని విశదపరచుటకు ప్రయత్నింతును. భారతము, అందలి భగవద్గీత "కులధర్మ గౌరవమునకు ప్రాధాన్యత నివ్వగా భాగవతము "కులధర్మ గౌరవము సిద్ధి వహించునె ఎన్ని మేనులన్" అని ప్రశ్నించుచున్నది. భక్తికి ప్రాధాన్యత నిచ్చుచున్నది.

చ॥ తన కులధర్మమున్ విడచి దానవవైరి పదార విందముల్
పనివడి సేవసేసి పరిపాకము జెందక ఎవ్వడేని జ
చ్చిన మఱుమేననైన నది సిద్ధి వహించు; దదీయ సేవ బా
పిన గులధర్మగౌరవము సిద్ధి వహించునె ఎన్ని మేనులన్

భాగవతము 1-100

### బ్రాహ్మణు డెవరు :-

భాగవతము "సద్విజ శ్రేయ"మైన గ్రంథము. గాయత్రీ తత్త్వార్థ ప్రతిపాదకమైన గ్రంథమని నిరూపించియుంటిని. ద్విజ శబ్దము కు సాధారణముగ బ్రాహ్మణు డని అర్థము.

జన్మనా జాయతే శూద్రః
కర్మణా జాయతే ద్విజః

గాయత్రీ ఉపదేశముచేత వైదిక కర్మాచరణమునకు అధికారియైనవాడు కర్మ లేదా వృత్తిపరముగా బ్రాహ్మణుడు. గుణపరముగా తీసికొన్నచో సత్త్వగుణ ప్రధానుడు బ్రాహ్మణుడు. జ్ఞానపరముగా బ్రహ్మజ్ఞానము కలవాడు బ్రాహ్మణుడు. ఏ నిర్వచనము నుద్దేశించి

బ్రాహ్మణ శబ్దము వాడబడినదో పరిశీలించిగాని ఆ యా సందర్భాను సారము అర్థము చెప్పుటకు వీలుపడదు. అనగా కర్మబ్రాహ్మణుడా గుణ బ్రాహ్మణుడా జ్ఞానియా అని తెలిసికొనవలయును.

భాగవతమున బ్రాహ్మణునిగూర్చిన ప్రశంసలను పరిశీలింతము. అనేక స్థాయిలకు చెందిన బ్రాహ్మణులు ఇందు కనుపించుచున్నారు.

1) భాగవతములో ప్రథమమున చెప్పబడిన కథ పుత్రఘాతి యగు అశ్వత్థామ నవమానించుకథ. అశ్వత్థామ బ్రాహ్మణుడు, గురు పుత్రుడు. కాని ఉపపాండవులను జంపిన శిశుహంత. సత్వగుణ ప్రధా నుడుకాడు. హంతవ్యుడు. క్షంతవ్యుడుకాడు. పుత్రశోకమున కుములు చున్న ద్రౌపదివద్దకు రెక్కలుకట్టుకొని తీసికొనిరాబడిన అశ్వత్థామను జూచి ఆమె నిందింపక నమస్కరించినది. ఇచట ద్రౌపది "సుస్వభావ" యని చెప్పబడినది. ఆమెయే సత్త్వగుణమున మిన్న. అశ్వత్థామను చంపజూచు భీమార్జునులను వారించినది. అతడు భూసురుడు కావున "ప్రాణ విముక్తుడైన అతిపాపము, బ్రాహ్మణ హింస మానరే" అని బోధించినది.

ఆమె ఇట్లనియెను

క॥ భూపాలకులకు విప్రుల
గోపింపం జేయదగదు. గోపించిన ద
త్కోపానలంబు మొదలికి
భూపాలాటవుల గాల్చు భూకంపముగన్

భాగవతము 1-166

"బ్రాహ్మణో నహంతవ్య"మని వేదము శ్రుతంబగుటచేత అశ్వ త్థామను సంహరింప సంరంభమున జనుదెంచు భీముని వారించుటకు ఇతరులకు సాధ్యముగాదని శ్రీకృష్ణపరమాత్మయే చతుర్భుజుడై భీముని వారించి అశ్వత్థామను కాపాడెను. ఇచట అశ్వత్థామ కర్మచేత బ్రాహ్మ ణుడు. సత్త్వగుణముగాని జ్ఞానము గాని లేదు. ఉపపాండవులను

విద్రోహించువారిని జంపినవాడు, క్షాత్రధర్మము కలవాడు. కర్మమాత్ర బ్రాహ్మణుడు.

2) సనక సనంద నాదులు శ్రీహరిని దర్శింప వైకుంఠమున కేగిరి. వారిని ద్వారపాలకులైన జయ విజయు లడ్డగించిరి. వారు కోపగించి ద్వారపాలకుల శపించిరి. అంత శ్రీహరి చనుదెంచి వారిని మన్నింపుమని సనక సనందనాదుల కోరెను. మహర్షులు, జ్ఞానులు, బ్రాహ్మణులైన సనక సనందనాదులను ప్రశంసించెను. యజ్ఞములో వేల్చిన నేయికంటె భూసురుడు భుజించిన ఆహారమే శ్రీహరి నెక్కువగా తృప్తి పరచునట.

చ॥ క్రతువులు సేయుచో శిఖి ముఖంబున వ్రేలుచునట్టి తద్ఘృత
ప్లుత చరు భక్షణన్ ముదము బొందదు నిస్పృహ ధర్మమార్గసం
గతుడగు భూసురోత్తము ముఖంబున వేడ్కభుజించు నయ్యవి
స్తృత కబళంబునన్ మనము తృప్తి వహించినరీతి నిచ్చలున్

భాగవతము 3-560

"వర విప్రాను పదైక పుణ్య రజమే" శ్రీహరి కాభరణమట

సనక సనందనాదులు మహర్షులు. జ్ఞానులు బ్రహ్మచారులు "వర విప్రులు".

3) సప్తమస్కంధమున పూజించుటకు నారాయణుడు పాత్రుం డని తెలుపబడినది. పురుషులలోన హరి తనువైన వేదంబును ధరించు సంతోష విద్యా తపో గరిష్ఠుడైన బ్రాహ్మణుండు పాత్రంబు. బ్రాహ్మణులలోన ఆత్మజ్ఞాన పరిపూర్ణుడైన యోగి ముఖ్యపాత్రము.

ఆ॥ అఖిల లోకములకు హరిదైవతము సూడ
హరికి దైవతము ధరాధినాథ!
పద పరాగలేశ పంక్తిచే త్రైలోక్య
పావనంబు సేయు బ్రాహ్మణుండు. భాగవతము 7-551

ఇచ్చట బ్రాహ్మణుడై ఆత్మజ్ఞాన పరిపూర్ణుడైన యోగి చెప్ప బడెను.

4) పరీక్షిత్తు మృగయా వినోదియై చరించి దప్పిగొని శమీక ముని కడకేగి దాహము తీర్చుమని కోరెను. కాని శమీకుడు "ప్రత్యా హృత బాహ్యాంతరింద్రియుం డగుట నిమీలిత లోచనుండై" సమాధి యందు బాహ్య ప్రపంచమును మరచి యుండుటచేత బదులు పలుక దయ్యెను. అంతరింద్రియ బహిరింద్రియ నిగ్రహముగలిగి అవస్థాత్ర యము దాటి శమీకుడు సమాధిస్థితిలో నుండెను. అట్టి బ్రాహ్మణశ్రేష్ఠు నవమానించుటయే పరిక్షిత్తునకు శాపకారణ మయ్యెను. ఇచట శమీ కుడు యోగారూఢుడు.

పై ఉదాహరణములలో బ్రాహ్మణ ప్రశంస గావింపబడినది. కాని అప్రతిహతమైన బ్రాహ్మణతేజము రిత్తపోయిన సంఘటనలను కూడ భాగవతము వర్ణించినది.

1) అశ్వత్థామ లోకమంతయు అపాండవ మగుగాక అని ప్రయో గించిన బ్రహ్మాస్త్రము ఉత్తర గర్భమునందున్న శిశువును బాధిం పగా ఆమె శ్రీకృష్ణుని శరణు వేడెను.

క॥ దుర్భర బాణానలమున
గర్భములో నున్న శిశువు ఘన సంతాపా
విర్భావంబున బొరలెడి
నిర్భరకృప గావవయ్య నిఖిల స్తుత్యా!

భాగవతము 1-179

అప్పుడు శ్రీకృష్ణుడు చక్రహస్తుడై వైష్ణవ మాయచే ద్రోణ తనయుడు ప్రయోగించిన బ్రహ్మాస్త్రము నడచెను. "ఇట్లు ద్రోణ తన యుండేసిన ప్రతిక్రియా రహితంబైన బ్రహ్మ శిరంబనియెడి దివ్యాస్త్రంబు వైష్ణవతేజమున నిరర్థకం బయ్యె. నిజమాయచే సకలలోక

సర్గస్థితి సంహారంబు లాచరించునట్టి హరికి ధరణీసుర బాణనివార ణంబు విచిత్రంబు గాదు."

2) దక్షప్రజాపతి అల్లుడగు శివుని ఆహ్వానింపక యజ్ఞము సేయ బూనెను. పార్వతి (సతీదేవి) తన తండ్రియగు దక్షుడు చేయు యజ్ఞమును స్త్రీ చాపల్యమున శివుని మాటలు లెక్కసేయక చూడ వచ్చెను. దక్షుడామెను తిరస్కరించెను. ఆమె వెనుకకు మరలిపోవ నిచ్ఛగించక యోగాగ్నిచే తన్నుతాను దహించుకొనెను. ఆమె వెంట వచ్చిన రుద్రగణములు కోపించి యజ్ఞశాలను ధ్వంసము సేయబూనిరి. అది గాంచి భృగుమహాముని అభిచారికహోమము గావించి దేవతలను సృష్టించి వారివలన రుద్రగణములను తరిమివైచెను. బ్రాహ్మణ తేజము నెదిరించి రుద్రగణములు నిలువజాలక శివుని కడకేగి జరిగి నది చెప్పిరి. అంతట శివుడు కుపితుడై వీరభద్రుని సృష్టించెను. వీర భద్రునకుకూడ తాను బ్రాహ్మణతేజము నెదింపగలనా యను సందే హము కలిగెను.

శివు డతని నిట్లాజ్ఞాపించెను.

చ॥ గురు భుజ శౌర్యభూరి రణకోవిద మద్భట కోటికెల్ల నీ
వరయ వరూధినీ వరుడవై చని యజ్ఞముగూడ దక్షునిన్
బరువడి ద్రుంపు మీ వచట బ్రాహ్మణతేజ మజేయమంటివే
నరిది మదంశ సంభవుడవై తగు నీకు నసాధ్య మెయ్యెడన్.

భాగవతము 4-100

వీరభద్రుడు రుద్రాంశ సంభూతు డగుటచే బ్రాహ్మణతేజ మత నిని ఎదిరింపజాలదని శివుడు తెలిపెను. వీరభద్రుడు దక్షునిజంపి భృగువు మొదలగు ఋషులను పరిభవించెను. బ్రాహ్మణతేజము భగ వంతుని అంశసంభవుడగు వీరభద్రునిముందు నిలువజాలదయ్యెను. మహర్షులుకూడ ఎదిరింపజాలరైరి.

3) అంబరీష దనురాజు విష్ణు భక్తుడు. ఏకాదశి వ్రతము సేయుచున్నఎడ దూర్వాసు డతిదిగా నేతెంచెను. అతడు స్నానసంధ్యా ద్యనుష్ఠానముల దీర్చుకొనుటకై వెడలి తడవొనర్చెను. ఏకాదశి ఘడియలు మించిపోవుటచేత అంబరీషుడు ఉదకపాన మొనర్చెను. దూర్వాసుడు దానిని గ్రహించి కుపితుడై యతనిపై కృత్యను (బ్రహ్మ దండము) ప్రయోగించెను. అంత శ్రీహరి అంబరీషుని గాపాడుటకై సుదర్శనమును బంపెను. అది కృత్యను సంహరించి అంబరీషుని వెన్నంటెను. బ్రహ్మ, శివుడు, విష్ణువు – వీరెవ్వరు. దూర్వాసుని సుదర్శనము నుండి రక్షింపరైరి. తుదకతడు అంబరీషునే శరణు జొచ్చెను. అంబరీషుడు సుదర్శనమును ప్రార్థించి దాని నుపశమింప జేసెను.

ఈ కథలో జగద ప్రతిహతమైన బ్రాహ్మణశాపము భాగవతుడైన అంబరీషునిఎడ నిష్ఫలమయ్యెనని చెప్పబడినది.

ఇట్లు పై కథలలో సత్వగుణ ప్రధానమైన బ్రాహ్మణతేజము నిర్గుణుడైన భగవంతునిముందు నిష్ప్రయోజనమని తెలియుచున్నది. బ్రాహ్మణుల విషయ మిట్లుండ చాతుర్వర్ణములు భగవంతు డేల సృష్టించెను ?

చాతుర్వర్ణములు :- గీతయందు భగవంతు డిట్లు తెలిపెను.

శ్లో॥ చాతుర్వర్ణ్యం మయా సృష్టం గుణకర్మ విభాగశః
తస్య కర్తారమపి మాం విద్ధ్య కర్తార మవ్యయమ్
గీత 4-13

సత్త్వరజస్తమోగుణ విభాగముచేతను కర్మవిభాగము చేతను నాచే నాలుగు వర్ణములు సృజింపబడెను. వానికి కర్తను నేనైనను మాయకు వశుడను గాకపోవుటచేత నాకట్టి కర్తృత్వములేదు.

అనగా మాయ సత్వరజస్తమో గుణాత్మకమైనది భగవంతుని

అధ్యక్షతచేతనే త్రిగుణములతో సృష్టి జరిపినది. మానవులు త్రిగుణాత్మకులు. అందులో సత్వగుణప్రధానమువలన బ్రాహ్మణులు. సత్వోపసర్జన రజమువలన క్షత్రియులు. తమ ఉపసర్జన రజఃప్రధానముచేత వైశ్యులు, రజ ఉపసర్జన తమఃప్రధానముచేత శూద్రులు గుణకర్మ విభాగమున ఏర్పడిరి.

శ్లో॥ బ్రాహ్మణ క్షత్రియ విశాం శూద్రాణాంచ పరంతపః
కర్మాణి ప్రవిభక్తాని స్వభావ ప్రభవై ర్గుణైః గీత 18-41

బ్రాహ్మణ క్షత్రియ వైశ్య శూద్రులకు కర్మములు స్వభావమునుండి పుట్టిన గుణములచే విభజింపబడినవి. అనువంశికముగా (heriditary) సంభవించి సత్వప్రధానములైన శమదమాది స్వాభావిక సాత్విక లక్షణములు సంక్రమించుటచేత బ్రాహ్మణులకు క్రింది కర్మలు విధింపబడినవి.

శ్లో॥ శమో దమ స్తప శ్శౌచం క్షాన్తి రార్జవ మేవచ
జ్ఞానం విజ్ఞాన మాస్తిక్యం బ్రహ్మకర్మ స్వభావజమ్
గీత 18-42

అంతరింద్రియ నిగ్రహము, బహిరింద్రియ నిగ్రహము, తపస్సు, శౌచము, క్షమ, ఋజుత్వము, జ్ఞానము అనుభవజ్ఞానము, ఈశ్వరుడు గలడను నమ్మకము, ఇవి బ్రాహ్మణునకు స్వాభావములగు కర్మములు.

అట్లే క్షత్రియులకు

శ్లో॥ శౌర్యం తేజో ధృతి ర్దాక్ష్యం యుద్ధేచా ప్యపలాయనమ్
దాన మీశ్వర భావశ్చ క్షాత్రం కర్మ స్వభావజమ్
గీత 18-43

శూరత్వము, పరాక్రమము, ధైర్యము, సామర్థ్యము, యుద్ధమున వెనుదీయకుండుట, దాతృత్వము, పరిపాలనా శక్తి యనునవి క్షత్రియునకు స్వభావమైన కర్మములు. వైశ్య శూద్రులకు

శ్లో॥ కృషి గోరక్ష్య వాణిజ్యం వైశ్యకర్మ స్వభావజమ్
పరి చర్యాత్మకం కర్మ శూద్రస్యాపి స్వభావజమ్
గీత 18-44

వ్యవసాయము, పశు సంరక్షణము, వ్యాపారము ఇవి వైశ్యుల స్వభావ కర్మములు. పరిచర్యచేయుట శూద్రుల స్వభావము.

అయితే వారివారి కర్మలు వారు ఈశ్వరార్పణబుద్ధితో నిష్కామముగా ఆచరించిన ముక్తి లభించునని పరమాత్మ వచించెను.

శ్లో॥ స్వే స్వేకర్మ ణ్యభిరత స్సం సిద్ధిం లభతే నరః
స్వకర్మ నిరత స్సిద్ధిం యథా విన్దతి తచ్ఛృణు
— గీత 18-45

శ్లో॥ యతః ప్రవృత్తి ర్భూతానాం యేన సర్వమిదం తతమ్
స్వకర్మణా తమభ్యర్చ్య సిద్ధిం విన్దతి మానవః
— గీత 18-46

ప్రతివాడును కర్మములయం దాసక్తి గలవాడైనచో జ్ఞానయోగ్యు డగును. తన కర్మను విడువకుండువాడు సిద్ధినెట్లు బొందుచున్నాడో వినుము. సర్వభూతములకు బుట్టుక మొదలగు వ్యాపార మెవ్వరివలన గలుగుచున్నదో ఏ పరమాత్మ ఈ ప్రపంచమంతటను నిండియున్నాడో అట్టి పరమాత్మను స్వకర్మచే బూజించు మానవుడు సిద్ధిబొందును.

మానవునకు గృహాభివృద్ధికిని సంఘ పురోభివృద్ధికిని తోడ్పడ వలసిన బాధ్యత లున్నవి. రెండవదగు సంఘ పురోభివృద్ధికి చాతుర్వర్ణ్య ధర్మములను చక్కగా నిర్వర్తించవలెను. కేవలము ఒక వర్ణమువలననే సంఘము పురోభివృద్ధి గాంచదు. వైదికకర్మలైన యజ్ఞయాగాదు లొనర్చి దేవతల తృప్తిపరచి వర్షముల కురిపించి దేశము సుభిక్షముచేయు బ్రాహ్మణులుమాత్ర మున్న చాలదు. దేశరక్షణకు క్షత్రియులు వ్యాపారమునకు వైశ్యులు కృషికి శూద్రులు అవసరమే

కదా. అందరికి బాధ్యతలు విధింపబడినవి. ఒకరిపై యొకరు ఆధారపడ వలసియున్నది. ఒకని దేహములో అన్ని అవయవములు తమ తమ కార్యములను సక్రమముగా నిర్వర్తింప గలిగినప్పుడే దేహము స్వస్థతకలిగి ఆరోగ్యముగా పురోగమించును. అట్లే సంఘ పురోభివృద్ధికి అన్ని వర్ణములవారు తమ తమ బాధ్యతలను నెరవేర్చవలయును. అందులకే విరాట్ పురుషుని దేహము మంత్రపుష్పమున నెట్లు వర్ణింపబడినదో చూడుడు.

బ్రాహ్మణో స్య ముఖ మాసీత్
బాహూ రాజన్య కృతః
ఊరూ తదస్య యద్వైశ్యః
పద్భ్యాం శూద్రో అజాయతే

అంగములలో ఏది లోపించినను ముప్పు వాటిల్లును.

అయినచో అనువంశికముగా ఇట్టి వర్ణవిభజన ఏర్పాటుచేయుట ఎందులకని ప్రశ్నింపవచ్చును. అనువంశికముగా శిశువునకు గుణములు సంక్రమించునని ఆర్యుల నమ్మకము. క్షత్రియులకున్న శౌర్యగుణము బ్రాహ్మణులకు లేదు. అందులకే భారతమున బ్రాహ్మణులకు క్షత్రియులకు భేదమిట్లు చూపబడినది.

ఉ॥ నిండుమనంబు నవ్య నవనీత సమానము పల్కుదారుణా
ఖండల శస్త్రతుల్యము.... .... విక్రమీ
రెండును రాజులందు విపరీతము.... ....

నేటి మనస్తత్వ శాస్త్రజ్ఞులుకూడ జీనులవలన వంశములోని పూర్వులనుండి, తల్లిదండ్రులనుండి కొన్ని స్వభావ లక్షణములు గుణములు శిశువునకు సంక్రమించునని ఆ శిశువు పురోభివృద్ధికి అవి పెట్టుబడిగా ఉపయోగపడునని భావించిరి. పరిసర ప్రభావమువలన ఈ సంక్రమించిన గుణములు వృద్ధి చెందునని కూడ భావించిరి. కాని

ఒక్కొక్కపుడు ప్రహ్లాదునివంటి పరమ భాగవతులు రాక్షస కులము నను పుట్టవచ్చును.

## వర్ణవిభజన ప్రకృతి విరుద్ధమా:-

మానవులలో గాక కర్మవిభాగము జంతువులు కీటకములలో కలదా? జీవశాస్త్రజ్ఞులు సృష్టిలోని రహస్యములను పరిశీలించిరి. చీమలలోను, తేనెటీగలలోను కర్మ విభాగము జరిగినదని వారు కనుగొనిరి, చీమ లలో ఒక రాణిచీమ. కొన్ని రాజులనబడు మగచీమలు, సంరక్షణకై కొన్ని సైనికచీమలు, ఆహార సేకరణకై కొన్ని పనిచేయు చీమలు ఏర్పడియున్నవి. ఇట్టి స్వత స్సిద్ధమైన కర్మవిభాగము కొన్ని జీవ రాసుల యందగుపించుచున్నది. అందువలన వర్ణ విభజన ప్రకృతి విరుద్ధము కాదని చెప్పవచ్చును.

## అన్ని వర్ణములకు ముక్తి లభించునా?

తమోగుణము రజోగుణము వీనిని తొలగించుకొని శుద్ధ సత్త్వ గుణము నందుటయే బ్రాహ్మ్యము. "సత్త్వాత్ సంజాయతే జ్ఞానమ్" శుద్ధసత్త్వము లేదా బ్రాహ్మ్యమువలన జ్ఞాన మేర్పడును. ముక్తి లభిం చును. దీనిని తెలుపుటకు ఘటికాచల మాహాత్మ్యమున నొక ఇతి హాసము కలదు.

ఇంద్రద్యుమ్నుడను రాజు విష్ణుభక్తుడై మరణ సమయమున శ్రీహరిని ధ్యానింపక "హరహర"యని పొరపాటున ఉచ్చరించి మర ణించెను. ఆతడు శ్రీప్రదమైన శివపదము అనగా కైలాసము జేరెను. ఈశ్వరుడు వృషభ వాహనారూఢుడై దర్శన మిచ్చెను. "నే నెందు లకు కైలాసము జేరితి?"ననియు "వైకుంఠము నేల జేరనైతి"ననియు ఇంద్రద్యుమ్నుడు ప్రశ్నించెను. అంత శివుడు "నేనులేని విష్ణువులేడు. మాకు భేదములేదు. నీకేమి కావలయునో కోరుకొమ్మ"నెను. "నాకు మోక్షము కావలెనని" ఇంద్రద్యుమ్నుడు కోరెను. "నీవు ఘటికాచల

మున నున్న నరహరిని సేవింపుము. బ్రాహ్మ్యమోక్షములు సిద్ధించు నని శివు డానతిచ్చెను. ఇంద్రద్యుమ్ను డట్లొనర్చి తరించెను.

ఈ కథవలన బ్రాహ్మ్యము సిద్ధించినగాని మోక్షము సిద్ధింపదా, అను ప్రశ్న ఏర్పడును. ఇంద్రద్యుమ్నుడు క్షత్రియుడు, రజోగుణము కలవాడు. అతనికి శుద్ధసత్వగుణ మేర్పడినగాని జ్ఞానము సిద్ధించదు. తమోగుణము రజోగుణము నశించి శుద్ధ సత్వగుణ మేర్పడినగాని బ్రాహ్మ్యము సిద్ధించదు. తరువాత త్రిగుణాతీతమైన ముక్తి లభించును. అందులకే భాగవతమున "హరిసేవా నిరతింజేసి" నారదునకు రజస్తమోగుణ పరిహారిణియగు భక్తి సంభవించినదని వ్యాసునితో చెప్పికొనెను.

రాజర్షియగు విశ్వామిత్రుడు తపస్సుచేసియు తొలుత మేనకకు లొంగిపోయెను. అతనికి శుద్ధసత్వ మేర్పడువరకు బ్రహ్మర్షిగా వశిష్ఠు డంగీకరింపడయ్యెను. రజస్తమోగుణ పరిహారిణియగు భక్తి నొందని కేవల కర్మ బ్రాహ్మణునకంటె భక్తుడైన చండాలుడు మేలని భాగవతము తెలుపుచున్నది.

శ్లో॥ విప్రా ద్ద్విషడ్గుణ యుతా దరవిందనాభ
పాదారవింద విముఖా చ్ఛ్వపచం వరిష్ఠం
మన్యే తదర్పిత మనో వచనార్థ నేహ
ప్రాణః పునాతి సకలం నతు భూరి మానః

భాగవతము 7-9-10

శ్రీహరి పాదముల నర్చింపని బ్రాహ్మణునికంటె హరి పాదసేవ యొనర్చు చండాలు డుత్తముడు. తన మనస్సు, దేహము, జీవితము భగవంతున కర్పణచేసిన చండాలుడు సర్వమును పునీతము చేయును. బ్రాహ్మణు డెంత పండితుడైనను అట్లు చేయజాలడు.

శ్లో॥ నశూద్రా భగవద్భక్తాః విప్రా భగవతా స్మృతాః
సర్వ వర్ణేషు తే శూద్రా యేహ్యభక్తా జనార్దనే

భగవద్భక్తులు శూద్రులుకారు. వారే విప్రులు. జనార్దనునియందు భక్తిలేనివారు ఏ వర్ణమునకు జెందినను శూద్రులే.

కావున అన్నివర్ణముల వారు తమ వర్ణాశ్రమ ధర్మములను కర్తవ్యములని ఈశ్వరార్పణ బుద్ధితో నిష్కామముగా నిర్వర్తించిన సత్త్వశుద్ధి యేర్పడి జ్ఞానమునకు దారిచూపి ముక్తులను జేయును. అందులకే భగవద్గీత "స్వే స్వే కర్మణ్యభిరతః సంసిద్ధిం లభతే నరః" అని తెలుపుచున్నది.

బ్రహ్మర్షియైన తరువాత విశ్వామిత్రుడు శస్త్రాస్త్ర విద్యల నెరిగియు తానొనర్చు యజ్ఞమును గాపాడుటకు మారీచ సుబాహులను చంపలేదు. అది క్షత్రియ ధర్మమగుటచే శ్రీరామునకు అస్త్ర మంత్రములు నేర్పి అతనిచే చంపించెను. భగవంతుడైన శ్రీరాముడు క్షత్రియుడు. శ్రీకృష్ణుడు యాదవులలో పెరిగెను. అన్ని వర్ణములవారు వారిని దైవములుగా ప్రార్థించిరి.

నేటికాలమున వర్ణాశ్రమ ధర్మముల నిర్మూలింప బూని ఆర్య సమాజము బ్రహ్మసమాజమని క్రొత్త మతములు కల్పింప బడినవి. ఇట్లనేక సమాజము లేర్పడుచున్నవి.

రామాయణము గృహస్థ ధర్మమునకు ప్రాముఖ్యమును, భారతము వర్ణాశ్రమ ధర్మమునకు ప్రాముఖ్యమును, భాగవతము ఆత్యంతిక భక్తికిని ప్రాముఖ్యత నిచ్చినవి. అందువలన మానవుడు గృహస్థ ధర్మము నిర్వర్తించి గృహమును, వర్ణాశ్రమ ధర్మముల నిర్వర్తించి సంఘమును, ఆత్యంతిక భక్తితో దైవసేవ నిర్వర్తించి తన్నుతాను ఉద్ధరించు కొనవలయునని ఫలితాంశము. ఈ మూడును మానవుని కర్తవ్యములు. (బాధ్యతలు, విధులు)

---

# 33. అశ్వత్థము-భాగవతము

శ్లో॥ కరార విందేన పదారవిన్దం
ముఖారవిందే విని వేశయంతం
అశ్వత్థ పత్రస్య పుటే శయానం
బాలం ముకుందం మనసా స్మరామి

చేతిలో ఒక పాదమును పట్టుకొని ఆ పాదముయొక్క బొటన వ్రేలిని నోటిలో నుంచుకొని అశ్వత్థ పత్రముపై శయనించి యున్న బాలకృష్ణుని స్మరించుచున్నాను.

భాగవతము, రామాయణము కల్పవృక్షములతో పోల్చబడినవి. భారతము పారిజాత వృక్షముతో పోల్చబడినది. ఈ వృక్షముల సంకేతార్థము తెలిసికొనుటకు అశ్వత్థవృక్షమును గూర్చి తెలిసికొనవలయును. అనేక గ్రంథముల యందు అశ్వత్థప్రసక్తి కనిపించుచున్నది.

శ్రీ మహాభారతమున ఆదిపర్వమున శ్రీకృష్ణుడు అవతారము చాలించినప్పుడు అశ్వత్థ తరుమూలమున గూర్చొని తనకు తత్త్వోపదేశ మొనర్చెనని ఉద్ధవుడు విదురునితో తెలిపెను. జగద్గురువగు దక్షిణామూర్తి వటతరు మూలమున నుండెను. విదురాశ్వత్థ క్షేత్రమున పూర్వము విదురుడు అశ్వత్థవృక్షమును నాటెనని తెలుపుదురు. హనుమంతుడు పారిజాత తరుమూలవాసి. నారదునకు రాగిమ్రాను క్రింద హృదయమున శ్రీహరి దర్శనమిచ్చెను. ఇట్లు వృక్షప్రసక్తి అనేక గ్రంధముల అగుపించును గాని "బ్రహ్మవృక్షమని చెప్పినంత మాత్రమున ప్రయోజనము లేదు. దాని సంకేతమును గ్రహింప వలయు"నని త్యాగరాజు తన పాటలో వ్రాసెను. కాని దాని సంకేతార్థమును గ్రహించుటకు ప్రయత్నింతము.

అశ్వత్థము త్రిమూర్త్యాత్మకమైన వృక్షరాజము

శ్లో॥ మూలతో బ్రహ్మరూపాయ మధ్యతో విష్ణురూపిణే
అగ్రత శ్శివరూపాయ వృక్షరాజాయతే నమః

భవిష్యోత్తర పురాణమున అశ్వత్థ ప్రదక్షిణవిధియందు శ్రీమహా విష్ణువు తానే అశ్వత్థమని తెలిపెను.

శ్లో॥ అహ మశ్వత్థరూపేణ సాలగ్రామ శిలానుచ
తస్మాత్సర్వ ప్రయత్నేన కురుష్వ తరుసేవనమ్

భగవద్గీతలో శ్లో॥ "అశ్వత్థ సర్వ వృక్షాణాం" అని శ్రీకృష్ణుడు వృక్షములలో తానశ్వత్థమని తెలుపుకొనెను.

బ్రహ్మ నారద సంవాదమున ఇట్లు చెప్పబడినది.

శ్లో॥ అశ్వత్థః పూజితో యత్ర పూజితా సర్వదేవతా
రమా బిల్వ శ్శివా నింబ స్తులసీత్యా సరస్వతీ
బ్రహ్మ విష్ణుశ్చ రుద్రశ్చ సాక్షా దశ్వత్థ రూపిణః
మూలం సనాతనం బ్రహ్మ గర్భో అగ్నిః సమిధో హవిః
ఛందాంసి తస్య పర్ణాని వృక్షోసౌ శైవ వైష్ణవః

పై ఉదాహరణములు అశ్వత్థమే త్రిగుణాత్మకమైన సృష్టిరూపమైన భగవద్రూపమని చెప్పుచున్నవి. వేదములు, ఉపనిషత్తులు, గీతలు తంత్రములు, పురాణములు ఈ అశ్వత్థము నెట్లు వర్ణించుచున్నవో గమనింతము.

## 1) అశ్వత్థ వృక్షము లోక విరుద్ధముగా నున్నది :-

బ్రహ్మము అశ్వత్థము:—

వేదమున ఆరణ్యకమునందు అశ్వత్థ వృక్షమును గూర్చి ఇట్లు చెప్పబడినది.

ఊర్ధ్వమూల మవాక్ శాఖం
వృక్షం యోవేద సంప్రతి
న అసజాతు జన శ్రద్ధధ్యాత్
మృత్యుర్మా మారయాదితి

దీనికి విద్యారణ్యు లిట్లు వ్యాఖ్యానము వ్రాసిరి.

లోకమున వృక్షమునకు వేర్లు క్రింది వైపునకును, కొమ్మలు

పై వైపునకును ఉండును గదా. కాని సంసార వృక్షమునకు దీనికి విరుద్ధముగా నుండును.

ఊర్ధ్వమూలం:-

సర్వోత్కృష్టమైన పరబ్రహ్మమే మూలము అగుటచేత పరబ్రహ్మము ఈ లోకఉత్పత్తికి ప్రధాన కారణభూతుడై మూలమువలె నున్నాడు. అతని నుండి బ్రహ్మాది స్తంబ పర్యంతమున్న ప్రపంచ మేర్పడినది. బ్రహ్మమును మూలముగను ప్రపంచమును శాఖోపశాఖలుగను భావించినచో ఈ వృక్షము లౌకిక వృక్షములకు భిన్నముగ కనపించును. ఈ వృక్షమును గూర్చి ఆమూలాగ్రము తెలిసికొన దలచిన ఎడల గురుముఖమున శాస్త్రముఖమున ఎఱుంగదగియున్నది. అట్లు ఎఱిగిన మానవుడు మృత్యువునుండి తరించును. అనగా బ్రహ్మమే త్రిగుణాత్మకమై సగుణ సృష్టిరూపమున అశ్వత్థమై వెలసినది.

## 2) అశ్వత్థమే బ్రహ్మము :-

కఠోపనిషత్తునందు అశ్వత్థ వృక్షమును గూర్చి ఇట్లు చెప్పబడినది.

శ్లో॥ ఊర్ధ్వమూలో హ్యావాక్ శాఖ
ఏషోశ్వత్థః సనాతనః
తదేవ శుక్రమ్ తద్బ్రహ్మ
తదేవామృత ముచ్యతే

ఎగువవేరును దిగువకొమ్మలు కలిగిన పురాతనమైన అశ్వత్థమే బ్రహ్మము. అనగా కారణరూపమైన పరమాత్మ కార్యరూపమైన అశ్వత్థము లేక బ్రహ్మాండముగ అగుపించుచున్నది. "సర్వం ఖల్విదం బ్రహ్మ" అనుటచేత, కనుపించు ప్రపంచము వ్యావహారిక సత్యమైనను, విచారించిన పారమార్థిక సత్యమగు బ్రహ్మమే.

"తజ్జలానితి శాంత ఉపాసీత" అని ఛాందోగ్యములో చెప్పినట్లు జలశబ్దము బ్రహ్మభావమును సూచించుచున్నది. జ=పుట్టినదై; అన్=స్థితిగలదై; ల=లయమునొందు చుండుటచేత సృష్టి పరమాత్మ

కంటె వేరుగాదు. "ఎవ్వనిచే జనించు జగమెవ్వని లోపలనుండు లీనమై ఎవ్వనియందు డిందు" అని భాగవతమున దెల్పిన గజేంద్రుని పలుకులు జలశబ్దార్థమునే సూచించుచున్నవి. "జాయతే లీయతే యత్రజగత్తజ్జలమీరితమ్" అని సూక్తార్థ రహస్యమున జలశబ్ద నిర్వచనముండుట చేత ప్రపంచము దేనినుండి ఉద్భవించుచున్నదో, దేనియందు లయము చెందుచున్నదో అదియే జలము. లేక పరబ్రహ్మము. అందులకే కాళిదాసు జలమును ప్రథమ భూతముగా వర్ణించెను. ఇది పంచ భూతములలోని జలముకాదు. శ్రీదేవి అప్ స్వరూపిణి అని శ్రీసూక్తమున చెప్పినప్పుడు పై జలశబ్దార్థమునే అన్వయించుకొనవలయును.

"ఆపోవా ఇదగ్ సర్వం విశ్వా భూతాన్యాపః
.............భూర్భు వస్సువ రాప ఓం"

అను మంత్రము సర్వము జలరూపమే లేక పరబ్రహ్మ రూపమే అని తెలుపుచున్నది.

శ్లో॥ ఆపో నార ఇతిప్రోక్తా ఆపోవై నర సూనవః
తాయ దస్యాయనం పూర్వం తేన నారాయణః స్మృతః

ఇంతవరకు వేదము ఉపనిషత్తులను పరిశీలించితిమి. వేదమున బ్రహ్మమే అశ్వత్థమనియు, కఠోపనిషత్తున అశ్వత్థమే బ్రహ్మమని చెప్పబడినది కదా. బంగారము ఆభరణముగా వివర్తము చెందినపుడు బంగారము వస్తుతః మార్పు చెందలేదు. ముద్ద బంగారము, ఆభరణము రెండును బంగారమే కదా! అట్లే బ్రహ్మమే జగత్తు; జగత్తే బ్రహ్మము. అశ్వత్థము అనగా అ=న=కాదు; శ్వ=శ్వః=రేపు; త్థ=స్థ=స్థాతా ఉండునది; అనగా రేపు ఉండునది కాదని అర్థము. దృశ్యమగు ప్రపంచము మిధ్య. అధిష్ఠానమగు బ్రహ్మ సత్యమని భావము.

## 3) వైరాగ్యముతో అశ్వత్థమును ఖండింపవలయును:-

భగవద్గీతలో పురుషోత్తమ ప్రాప్తియోగమున అశ్వత్థ మిట్లు వర్ణింపబడి యున్నది.

శ్లో॥ ఊర్ధ్వమూల మధశ్శాఖా
అశ్వత్థం ప్రాహు రవ్యయం
ఛందాంసి యస్య పర్ణాని
య స్తం వేద స వేదవిత్
నరూప మస్యేహ తథో పలభ్యతే
నాంతో నచాది ర్నచ సంప్రతిష్ఠా
అశ్వత్థ మేనం స విరూఢ మూలం
అసంగ శస్త్రేణ దృఢేన ఛిత్వా.

ఈ శ్లోకములకు శంకర భగవత్పాదుల వ్యాఖ్యానమును గమనింతము. అశ్వత్థము ఊర్ధ్వ మూలము కలది. అనగా కాలము కంటె సూక్ష్మమై, అన్నిటికి కారణమై, నిత్యమై, మహత్తై, మాయాశక్తితో కూడిన బ్రహ్మము వేరుగా కలది అశ్వత్థము. దాని ఆకులు వేదములు. దీనిని తెలుసుకొన్నవాడు సకల వేదసారము నెఱిగినవాడు, సర్వజ్ఞుడు. ఈ అశ్వత్థము యొక్క ఆది, అంతము, స్థితి తెలిసికొనుట సులభసాధ్యముకాదు. సమూలముగా ఈ అశ్వత్థమును తెలిసికొని, వివేక అభ్యాస పాటవములచేత పదును పెట్టిన వైరాగ్యమను ఖడ్గముచే దానిని ఛేదింప వలయును. అప్పుడు బ్రహ్మ సాక్షాత్కారము కలుగును.

4) ఈశ్వరోపాధియగు బ్రహ్మాండ మెట్లశ్వత్థమో జీవోపాధియగు పిండాండము (దేహము) కూడ అశ్వత్థమే.

(Man is the image of God)

ఇక పురాణమున చెప్పబడిన అశ్వత్థ స్వరూపమును గమనింతము,

శ్లో॥ అవ్యక్త మూల ప్రభవ
స్తస్యై వాను గ్రహోత్థితః
బుద్ధి స్కంధ మయశ్చైవ
ఇంద్రి యాంతర కోటరః
మహాభూత ప్రశాఖశ్చ
సుఖదుఃఖ ఫలోదయః
ఆజీవ్య స్సర్వ భూతానాం

బ్రహ్మ వృక్షః సనాతనః
ఏత ద్బ్రహ్మ వనంచైవ
బ్రహ్మాచరతి నిత్యశః
ఏతచ్ఛిత్వాచ భిత్వాచ
జ్ఞానేన పరమాసినా
తతశ్చాత్మ రతిం ప్రాప్య
యస్మా న్నావర్తతే పునః

అవ్యాకృతము, మూలప్రకృతి, మాయ, అనెడు వేరునుండి పుట్టి క్రమముగా విస్తరించి, బుద్ధియనెడి బోదెకలదై, నేత్రేంద్రియ రంధ్రములే తొఱ్ఱలుగా కలిగి, పంచభూతములు కొమ్మలుగా కలిగి శబ్దాది విషయములు ఆకులుగా కలిగి, ధర్మాధర్మములు పుష్పములుగా కలిగి, సుఖదుఃఖములు పండ్లుగా కలిగి, పక్షులకు వృక్షమువలె సర్వ ప్రాణులకు జీవనాధారమై బహుపురాతనమైన సంసార వృక్షము (జీవో పాధియగు దేహము) పరమాత్మకు విహారస్థానము. దీనిని జ్ఞానమను కత్తిచే ఛేదించిన కైవల్యము ప్రాప్తించును. అందరి భాగవతమున సంసారవృక్ష మిట్లు వర్ణింపబడినది.

సీ॥ ప్రకృతి యొక్కటి పాదు ఫలములు సుఖదుఃఖ
      ములు రెండు గుణములు మూడు వేళ్ళు
   తగు రసంబులు నాల్గు ధర్మార్థ ముఖరంబు
      లెఱిగెడి విధము లై దింద్రియంబు
   లాఱు స్వభావంబు లా శోకమోహాదు
      లూర్ములు ధాతువు లొక్క యేడు
   పై పొర లెనిమిది ప్రంగలు భూతంబు
      లైదు బుద్ధియు మనోహం కృతులను
   రంధ్రములు తొమ్మిదియు గోటరములు ప్రాణ

   పత్ర దశకంబు జీవేశ పక్షియుగము
   గలుగు సంసార వృక్షంబు

భాగవతము 10-81

## 5) దేహములోని నాడీమండలమే అశ్వత్థము :–

ఉత్తర గీతయందు అశ్వత్థమును గూర్చి ఎట్లు తెలుపబడినదో పరిశీలింతము.

"ఏవం బ్రహ్మాండ నిలయం
తస్మిన్ దేహే ప్రతిష్ఠితమ్"

అనగా "బ్రహ్మాండ మంతయు ఈ దేహమునందే కల్పింప బడి నది." ఇందువలన సమష్టి వ్యష్టులకు, బ్రహ్మాండ పిండాండములకు (Macrocosm and Microcosm) సమానత్వము చూపబడినది. దేహమునందలి సుషుమ్నా నాడియే జగదుత్పత్తికి కారణమని చెప్ప బడినది.

"సుషుమ్నాం తర్గతం విశ్వం
తస్మిన్ సర్వం ప్రతిష్ఠితమ్"

మన దేహమున వెన్నెముక యందు సుషుమ్నా నాడి కలదు. దీనియందు సర్వజగత్తు సర్వము ప్రతిష్ఠింపబడి యున్నది.

"నానా నాడీ ప్రసరగమ్
సర్వ భూతాంత రాత్మని
ఊర్ధ్వమూల మధశ్శాఖా
వాయు మార్గేణ సర్వగమ్

ఈ సుషుమ్నా నాడి సర్వప్రాణుల యొక్క అంతరాత్మ యందు న్నది. సర్వ నాడులకు ఉత్పత్తి స్థానమై యున్నది. ఎగువవేరు దిగువ కొమ్మలు కలదై యున్నది. అనగా సమష్టిలో చెప్పబడిన సర్వసృష్టి రూపమైన అశ్వత్థ మనబడు సంసార వృక్షమే వ్యష్టిలో సుషుమ్నా నాడి యగుచున్నది దాని యందలి కుండలినీ శక్తి జగ త్తున కాధార భూతమగుటచేత సర్వ ప్రపంచము అందులో కలదని చెప్పబడినది,

శ్లో॥ గుదస్య పృష్ఠ భాగేస్మిన్ (దేహేతు పశ్చమే భాగే)
పీణా దండస్య దేహాబ్భృత్

దీర్ఘాస్థి మూర్ధ్ని పర్యంతం
బ్రహ్మదం డీతి కథ్యతే
తస్యాంతే సుషిరం సూక్ష్మం
బ్రహ్మ నాడీతి సూరిభిః
ఇడా పింగళయో ర్మధ్యే
సుషుమ్నా సూక్ష్మ రూపిణీ
సర్వం ప్రతిష్ఠితం తస్మిన్
సర్వగం సర్వతో ముఖం
సుషుమ్నాం తర్గతం విశ్వం
తస్మిన్ సర్వం ప్రతిష్ఠితమ్ ఉత్తరగీత-2 అధ్యాయం

మేరువు లేక బ్రహ్మదండి యనబడు వెన్నెముక యందు 34 పూసలు కలవు (హల్లుల సంఖ్య 34) పూసల దండలో దారమువలె, వెన్నుపూసలలో సుషుమ్నా నాడి కలదు. దాని కిరుప్రక్కల ఇడా పింగళానాడులు కలవు. సుషుమ్నా నాడి బ్రహ్మైక్య ప్రతిపాదక మగుట బ్రహ్మనాడి అను పేరు గాంచినది. ఈ సుషుమ్నయే మన స్సును విషయముపైకి పోవునట్లు చేయును.

6) దేహమునందలి ఊర్ధ్వ అధః కుండలినులే అశ్వత్థము.

---

శంకరాచార్యులు రచించిన ప్రపంచసార తంత్రమునందు షట్చ క్రములను వివరించునప్పుడు దేహము ఊర్ధ్వమూలము అధశ్శాఖము అని సూచింపబడినవి. వెన్నెముక యందు షట్చక్రములు భ్రూమ ధ్యము వరకు కలవు ఇవి క్రింద పట్టికలో చూపబడినవి. ఇదియే అధః కుండలిని. భ్రూమధ్యము నుండి సహస్రారము వరకు ఊర్ధ్వకుండలిని కలదు. దానియందు 1) చంద్ర మండలము 2) అర్ధచంద్రాకారము 3) రోధిని 4) నాదము 5) నాదాంతము 6) శక్తి 7) వ్యాపిక 8) సమనా 9) ఉన్మనా అను 9 చక్రములు కలవు.

బ్రహ్మ రంధ్రమునకు క్రిందుగానున్న సహస్ర కమలాం తర్గత

చంద్రమండలము సర్వకారణ బిందువు. అదియే శివస్వరూపము; తేజోమయము పరమాత్మ; మూలము. ఈ విధముగ శరీరము ఊర్ధ్వ మూలమును అధః శాఖలను కలిగియున్నది. శరీరమువలె బ్రహ్మాం డముకూడ నున్నది.

పైన వివరించిన మూలాధారాది షట్చక్రములు దేహామునం దున్నవి. శ్రీ నృసింహ షట్చక్రోపనిషత్తునందు విశ్వాకారుడైన శ్రీనృ సింహస్వామి యొక్క షట్చక్రములు నారసింహ సుదర్శన చక్రమున అచక్ర సుచక్రాది షట్చక్రరూపమున చెప్పబడినవి. ఇవి బ్రహ్మాం డము నందలి షట్చక్రములు (Cosmic Centres) అని Sir John Woodr off తెలిపియున్నారు.

7) బ్రహ్మాండమును వటవృక్షముతో కూడ పోల్చుచుందురు :-

బ్రహ్మాండమును అశ్వత్థముతోనే గాక వటవృక్షముతో పోల్చు సంప్రదాయము కలదు. శ్రీనృసింహ తాపిని ఉపనిషద్వ్యాఖ్యానమున శ్రీ విద్యారణ్యులు ఈ విధముగా తెలిపిరి.

ఒకే చైతన్యము నాశ్రయించిన మాయారూప అవిద్యయే కారణ మగు ఈశ్వరోపాధిని కల్పించి ప్రపంచమును సృష్టించినది. కార్య మగు జీవోపాధిని కల్పించి పంచకోశాత్మక దేహోపాధులను సృష్టించి నది. వటవృక్ష బీజరూప ఈశ్వరుని నుండి వటవృక్షరూప బ్రహ్మాండ ముత్పన్న మగుచున్నది. బ్రహ్మాండము ద్వారా హిరణ్యగర్భులు, త్రి మూర్తులు (త్రిగుణములు) కలుగుచున్నారు. ఈ త్రిమూర్తులద్వారా సమష్టి వ్యష్టిరూప జగత్తు, జీవులు, దేహోపాధులు కలుగుచున్నవి. వటవృక్షము విహంగాది ప్రాణులకు జీవనాధార మగునట్లే క్షేత్రము అనబడు జీవోపాధులు జీవుల కాధారము లగుచున్నవి. కారణ శక్తి యగు మాయ ఒకే చైతన్యమును ఆ యా పంచభూతాత్మక దేహో పాధులయందు ప్రతిబింబింపజేసి నానావిధ జీవులను సృష్టింపజేయు చున్నది.

## అశ్వత్థవృక్షము

| చక్రములు | పత్రములు | అక్షరములు | శక్తి | భూతము | స్థానము |
|---|---|---|---|---|---|
| 1) మూలాధారము | 4 | వ, శ. ష, స | డాకిని | పృథివీ మండలం | వెన్నెముక క్రిందిభాగము |
| 2) స్వాధిష్ఠానము | 6 | బ, భ, మ, య, ర, ల | రాకిణి | జలమండలం | అపైన |
| 3) మణిపూరము | 10 | డ, ఢ. ణ, త, థ, ద, ధ, న, ప, ఫ | లాకిని | అగ్నిమండలం | నాభిస్థానము |
| 4) అనాహతము | 12 | క, ఖ, గ, ఘ, ఙ, చ, ఛ, జ, ఝ, ఞ, ట. ఠ | కాకిని | వాయుమండలం | హృదయము |
| 5) విశుద్ధము | 16 | అ, ఆ.....................అం, అః షోడశ స్వరములు | సాకిని | ఆకాశమండలం | కంఠము |
| 6) ఆజ్ఞ | 2 | హ, క్ష | హాకిని | మనస్సు | భ్రూమధ్యము |

బీజమునందే వటవృక్షమంతయు నుండి బీజముకంటె వేరుకాని విధమున పరమేశ్వరుని యందే మాయయు ప్రపంచము ఉన్నది. అనగా కారణ కార్యరూపములు రెండు ఆపరమేశ్వరుడే.

జీవేశ్వరులను గూర్చి తెలుపుటకై ఉపనిషత్ప్రతిపాదితమైన ఒక కథ కలదు. ఒక రావిచెట్టుపై రెండు పక్షులు కలవు. ఒక పక్షి వృక్షముయొక్క ఫలములనుభక్షించుచున్నది. రెండవపక్షిసాక్షిగా సర్వము ను చూచుచున్నది. అనగా కార్యమైన జీవుడు అవిద్య అనబడు మాయకు లోబడి ఇంద్రియలోలుడై ప్రపంచమున సుఖదుఃఖముల ననుభవించుచున్నాడు. కారణమైన ఈశ్వరుడు మాయకు లోబడక కేవలము సాక్షీమాత్రముగా చూచుచున్నాడని భావము.

8) వేదములు, పురాణములు బ్రహ్మాండ పిండాండసృష్టిని గూర్చి తెలుపుచున్నవి.

సృష్టి అంతయు మాయవలన త్రిగుణాత్మకముగా చేయబడినది. మాయ సత్వగుణముచే చైతన్య!బహ్మము నభివ్యక్తము చేయుచు బ్రహ్మజ్ఞానమునకు హేతువగుచున్నది. రజోగుణముచే స్పందశక్తి రూపమై చలనాత్మకమైన నానావిధ భేదములకు, సంకల్పములకు, సృష్టికి, భేదజ్ఞానమునకు కారణమగుచున్నది. తమోగుణముచే ఆత్మ చైతన్యమునే ఆచ్ఛాదించి ఆత్మజ్ఞానము కలుగనీయక అజ్ఞానమునకు మూలకారణమగుచున్నది. సత్వగుణముచే ఈశ్వరుని, రజోగుణము చే జీవులను, తమోగుణముచే బహువిధ ప్రపంచమును సృష్టించినది. వేదములు పురాణములు పై సృష్టిక్రమమునే తెలుపుచున్నవి. ఋగ్యజుస్సామవేదములు త్రిగుణాత్మకములు. (త్రైగుణ్య విషయా వేదాః భగవద్గీత). వేదార్థము సుబోధ మొనరించుటకు వ్యాసుడు రచించిన అష్టాదశ పురాణములు కూడ త్రిగుణాత్మకములే. విష్ణు, భాగవత, నారదాది పురాణములు సాత్వికములు. బ్రహ్మాండ బ్రహ్మవైవర్తాది

పురాణములు రాజసములు. శివ, లింగ, మత్స్య ఇత్యాది పురాణములు తామసములు. ఈ అష్టాదశపురాణములు బ్రహ్మపురాణముతో మొదలై, వానిమధ్యలో బ్రహ్మవైవర్త పురాణము, అంత్యమున బ్రహ్మాండ పురాణ మంటుటచేత వరుసగా సృష్టికి పరబ్రహ్మ మూలమై వివర్తము చెంది త్రిగుణాత్మకమైన బ్రహ్మాండము సృష్టింపబడినట్లు చెప్పవచ్చును కదా. ఆగా వేదములు పురాణములు త్రిగుణాత్మకమైన సృష్టివిద్యను తెలుపుచున్నవి.

3) పురాణములు వృక్షములతో పోల్చబడినవి.

భాగవత, భారత, రామాయణాది పురాణములు పారిజాత కల్ప వృక్షములతో పోల్చబడినవి. ఈ వృక్షములే సృష్టి రహస్యమును తెలుపు అశ్వత్థములు. "లలిత స్కంధము" అను భాగవత నిర్వచన పద్యమును మూడు అర్థములతో చెప్పవచ్చును.

1) అశ్వత్థము, వటవృక్షము, కల్పవృక్షము, బ్రహ్మవృక్షము ఇత్యాది వృక్షములచే పోల్చబడిన ఊర్ధ్వమూలము అధశ్శాఖమైన బ్రహ్మాండ సృష్టిపరముగ పోల్చవచ్చును.

2) వ్యష్టిగా జీవోపాధులైన దేహములందుగల నాడీమండల పరముగ పోల్చవచ్చును.

3) భాగవతము నిగమంబునన్ బోలె గాయత్రి విరాజితం బగుట గాయత్రిపరముగ పోల్చి చెప్పవచ్చును.

పై విషయములను రెండవ అధ్యాయమున భాగవత నిర్వచనముల యందు నిరూపించితిని.

పర్యవసాన మేమనగా భగవంతుడే త్రిగుణాత్మకుడై సగుణ రూపమున వివర్తముచెంది అశ్వత్థమును బోలిన బ్రహ్మాండమును సృష్టించెను. బ్రహ్మాండ పిండాండములకు ఏకత్వమును ప్రతిపాదించుటచేత పిండాండమైన దేహమునందలి నాడీమండలమే అశ్వత్థము. దీనినే కల్పవృక్షమని, పారిజాతమని, బ్రహ్మవృక్షమని, సంసార వృక్షమని పురాణములు చెప్పుచున్నవి.

"దేహో దేవాలయః ప్రోక్తః" దేహమే దేవాలయము. దేహములోని నాడీమండలము ననుసరించియే దేవాలయ నిర్మాణము జరిగినది. ఉదాహరణమునకు తిరుపతి దేవాలయ నిర్మాణమును గమనింతము. అలమేలు మంగతాయారును కుండలినీ శక్తిగను, మంగాపురమునుండి కొండపైనున్న వెంకటేశ్వరస్వామిని చేరు కాలిబాటను సుషుమ్నానాడిగను భావింపవలయును. మంగాపురమున సూర్యుని దేవాలయము సూర్యుని కొలను కలదు. అక్కడనుండి కపిలతీర్థము మీదుగ కొండపైకిగల మార్గము సూర్యనాడి లేక ఇడానాడి. చంద్రగిరి యందు చంద్రుని దేవాలయము చంద్రునికొలను కలదు. అక్కడనుండి కొండపైన స్వామిని చేరగల మార్గము చంద్రనాడి లేక పింగళనాడి. శ్రీ వెంకటేశ్వరుడు సహస్రారాంతర్గత పరమేశ్వరుడు. పై విధముగా తిరుపతి దేవాలయము నాడీమండల స్వరూపమును సంకేతరూపమున వ్యక్తము చేయుచున్నది.

## మన కర్తవ్యము :-

శ్లో॥ ఏత చ్ఛిత్వాచ భిత్వాచ జ్ఞానేన పరమాసినా
తత శ్చాత్మరతిం ప్రాప్య యస్మాన్నా వర్తతే పునః

ఇట్టి అశ్వత్థవృక్షమును, బ్రహ్మాండ పిండాండముల యందును, సమష్టివ్యష్టుల యందును (Macrocosm, Miciocosm) ఈశ్వరోపాధి జీవోపాధులయందును చక్కగా తెలిసికొని వివేకము అభ్యాస పాటవముచే పదునుపట్టిన వైరాగ్యమను ఖడ్గముచేత ఖండించి ఆత్మాభిన్నముగ గుర్తించుట మన కర్తవ్యము. దృశ్యమగు ప్రపంచము మిథ్య. అధిష్ఠానమగు బ్రహ్మము సత్యమని గ్రహింపవలయును. ఈ పరమ సత్యమును తెలుపుటకే పురాణములు అశ్వత్థాదివృక్ష సంకేతములతో పోల్చబడినవి. ఈ అభిప్రాయమునే పోతన "లలితస్కంధ" మను భాగవత నిర్వచన పద్యమున సూచించెను.

---

# 34. పోతన మహాకవి

లోక కల్యాణమునకు నిస్వార్థముగ కృషిసలిపి మానవ హృదయములలో మార్పు తేగలిగినవారు మహాత్ములని నిర్వచింపవచ్చును. ఉదాహరణమునకు గాంధిజీ నిస్స్వార్థముగ కృషిసలిపి స్వాతంత్ర్యమును సంపాదించి, మానవ కల్యాణమును గూర్చి, సత్యాగ్రహ అహింసా సందేశములను ప్రపంచమునకు చాటుటచేత మహాత్మ డనిపించు కొనెను. ఇట్టి మహాత్ములొక పనిని చేసినప్పుడు త్రికరణశుద్ధిగా చేయుదురు. అనగా మనసులో నిశ్చయించినదానిని వాక్కుతో తెలిపి కాయముతో చేయుదురు. దుర్జను లట్లుగాక మనసులో నొకటి తలపోసి నోటితో వేరొకటి చెప్పి తుదకు కాయముతో ఇంకొకదానిని చేయుదురు. కాబట్టి 1) స్వార్థబుద్ధి 2) లోకకల్యాణాపేక్ష 3) త్రికరణ శుద్ధిగా కార్యాచరణము అను మూడు పరీక్షలను మహాత్మునిగా నెన్నుకొనుట కుపయోగించవలెను. ఈ లక్షణములు పోతనకు వర్తించునా యని పరీక్షింతము.

భగవత్తత్త్వార్థ ప్రతిపాదకములైన వేదాంత విషయములు కలిగి కర్మ భక్తి జ్ఞాన మార్గ బోధకములైన కథావిశేషములతో రూపొందిన మహా కావ్యమగు భాగవతము నాంధ్రీకరించుటకు పరమ భాగవతుడగు పోతనయే తగినవాడు. అతడు "శ్రీ కైవల్య పదంబు జేరుటకునై" భాగవతము నాంధ్రీకరించెను. కైవల్య మతని పరమ ధ్యేయము. దానిని సాధించుమార్గము భక్తిమార్గము. కాన మోక్షగ్రంథమై భక్తిరస ప్రధానమైన భాగవతము నత డాంధ్రీకరించెను.

పోతన ఆచరణలో నుంచుకొన్నది భాగవత ప్రతిపాదిత ఆత్మంతిక భక్తిమార్గము. "మహాత్ములైనవారు నిజమనోరథ ఫల దాయకంబు లయ్యును (శ్రీకృష్ణ) సేవావిరహితంబులైన ఇతర కార్యంబుల

నాచరింప నొల్లరు" అని భాగవతము మహాత్ముడైన ఆత్యంతిక భక్తుని లక్షణము తెలిపినది. పోతన భాగవతాంధ్రీకరణ మను భగవత్కైంకర్యమునందే జీవితమును గడపెను. "శ్రీ మన్నారాయణుని బాయక నిర్హేతుకముగా తద్వ్యైక చిరతర భక్తితో నిష్కాము" డయ్యెను. అతనికి ఐహిక సుఖములందుగాని కీర్తి ప్రతిష్ఠల యందుగాని ఆసక్తి లేదు.

పోతన పరీక్షిత్తువలె మోక్షమును గోరి ధర్మార్థకామముల సన్యసించెను. దారిద్ర్యమునే వరించి రాజాశ్రయమును గోరక సాత్త్విక భక్తితో జీవితము గడపి సాత్త్విక పురాణమైన భాగవతము నాంధ్రీకరించెను. రజస్తమోగుణ పరిహారిణియగు భాగవత భక్తి సందేశమును మానవులకు చాటిచెప్పి లోక కల్యాణమునకు తోడ్పడెను. అతని సమకాలికుడగు శ్రీనాథుడు పెక్కు కావ్యముల రచించియు అర్థకామముల యందాసక్తి విడువలేక రాజుల నాశ్రయించెను. రాజన భక్తుడై నిష్కామకర్మ నాచరింప డయ్యెను. అంత్యమున రాజులచే శిక్షింపబడి మరణించెను.

పోతన దృష్టి భక్తిరస పోషణమందే నిమగ్నమయ్యెను. కవులలో శ్రేష్ఠుడైన కాళిదాసు వాగర్థముల పోషించెను. తిక్కన శబ్దమునకుగాక అర్థమునకు ప్రాధాన్యత నిచ్చెను. పాండురంగ విజయము పదగుంభనమునకు ప్రసిద్ధి. రామరాజభూషణుని కవిత్వము సంగీతమయము. కాని భక్తపోతన ముఖ్యోద్దేశము భక్తిభావమును పోషించుటయే కదా. అందువలన శృంగారరసము భక్తిశృంగారముగా మారినది. శ్రీకృష్ణుడే మూర్తీభవించిన శృంగారము. "మధురాధిపతే రఖిలం మధురమ్" మోక్షగ్రంథమైన భాగవతమున భక్తిరసము ప్రధానము దానిని పోషించుటకై ఇతర రసములు పోషింపబడినవి. భక్తి అనునది రసముకాని రసము. పోతనచేతిలో అది రసరాట్టుగా పరిణమించి

నది. వీరసమైన భక్తిని రసమయముగా చేయుట విరసమును అమృత ముగా నొనర్చుట వంటిదికదా? పండితుడు రసజ్ఞుడు అగు పాఠకుడు ఒక కావ్యములోని నవరస పోషణము తిలకించి తల యూపవచ్చును. కాని ఎక్కువ పాండిత్యము రసజ్ఞతలేని సామాన్యపాఠకుడుకూడ భాగ వతములోని గజేంద్రమోక్షము కుచేలోపాఖ్యానము మొదలగు కథలను పఠించునప్పుడు అతని మనస్సు భక్తిరసభరితమై కన్నీరు స్రవించుట అనుభవ పూర్వకముగా మనము చూచుచునే యున్నాముకదా? భాగవత భక్తిరసపోషణము పూర్ణముగా జరిగిన దనుటకు పాఠకుని ఆనంద బాష్పములే నిదర్శనములు.

భాగవతమున భక్తిరసము ప్రధానము. దానిని పోషించుటకై ఇతర రసములు పోషింపబడినవి. అవి అప్రధానములు. వాగర్థములు, అలంకారముల వంటి పై మెరుగులు మొదలగునవి భక్తిభావము వెల్లి విరియుటకే ఉపయోగింపబడినవి. రెండర్థముల గూర్చు పద్యములుకూడ దశావతార వర్ణనమునందే ఉపయోగింపబడినవి. అనగా ఛందో వ్యాక రణ నిబంధనము నవరసపోషణము భగవత్కైంకర్య రూపములై దా సోహ మనినవి. హిరణ్యకశిపుడు తెలిపిన సీ॥ "భుజశక్తి నాతోడ బోరాడ శంకించి, మున్నీట మునిగిన మునుగుగాక" చాణూరుడు తెలి పిన "సీ॥ చలమున నను బాసి జలరాసి జొరరాదు". గోపికలు వస్త్రాప హరణ సమయమున తెలిపిన "సీ॥ బహుజీవనముతోడి" ఇత్యాది సీస పద్యములలో దశావతారములే ధ్వనించుచు వ్యంగ్య వైభవము గోచ రించుచున్నది. కథలయందు నవరసములు పోషింపబడినను భక్తి రసము అంతర్లీనమై యున్నది. కావున లోకకల్యాణమునకై భక్తి సందేశము నొసగిన పోతన కృతకృత్యుడయ్యెను. పోతన అందరివలె కుకవి [illegible] చేయలేదు. పూర్వకవులను స్తుతించి భావి కవులను సం భావించి ఉదార హృదయుడు.

[illegible]పశబ్దంబులు గూడియున్ హరి చరిత్రాలాపముల్ సర్వపావ

పరిత్యాగము సేయు"నని పోతన గట్టినమ్మకము. భక్తిపారవశ్యమున సహజపాండిత్య బిరుదాంకితుడగు పోతనకు ఛందోవ్యాకరణ దోషము లగుపించలేదు. ఈ కారణముచే కొందరు లాక్షణికు లతనిని మహాకవిగా అంగీకరింపలేదు. కాని పోతన ఔన్నత్యమును నిర్ణయించి మహాకవిగా పరిగణించుటకు అతని ధ్యేయమైన భక్తిరసపోషణములో అతని కృషి ఫలించినదా యను మానదండముతో మాత్రమే కొలువ వలయును. ఇతర విషయము లప్రధానములు. సరియగు మానదండముతో కొలిచిన పోతన మహాకవి యనుట నిర్వివాదాంశ మనుటకు పోతనపై కూచిమంచి తిమ్మకవి అభిప్రాయమును తిలకింపుడు.

సీ॥ అఖిల వేదాంత విద్యారహస్య విదుండు
  సహజ పాండిత్య విశారదుండు
మత్త క్షితీశాధమ స్తోత్రవిముఖుండు
  శంభు పదాబ్జ పూజారతుండు
పటుతర కవితా విభాసిత ప్రముఖుండు
  సకలాంధ్ర లక్షణ చక్రవర్తి
రఘుకులేశ నిదేశ రచిత మహాభాగ
  వత పురాణుడు పుణ్య వర్ధనుండు

తే॥ బుధజన హితుండు బమ్మెరపోత సుకవి
ఎన్న రేఫ అకారంబు లెఱుగ డనుచు
అజ్ఞలౌకకొంద రాడుదు రామహాత్ము
కవిత కెందును లోపంబు కలుగ దధిప!

ఇంకను ఇతర పండితుల అభిప్రాయములను గమనింపుడు.

సీ॥ ఘనుడు పోతనమంత్రి మును భాగవతము ర
  చించి చక్రికి సమర్పించు వేళ
సర్వజ్ఞ సింగమ క్ష్మావరుడది తన
  కిమ్మని వేడిన నిడక యున్న

వలిగి యా పుస్తకం బవని బాతించిన
జివికి యందొక కొంత శిథిలమయ్యె
క్రమ్మర నది వెలిగందల నారవ
రాజు మరి బొప్పరాజు గంగ
రాజు మొదలగు కవివరుల్ తేజ మొసగ
జెప్పి: రా గ్రంథముల యందె తప్పులొదవె
గాని పోతన కవీంద్రుని కవిత యందు
లక్షణం బెందు దప్పదు దక్షహరణ!

సర్వలక్షణ 3-266

ఉ॥ బమ్మెర పోతరాజకృత భాగవతంబు సలక్షణంబుగా
కిమ్మహి నేమిటం గొదవ? ఎంతయు నారసిచూడగా మరే
షమ్ములు జాలునుం గలసి ప్రాసములై తనరారినం గదా
యిమ్ముల నాదిలాక్షణికు లెల్లరు మాని రుదాహరింపగన్

అప్పకవీయము 3-234

# పోతన ప్రతిజ్ఞ

వికటకవి యగు తెనాలి రామకృష్ణుడు కవులనుగూర్చి విమర్శించుచు భట్టుమూర్తి బావురమని ఏడ్చెననియు, ముక్కుతిమ్మన ముద్దు ముద్దుగా ఏడ్చెననియు, అల్లసాని పెద్దన అటువిటు ఏడ్చెననియు వారి కావ్యములలోని నాయికల విలాపములను వర్ణించు పద్యముల నాధారము చేసికొని చమత్కారముగా గేలిచేసెను.

భట్టుమూర్తి వ్రాసిన వసుచరిత్రలోని నాయికయైన గిరిక ప్రియ సమాగమము పొందలేక విరహ వేదనతో విలపించెను.

శ్లో॥ అజాబిల్లి వెలుంగు వెల్లికల దాయన్ లేక రాకా నిశా
రాజశ్రీ సఖమైన మోమున బటాగ్రం బొత్తి యెల్గెత్తి యా
రాజీవానన ఏడ్చె గిన్నరవధూ రాజత్ కరాంభోజ కాం
భోజీమేళ విపంచికారవ సుధా పూరంబు తోరంబుగన్

పై పద్యమున విప్రలంభ శృంగారము పోషింప బడినది.

అట్లే ముక్కుతిమ్మన పారిజాతాప హరణమున విరహమున కోర్వలేక సత్యభామ ఏడ్చెను.

ఉ॥ ఈసునబుట్టి డెందమున హెచ్చిన శోక దవానలంబుచే
గాసిలి ఏడ్చె ప్రాణవిభు కట్టెదుటన్ లలితాంగి పంకజ
శ్రీసఖమైన మోముపయిఁ జేల చెఱంగిడి బాల పల్లవ
గ్రాస కషాయకంఠ కలకంఠ వధూ కల కాకలీధ్వనిన్

అట్లే అల్లసానిపెద్దన వ్రాసిన మనుచరిత్రములో వరూధిని ప్రవరాఖ్యుని వరించి వేదన నెపముతో నేడ్చెను.

ఉ॥ పాటున కింతు లోర్తురె? కృపా రహితాత్మక! ఈ వుత్రోవ ని
చ్చోట భవన్న ఖాంకురము సోకె గనుంగొను మంచు జూపి యా
పాటలగంధి వేదన నెపంబడి యేడ్చె గలస్వనంబుతో

పై పద్యములయందు విరహతాపము వర్ణింప బడినది. ఈ విర

మైన పద్యములను శ్రీనాథుడు పోతనకూడ వ్రాసిరి. శ్రీనాథుని పద్యమును గమనింపుడు.

చ॥ కొసరి వసంత కాలమున కోయిల క్రోల్చిన భంగి ఏడ్చె న
బ్బిసరుహనేత్రి! కొండపయి పెద్ద యెలుంగున వెక్కివెక్కి వె
క్కసమగు మన్యు వేగమున కాటుక కన్నుల నీరు సోనలై
ఉసిరగ కాయలంతలు పయోధరముల్ దయివారునట్లుగన్

భాగవతమున పోతనకూడ చిత్రకేతుని భార్య పుత్రి శోకమున నిట్లు విలపించెనని వ్రాసెను.

ఉ॥ కుంకుమ రాగరమ్య కుచకుంభములన్ గడు గజ్జలంబుతో
బంకిలమైన బాష్పముల పాల్పడ మజ్జన మాచరించుచున్
గంకణ పాణిపల్లవ యుగంబున వక్షము మోదికొంచు నా
పంకరుహాక్షి ఏడ్చె బరిభావిత పంచమ సుస్వరంబునన్

ఇంకను పురంజనోపాఖ్యానమున

చ॥ అనయము నిట్లు శోక విపులాశ్రు పయః కణ సిక్తమానిత
స్తనయుగయై వియోగ పరితాపమునన్ హృదయంబు మోద శో
భన లలితా ధరోష్ఠ నవపద్మము గందగ సుస్వరంబుగా
వనజ దళాక్షి యేడ్చె ననివారణ దద్విపినాంతరంబునన్

భాగవతము 4-842

పై పద్యముల వలెగాక పోతనవ్రాసిన క్రింది పద్యమును జాగ్రత్తగా పరిశీలింపుడు. ఇందులో చదువుల తల్లియైన సరస్వతి విలపించు నట్లు చిత్రింప బడినది.

ఉ॥ కాటుక కంటినీరు చనుకట్టు పయింబడ నేల నేడ్చెదో
కైటభదైత్య మర్దనుని గాదిలి కోడల! యో మదంబ! యో
హాటక గర్భురాణి! నిను నాకటికై గొనిపోయి అల్ల క
ర్ణాట కిరాట కీచకుల కమ్మ, త్రిశుద్ధిగ నమ్ము భారతీ!

ఇది పోతనచేసిన ప్రతిజ్ఞ. ఈ పద్యములో "కాటుక కంటినీరు

చనుగట్టు పయిం బడ" అనుటలో శృంగార రసపోషణము జరిగినదా? పోతన రసికుడని భావించవచ్చునా? "మదంబ!" యను సంబోధన ముందుటచేత తల్లియొక్క అంగవర్ణనము సేయుట భావ్యమా? అను శంక లేర్పడును.

పార్వతి, సీత, జగన్మాతల అంగసౌష్టవము వర్ణించు నప్పుడు మహాకవులు ఏ మార్గము ననుసరించిరో పరిశీలింతము.

కాళిదాసు కుమార సంభవమున జగన్మాతయగు పార్వతి పంచాగ్ని మధ్యమున తపమొనర్చు నప్పుడు ఆమెను వర్ణించెను. ఆమెపై పడిన వర్ష బిందువులు జారుటను నెపముగా తీసికొని వ్యంగ్యముగా ఆమె అంగ సౌష్టవమును తెలిపెను చూడుడు. శ్రీనాథుడా వర్ణనము నిట్లాం ధ్రీకరించెను.

"జలధర జలబిందుధారలు పక్ష్మపాళీక్షణ స్థితంబులును, పయోధ రోత్సేద నిపాత చూర్ణితంబులును, త్రివళీవలయ స్ఖలితంబులును నాభి గహ్వర ప్రవిష్టంబులును" అయ్యెను. ఇందులో పార్వతి కంటిరెప్పల సౌందర్యము, కుచకాఠిన్యము కడుపుపై మృదుతలు, లోతైన నాభి వర్ణింపబడినవి. కాని ఈ వర్ణన నేరుగా గాక జలబిందువులు ఆమెపై బడి జారు నెపముతో వ్యంగ్యముగా ధ్వనింపజేయ బడినది.

అట్లే వాల్మీకి మహర్షి సీతాదేవియొక్క అంగసౌష్టవమును పూర్తిగా ఆమె నోటనే బలికించెను. యుద్ధకాండలో 48వ సర్గయందు రామలక్ష్మణులు మూర్ఛచెందిన తరువాత వారు చనిపోయిరని రాక్షసులు అబద్ధమాడిరి. ఆ వార్త విని ఆమె దుఃఖించి త్రిజటతో పుష్పకవిమాన మెక్కి యుద్ధభూమి కరుదెంచి ఇట్లు విలపించెను. "నేను బాలికగా నున్నప్పుడు, మహర్షులు నా సాముద్రిక లక్షణముల తిలకించి నేను చక్రవర్తి భార్యనగుదునని తెలిపిరి. అట్టి మహానుభావుల వాక్యములు వ్యర్థమై నాకు వైధవ్యము సంభవించెను కదా?" ఇట్లు విలపించుచు తనకు తానుగ తన అంగసౌష్టవమును తననోట వెల్లడించుకొనెను.

శ్లో॥ ఊచర్లక్షణినో యే మాం
పుత్రిణ్యవిధ వేతిచ
తేఽద్య సర్వహతే రామే
జ్ఞానినోఽనృత వాదినః

సాముద్రిక లక్షణములు తెలిసి ఎవరు నన్ను పుత్రవతియనియు విధవ కాదనియు చెప్పిరో వారందరు శ్రీరాముడు యుద్ధమున చనిపోగా అబద్ధము చెప్పినవారైరి.

శ్లో॥ వైధవ్యం యాంతి యైర్నార్యో
లక్షణై ర్భాగ్య దుర్లభాః
నాత్మన స్తాని పశ్యామి
పశ్యంస్త్రీ హత లక్షణా

ఏ లక్షణములున్న స్త్రీలు నిర్భాగ్యురాలై వైధవ్యమును పొందుదురో అట్టి దుష్ట లక్షణములు నాయందు లేవు. కారని నాకుగల శుభ లక్షణములన్నీ వ్యర్థములైనవి.

శ్లో కేశాస్సూక్ష్మ స్సమా నీలా
భ్రువౌచ సంగతే మమ
వృత్తే చారోమశే జంఘే
దంతాశ్చా విరళా మమ

నా తల వెంట్రుకలు సూక్ష్మములై సమములై నల్లగా నున్నవి. నా కనుబొమ లొండొంటితో సంబంధింపబడున్నవి. నా పిక్కలు గుండ్రములై వెంట్రుకలు లేకున్నవి. నా పండ్లు విరళముగా గాక దట్టముగా ఒండొంటిం గలసియున్నవి.

శ్లో॥ శంఖే నేత్రే కరౌ పాదౌ
గుల్ఫా వూరూచమే చితౌ
అనువృత్త నఖా స్స్నిగ్ధా
సమా శ్చాంగుళ యో మమ

నా కన్నులకు పార్శ్వంబుల నుండు లొలటి ప్రదేశంబులును

నేత్రంబులను, హస్తములను, పాదములను, జీల మందలును, దొడలను బలిసి యున్నవి. నా యంగుళులు గుండ్రిములైన నఖములతో నొప్పుచు స్నిగ్ధములై సమంబులై యున్నవి.

శ్లో॥ స్తనౌ చా విరాళా పీనౌ
సమేమౌ మగ్న చూచుకౌ
మగ్నాచో త్వంగినీ నాభిః
పార్శ్వే రసాక్షశ్చమే చితా

నాస్తనము లొండొంటి నారసికొని కొంచెము పల్లముగాను, అగ్రిములు కలిగి చక్కగా బలిసియున్నవి. నా నాభియు మిక్కిలి లోతుకలిగి యున్నతములగు పార్శ్వములతో నొప్పుచున్నది. నా పార్శ్వములును బొమ్మును మాంసములుగా నున్నవి.

శ్లో॥ మమ వర్ణో మణి విభో
మృదూన్యంగరు హాణిచ
ప్రతిష్ఠితాం ద్వాదశభి
ర్మామూచు శ్శుభ లక్షణాం

నా మేని రంగు రత్నమువలె స్నిగ్ధముగా నున్నది. నా మేని వెండ్రుకలు మృదులముగా నున్నవి. శాస్త్రజ్ఞులు నా పాదంబుల పది వేళ్ళు రెండుపాదతలంబులును నేలనాని యుండుట వలన నన్ను శుభ లక్షణములు కలదానినిగా జెప్పిరి.

శ్లో॥ సమగ్ర యవ మచ్ఛిద్రం
పాణి పాదంచ వర్ణవత్
మన్దస్మితే త్యేవచ మాం
కన్యా లక్షణినో ద్విజాః

నా హస్తంబులును, పాదంబులును, పూర్ణమైన యవాకారరేఖతో నొప్పుచు వ్రేళ్ళ నెంతమాత్రము సందులేవివై కాంతిమంతములై యున్నవి. కన్యాలక్షణములు తెలిపిన బ్రాహ్మణులు నన్ను ఎల్లప్పుడును చిరునవ్వుగల దానినని చెప్పిరి.

శ్లో॥ అధి రాజ్యేఽభిషేకో మే
బ్రాహ్మణైః పతినా సహ
కృతాన్త కుశలై రక్తం
తత్సర్వం వితథీకృతమ్.

జ్యోతిశ్శాస్త్రమునందు సమర్థులగు బ్రాహ్మలు నాకు బెనిమిటితో కూడ సామ్రాజ్య పట్టాభిషేకము కలుగునని చెప్పిరి. ఇప్పుడదంతయు వ్యర్థమైనది.

పై విధముగ సీతాదేవి తన సాముద్రిక లక్షణములు త్రిజటకు చెప్పు మిషచేత ఆ వాల్మీకి ఆమె అంగసౌష్టవమును పూర్తిగా ఆమె నోటనే పలికించి ఔచిత్యమును పాటించెను.

మహాకవియగు పోతన జగన్మాత యగు సరస్వతీదేవి అంగ సౌష్టవమును తానే స్వయముగా వర్ణించునా? అనౌచిత్యమును రస భంగమును కలుగజేయునా?

అమిత దుఃఖము కలిగినప్పుడు కన్నీరు ఎక్కువగా స్రవించి కన్నుల మధ్యనుండి క్రిందకు చుక్కలుగా చనుగట్టుమీద పడుట సహ జమే. పోతన కట్టి సరస్వతీదేవి అగుపించినది. "సంగీతమపి సాహి త్యం సరస్వత్యాః స్తనద్వయం" అని చెప్పుటచేత సరస్వతీదేవి స్తన ములు సంగీత సాహిత్యములకు సంకేతములుగా గ్రహింపవలయును. ఇక్కడ శృంగార రస ప్రసక్తి లేదు. కాబట్టి కంటినీరు సంగీత సాహి త్యములపై పడినది. ఆమె గట్టిగా వింపించలేదు. "Silence is eloquent than speech" ఆమె దుఃఖమునకు కారణము పోతన గ్రహించెను.

పోతన కాలములో కవులు కవితాకన్యను రాజుల కంకితము జేసెడివారు. రాజు లిచ్చిన ధన కనక వస్తు వాహనాదులను గ్రహించి పదిపుకూడు భుజించెడివారు. అట్లే రాజాస్థానములయందు సంగీతసభ లలో పాడి గాయకులు ధన మార్జించెడివారు. సంగీత సాహిత్యముల నమ్మకొని జీవించుచున్నారని సరస్వతీదేవి దుఃఖించినదని పోతన

గ్రహించెను. అంత త్రికరణశుద్ధిగా పోతన ప్రతిజ్ఞచేసెను. తన కవితా కన్యను రాజుల కంకితముగా నొసగనని మనస్సులో అట్లు తలపోయ ననీ, వాక్కుతో చెప్పనని, చేతులతో అంకితమివ్వనని ప్రతిజ్ఞచేసెను. భాగవతమును భగవంతున కంకితముజేసి పునర్జన్మ లేకుండ చేసికొనెను "నిజదారసుతోదర పోషణార్థమై" హాలికు డయ్యెను.

సంగీత సాహిత్యములకు సంకేతములైన సరస్వతీ స్తనములపై కన్నీరు పడినదనుట ఎంతటి ఉదాత్తభావమో, ఔచిత్యమో పరికింపుడు. ఇందులో పోతన రసికతగాని, అసభ్యతగాని సరస్వతి అంగవర్ణనము గాని లేదు. అతని ఉదాత్తభావనా పటిమ తెల్లమగుచున్నది. అందులకే ఘోరదారిద్ర్యము ననుభవించియు పోతన ఎట్లు భాగవతము వ్రాయగలిగెనని వసురాయకవి ఆశ్చర్యము వ్యక్తపరచెను.

సీ॥ రాజ రాజేంద్ర సామ్రాజ్య భోగములందు
నన్నయభట్టు వాల్గొన్నవాడు
మనుమ సిద్ధీశ క్షమాచక్ర మరుదార
తిక్కన్న తనచేత ద్రిప్పినాడు
వీరభద్రారెడ్డి విరివియౌ విభవంబు
శ్రీనాథు డెంతొ భుజించినాడు
.... .... ....
వెలుగు పడనేల వారి కవిత్వమునకు
బ్రతుకుపై యాసకూడను బాడు సేయు
ఘోర దారిద్ర్య దుఃఖంబు గుడుచు చకట
ఏ గతిని బల్కె పోతన్న భాగవతము?

# పరిశీలించిన గ్రంథముల పట్టిక


1) భాగవతము
2) భారతము
3) రామాయణము
4) భగవద్గీత-శంకర భాష్యము
5) భగవద్గీత-S. Radha Krishna వ్యాఖ్య
6) భగవద్గీత-బాలగంగాధర తిలక్
7) గీతా దర్శనము-పరమహంస నారాయణస్వామి
8) గీతా మకరందము
9) Synthetic Phylosophy of Bhagavatha by Ram Narayan Vyas
10) శ్రీ సీతారామాంజనేయ సంవాదము
11) రామస్తవ రాజము-మల్లయామాత్య
12) దేవీగీత
13) స్కందగీత
14) రమణగీత
15) ఉపదేశ సారము
16) సత్‌దర్శనము
17) గాయత్రీ అనుష్ఠాన తత్త్వప్రకాశిక
18) అనుభూతి ప్రకాశిక-విద్యారణ్యులు
19) దక్షిణామూర్తి కల్పము
20) ఆంధ్ర వాఙ్మయ చరిత్ర-కవిత్వవేది
21) Lectures divine
22) నృసింహతాపిని ఉపనిషత్తు

23) యోగకథోపనిషత్తు
24) రామతాపిని ఉపనిషత్తు
25) పరమేశ్వర శతకము
26) లలితా సహస్రనామము
27) సంగీతసార సంగ్రహము
28) త్యాగరాజ కృతులు
29) బృహదారణ్యకము
30) రామ రహస్యోపనిషత్తు
31) Short stories of Rajagopalachari
32) వేదాంత ప్రక్రియా ప్రత్యభిజ్ఞ-శ్రీ సచ్చిదానందేంద్ర సరస్వతి స్వాములు
33) ఉత్తర హరివంశము
34) దాశరథీశతకము
35) "ఇదంతా"
36) కేనోపనిషత్తు
37) ముక్తికోపనిషత్తు
38) త్రిపురా రహస్యము
39) ఆత్మోపనిషత్తు
40) మాండూక్యోపనిషత్తు
41) భగవన్నామ కౌముది
42) శ్రీమద్భాగవత మాహాత్మ్యము. (తోయనపల్లి వేంకటాచార్య ప్రణీతము)
43) ఉత్తరగీత



# తప్పొప్పుల పట్టిక

| పేజీ | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 2 | 9 | పురుషోగ్ర | పరుషోగ్ర |
| 3 | 26 | ఆక్మభావము | ఆత్మభావము |
| 4 | 12 | భక్తుపహృతం | భక్త్యుపహృతం |
| | | అశ్నామ | అశ్నామి |
| 5 | 17 | వస్త్రైక్య | వస్త్రైక్య |
| 10 | 7 | పరీక్షిత్తుని | పరీక్షిత్తును |
| 13 | 3 | పరాయత్తము | పదాయత్తము |
| 14 | 16 | శుకుడు | పరీక్షిత్తు |
| 15 | 16 | ఆభాసి | అభ్యాసి |
| | 17 | కటపటి | కడపటి |
| 17 | 22 | 2-2-14 | 3-927 |
| 19 | 1 | జయాత్పవః | జయాత్పునః |
| | 16 | నయ్యేది | నయ్యేడి |
| 22 | 13 | గుణధర్మ | కులధర్మ |
| 28 | 13 | యోగ | delete |
| 31 | 6 | నిర్మూలించెను | నిర్మూలించును |
| 32 | 16 | న్యత్వేచ | న్యత్వేచ |
| 34 | 4 | దుత్తైమ | దుత్తమ |
| | 14 | రజోతమోగుణ | రజస్తమోగుణ |
| | 23 | కాంజిక | కాంజక |
| 37 | 14 | మదయాప | మదయాస్త |
| 46 | 16 | బలంబుల | మలంబుల |
| 49 | 4 | చుండును | చుండెను |
| | 20 | లేదన భరతుని | లేదనగా ఆరాజు భరతుని |
| 50 | 2 | స్వాత్వత | సాత్వత |
| 53 | 26 | మరల | మీరలు |

| | | | |
|---|---|---|---|
| 54 | 4 | జా॰దవి | జాలదవి |
| | 18 | దకమ | దక్రమ |
| 58 | 18 | శమం బయ్యెడిన్ | శ్రమం బయ్యెడిన్ |
| 60 | 22 | దురభము | దుర్లభము |
| 64 | 17 | దీతఃని | దతనివి |
| | 21 | వర్తిల్లక | ప్రవర్తిల్లక |
| 68 | 11 | ఈశ్వరపథము | ఈశ్వరపరము |
| 70 | 22 | వైష్ణవాంఘి | వైష్ణవాంఘ్రి |
| 73 | 4 | ధర్వార్థ | ధర్మార్థ |
| | 15 | నిషుడనై | నిష్ఠుడనై |
| 74 | 19 | నీకు బ్రహ్మాదుల | నీకు నాకు బ్రహ్మాదుల |
| 76 | 11 | చూపబడెను | చంపబడెను |
| 92 | 13 | ఆత్మంతిక | ఆత్యంతిక |
| 93 | 16 | ఫలకమున | మనఃఫలకమున |
| 95 | 12 | గాయతీం | గాయత్రీం |
| 96 | 10 | చేయవలెను | చేయబడెను |
| | 27 | Ayans | Aryans |
| 97 | 16 | అతితములు | అతీతములు |
| 98 | 10 | దర్శింపబడినది | దర్శింపబడినవి |
| 107 | 22 | వ్రకా | వజ్రా |
| 116 | 3 | మూర్వంగ | గూర్వంగ |
| 122 | 7 | తత్వరతల్ | తత్పరతల్ |
| | 15 | అరునుని | అర్జునుని |
| | 17 | స్త్రీల | స్త్రీల |
| 123 | 1 | భగవంకుని | భగవంతుని |
| 129 | 19 | యంనును | యందును |
| 130 | 9 | నటౌట | నట్లౌట |
| 132 | 8 | కక్ష్యాంతంబుల | కక్ష్యాంతరంబుల |
| | 22 | దతనివి | దతనికి |

| | | | |
|---|---|---|---|
| 133 | 14 | అల్పజ | అల్పజ్ఞ |
| 135 | 2 | యర్థిమె యుక్త | యర్థిమెయి యుక్త |
| | 12 | సేంచెను | సేవించెను |
| | 8 | వేశించెను | ప్రవేశించెను |
| | 12 | తిజగదువైన | త్రిజగద్గురువైన |
| 143 | 11 | మధురభ | మధురభక్తి |
| | 17 | పరవశలె | పరవశలై |
| | 22 | వాకరిరంభం | వాక్పరిరంభం |
| 146 | 20 | గోపికలను | గోపికగను |
| 147 | 19 | ముచటల్ | ముచ్చటల్ |
| 155 | 5 | 2, 3 | 2, 1 |
| | 7 | రక్షణకూడ బోధన | రక్షణ బోధనకూడ |
| | 8 | దైనప్పటిని | దైనప్పటికిని |
| 168 | 2 | లేనివాదైచేయును | లేనివారవైచేయుము. |
| | 15 | జహాలీహ | జహా తీహ |
| 170 | 20 | భుజ్ట్కే | భుజ్త్కే |
| 175 | 18 | మత్త తరం నాన | మత్తః పరతరం నాస్తి |
| | 19 | సూతే | సూత్రే |
| 179 | 11 | శుచే | శుచౌ |
| | 14 | ప్రాణాపానే | ప్రాణాపానౌ |
| 180 | 2 | దాత్మ్యనైవ | దాత్మనైవ |
| | 25 | కలగుచు | లగుచు |
| 182 | 6 | యత్త పస్వసి | యత్తపస్యసి |
| 183 | 17 | దీనికి | దీనిని |
| 184 | 17 | భగవంతు | భాగవతు |
| 188 | 18 | ముకు | మునకు |
| 192 | 13 | నెదింప | నెదిరింప |
| 193 | 2 | అతిది | అతిథి |
| 195 | 21 | వర్తించశవలెను | వర్తించవలెను |

| | | | |
|---|---|---|---|
| 200 | 22 | కాని | కాన |
| 202 | 20 | పరమాక్మ | పరమాత్మ |
| 203 | 23 | అథిస్థాన | అధిష్ఠాన |
| 213 | 11 | స్వార్థబుద్ధి | నిస్వార్థబుద్ధి |
| 218 | 16 | డెంగము | డెందమున |
| 219 | 6 | ఉసిరగ | ఉసిరిక |
| 221 | 4 | జావినో | జ్ఞానినో |
| 222 | 8 | నారసి | శారసి |